# ఇందువు - క్రైస్తవుడా?

## [ ఇది మతమార్పిడి మీద బ్రహ్మాస్త్రం ]




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**


*www.thraithashakam.org*







# ఇందువు-క్రైస్తవుడా?

(ఇది మతమార్పిడి మీద బ్రహ్మాస్త్రం)


ఇందూ (హిందూ) ధర్మప్రదాత,

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Regd.No. : 168/2004)

త్రైత శకము-36 ప్రథమ ముద్రణ : సం॥ 2014

ప్రతులు : 1000 **వెల : 70/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు. (తెలుగు,ఇంగ్లీషు,కన్నడ)
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) వాస్తు శాస్త్రము (సత్యమా-అసత్యమా)
28) తల్లి తండ్రి.
29) గురు ప్రార్థనామంజరి.
30) త్రైతారాధన.
31) సమాధి.
32) ప్రబోధ.
33) సుబోధ.
34) ప్రసిద్ధి బోధ.
35) సుప్రసిద్ధి బోధ.
36) సిలువ దేవుడా?
37) మతాతీత దేవుని మార్గము.
38) సృష్టికర్తకోడ్-963.
39) మతము-పథము.
40) ప్రబోధానందం నాటికలు.
41) ఇందువు క్రైస్తవుడా?
42) త్రిత్వమా? ద్విత్వమా?
43) నిగూఢ తత్త్వార్థ బోధిని.
44) ఆత్మలింగార్థము.
45) నాస్తికులు-ఆస్తికులు.
46) హేతువాదము-ప్రతివాదము.
47) గుత్తా.
48) ప్రబోధ తరంగాలు.
49) త్రైత సిద్ధాంతము.
50) రూపము మారిన గీత.
51) ఉపనిషత్‌లలో లోపాలు.
52) బైబిల్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
53) ఖురాన్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
54) ద్రావిడ బ్రాహ్మణ.
55) తీర్పు.
56) కర్మ పత్రము.
57) ప్రవక్తలు ఎవరు?
58) ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత.
59) ధర్మశాస్త్రము ఏది?
60) త్రైతశక పంచాంగము.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

DVD'S

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-
లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-
మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.

51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. జీర్ణ+ఆశయము
69. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
70. దేవునికి మతమున్నదా?
71. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
72. ఏది ధర్మము
73. అధర్మ ఆరాధనలు.
74. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
75. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
76. నిదర్శ - నిరూప
77. నటించే ఆత్మ
78. సంచిత కర్మ
79. గురువు ఎవరు?
80. శ్రీకృష్ణుడు ఎవరు?
81. సుఖము-ఆనందము
82. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
83. భయం
84. దశ-దిశలు.
85. ఆడించే ఆత్మ
86. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
87. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత



యూ ట్యూబ్ వీడియోలు
http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, 9948191506, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక**

**(రాష్ట్రకార్యాలయము)** Fax : 040-24146006.
శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్,
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
9848057951, 9491877239, 9848590172.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

ఇ.నెం.76/97/29, కోట్లనగర్ ప్రక్కన,
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు (జిల్లా).
Cell : 9440244598, 9849303902,

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి
పల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)

ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా)
Cell : 9848574803, 9502932941.

*****

**టి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

భాగ్యనగర్ ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥),
హిందూపురం (తా), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)

బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి,
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell :9440556968, 9290012413,
9440601136.

*****

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)

చవటపాల్యం (గ్రా), గూడూరు (మం),
నెల్లూరు జిల్లా. Cell : 9494631664,
9490809181, 8106065300.

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)

డోర్ నెం. 24-4-178, గోవింద నిలయం,
శాంతినగర్, నెల్లూరు జిల్లా - 524003.,
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)

బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు (జిల్లా)., Pin : 523322.
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

రామానుజం స్కూల్ దగ్గర, ఉప్పరవీధి,
గుత్తి, అనంతపురం (జిల్లా)
Cell : 9491362448, 7382986963.

**మంగం చంటి** (ప్ర.సభ్యుడు)
సీతమ్మపేట, గురుద్వార జంక్షన్,
శాంతిపురం, విశాఖపట్నము.
Cell : 9948663149, 9440134499

*****

**డా॥బి.ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
విశాఖ రోడ్, శృంగవరపు కోట
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**బి.శాంతరాజు** (ప్ర.సభ్యుడు)
ఇంటి నెం.20-18/1-22, ప్లాట్ నెం.43,
క్రిష్ణరాజపురము, విజయనగరము (జిల్లా).
Cell : 9640526520, 9573335559

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
కమ్మపాలెం వీధి, క్రొత్త చెరువు (గ్రా, మం)
అనంతపురం జిల్లా. Cell : 9493622669,
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఇంటి నెం.19-10-17, ఏటుకూడు రోడ్,
దర్గామాన్యం, గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
ఇంటి నెం.2-23, నెహ్రూవీధి, బంగారు
పాళ్యం (గ్రా, మం), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా) - 531162.
Cell : 9441567394, 9502172711.

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మద్దిగట్ల (గ్రా), పెద్దమందడి (మం),
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409,
9701261165.

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
మెయిన్ రోడ్డు, బొద్దాం (గ్రా),
రాజాం (మం), శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
మోటుపల్లివారి వీధి, బుధవారము
మార్కెట్, భీమవరం-1, పశ్చిమగోదావరి.
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా, మం), కదిరి (తా),
అనంతపురం జిల్లా-515511.
Cell : 9440980036, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నిరంజన్ టైమ్స్, తహశీల్దార్ ఆఫీస్
ఎదురుగా, నేతాజిరోడ్డు కుప్పం,
చిత్తూరు జిల్లా., Cell : 9652755110.
: 9440305700

# ఇందువు - క్రైస్తవుడా?



ఈ గ్రంథము యొక్క పేరునుబట్టి ఇదేదో మతద్వేషమునకు సంబంధించినదేమో అని కొందరనుకొనుటకు అవకాశముకలదు. మా గ్రంథములలో మతసామరస్యమే ఉంటుందిగానీ, మతద్వేషము ఉండదు. మేము అన్ని మతములనూ, అన్ని మత గ్రంథములనూ సమాన దృష్ఠితో చూస్తాము. అందువలన మా వద్ద మతద్వేషము అను మాటే ఉండదు. ఏ మతస్థుడైనా దేవునికీ, దేవుని జ్ఞానమునకూ వ్యతిరేఖముగా ప్రవర్తించు చుండినా, బోధించుచుండినా, దేవుని పక్షముననున్న నేను దానిని ఖండించడము జరుగుచుండును. వారు చేయుచున్న తప్పును ఖండించడమే కాక, వారి తప్పును శాస్త్రబద్ధముగా తప్పని వివరించి చెప్పి, అటువంటి తప్పును చేయకుండునట్లు వారికి పూర్తిగా అర్థమయ్యేలాగున చేయుదుము. దేవుని వైపునుండి నేను చేయవలసిన పని అదియే, కనుక ఎవరి తప్పునైనా విప్పి చెప్పవలసి వచ్చుచున్నది.

గతములో 'బుజుదర్శిని' అను పుస్తకమును చూచి, అందులో మతద్వేషము తప్ప వేరు జ్ఞానములేదని గ్రహించి, అందులోని లోపములను తీసివేస్తూ, దేవుని జ్ఞానమునకు విలువ ఉండునట్లు, దానిని కొన్ని విషయము లలో ఖండించుచూ, కొన్ని విషయములలో సవరించుచూ ప్రత్యేకముగా ఒక గ్రంథమును వ్రాయవలసివచ్చినది. అలా వ్రాసిన గ్రంథము పేరు **"మతాతీత దేవుని మార్గము".** ఇప్పుడు కూడా ఇందువు క్రైస్తవునిగా మారగలడా అను సమస్యను వివరిస్తూ, ఒక ఇందువు ఎప్పటికీ క్రైస్తవునిగా మారలేడని, ఎవరూ మార్చలేరని తెలుపుచూ **"ఇందువు-క్రైస్తవుడా?"** అను గ్రంథమును వ్రాయవలసి వచ్చినది. ఇందులో దేవుని జ్ఞానమునకు వ్యతి రేఖముగాయున్న విషయములను మాత్రము ఖండించి, సరియైన మార్గమును చూపుచూ వ్రాయడము జరిగినదని ముందే చెప్పుచున్నాము. దేవుని

మార్గములోని కంపనూ, కల్లనూ తీసివేసి, దేవుని జ్ఞానములో మనుషులు కలుపుకొన్న కాలుష్యమును తీసివేసి, స్వచ్ఛమైన మార్గమునూ, స్వచ్ఛమైన జ్ఞానమునూ అందివ్వడమే ఇందులోని ఉద్దేశ్యము. దైవ గ్రంథములను ఆధారము చేసుకొని, వాటిలో దేవుడు సూచించిన జ్ఞానమునే చూపుచూ, దాని ప్రకారము మనుషులు చేయుచున్న తప్పులను తెలుపడము తప్ప స్వయముగా నేను దేనినీ ఖండించలేదు.

భూమిమీద ప్రతి మనిషీ ఏదో ఒక మతములోనున్న కుటుంబములో పుట్టడము జరుగుచున్నది. నేను హిందువుల కుటుంబములో పుట్టాను. పుట్టిన కొన్ని సంవత్సరముల వరకు మతము అనుమాటే నాకు తెలియదు. కొంత కాలము గడచిన తర్వాత నేను ఏ మతములో పుట్టానో తెలియకున్నా, మొదట ఇతర మతములను గురించి కొంత తెలియడము జరిగినది. వాడు ముస్లీమ్, వీడు క్రైస్తవుడు అని కొందరంటూవుండగా విన్నానుగానీ, మతము అనునది మానవ జీవితములో ఎంతో లోతుగా చొచ్చుకొని పోయినదని తెలియదు. తర్వాత కొంత కాలమునకు నేనున్నది హిందూమతమని తెలిసిపోయినది. కొన్ని దేవతారాధనలు చేయు సందర్భములో మేము హిందువులము అను విషయము కొంత అర్థమైనది. నేను హిందూ మతములో పుట్టిన దానివలన చాలా ఆలస్యముగా నేనున్న మతమును గురించి నాకు తెలిసినది. అదే ముస్లీమ్ కుటుంబములోగానీ, క్రైస్తవ కుటుంబములోగానీ పుట్టియుంటే ఏడు లేక ఎనిమిది సంవత్సరముల లోనే నేను ఫలానా మతస్థుడనని తెలిసిపోయివుండెడిది. ఎందుకనగా! వారు చిన్న వయస్సు పిల్లలను కూడా వారి ప్రార్థనలలో పాల్గొనునట్లు చేయడము వలన చిన్న వయస్సులోనే వారి మతమును గురించి, వారు ఆరాధించు దేవుని గురించి వారికి కొంత తెలియును. అలా చిన్న

వయసులోనే ప్రారంభమైన మతాభిలాష వయస్సు పెరుగుకొద్దీ మతాభి మానముగా కూడా పెరిగిపోవును. ఎప్పుడైతే ఇది నా మతమని దానిమీద అభిమానమును మనిషి పెంచుకొనునో, అప్పుడు తనకు తెలియకుండగనే ఇతరుల మతముల మీద అసూయ పెరిగిపోవును. ఎక్కడ మాట్లాడినా తన మతమును గురించి గొప్పగా, ఇతరుల మతములను గురించి తక్కువగా మాట్లాడడము మొదలుపెట్టును. వయస్సు పెరుగుకొద్దీ స్వమతాభిమానము ఒకవైపు, పరమత ద్వేషము మరొకవైపు పెరిగి, చివరకు మనిషి పూర్తి ఒక మతవాదిగా మారిపోవుచున్నాడు. పుట్టుకలో మత ప్రసక్తే లేని మనిషి తాను పుట్టిన కుటుంబమునుబట్టి, కుటుంబములోని వారు తనవారేననీ, అట్లే తన కుటుంబము యొక్క మతమే తన మతమని అనుకోవడము జరుగుచున్నది.

ఇదంతయు గమనిస్తే ఒక మనిషి ఒక మతమును గురించి చెప్పుకోవడము భూమిమీద సహజ సిద్ధమైపోయినది. ఒక మనిషి ఒక మతమును సమర్థించుచూ మాట్లాడడము సహజమైనప్పుడు, ఇతర మతములను గురించి వ్యతిరేఖముగా మాట్లాడడము కూడా సహజసిద్ధమై పోయివుండును. తనది అనుకొని ఒక మతమును సమర్థించు మనిషి, ఇతరులదని మిగత మతములను విమర్శించుచుండును. దీనినిబట్టి ఒక మనిషిలో అన్ని మతములను సమానముగా గౌరవించు మతసామరస్యము ఉండదని తెలియుచున్నది. సాధారణ మనిషి అయినవాడు మిగత మతమును గురించి విమర్శించలేరు, తన మతమును గౌరవించినట్లే ప్రక్కనున్న మరొక మతమును కూడా గౌరవించుచున్నాడు అంటే, అది కొంత గొప్పగానే బయట ప్రజలకు కనిపించును. అయినా అందులో మనము గమనించవలసినది ఏమనగా! భూమిమీద ముఖ్యముగాయున్న

మూడు మతములలో, ఒక మతములోని వ్యక్తి మిగిలిన రెండు మతములలో ఒక మతమును గూర్చి మాత్రము కొంత గౌరవముగా మాట్లాడుచుండును. అయితే మిగిలిన మరొక మతము మీద పూర్తి అసూయ కల్గియుండును. తన మతము మీద ఎంత ప్రేమగలదో రెండవ మతము మీద అంత ప్రేమ లేకున్నా, కొన్ని విషయములలో రెండవ మతములోని కొన్ని గ్రంథములను సమర్థించి మాట్లాడుట వలన, అతను రెండవ మతమును సమర్థించినట్లు కనిపించినా, అది తన మతమును అభివృద్ధి చేసుకొనే దానికేనని ఎవరికీ తెలియదు. అటువంటివాడు మూడవ మతము మీద పూర్తి ద్వేషము కల్గియుండును. మూడు మతములను సమానముగా గౌరవించువాడు బహుశా ఎవడూ ఉండడు. తన మతము మీద ప్రేమ గల్గినవాడు రెండవ మతమును కొంత సమర్థించినా, అదియూ తన మతమును పెంచుకొనుటకే అని చెప్పాము. కొంతయినా భేద భావము లేకుండా మూడు మతములను ఆదరించువాడు, ఒకే గౌరవముతో మాట్లాడువాడు ఎవడైనా భూమిమీద ఉంటే, వాడు సాధారణ మనిషియై ఉండడు.

ఒక మతస్థుడు రెండవ మతమును కొంత సమర్థించడము అక్కడక్కడ కనిపించుచున్నది. అటువంటివాడు రెండవ మతమును పూర్తిగా సమర్థించక, తన మతము అభివృద్ధి అగుటకు కావలసిన విషయములను మాత్రము సమర్థించుచుండును. ఉదాహరణకు కొందరు క్రైస్తవ బోధకులు హిందూమతములోని వేదములను సమర్థించుచూ, అందులోని కొన్ని వాక్యములను గొప్ప వాక్యములుగా చెప్పుచుందురు. అటువంటివారు హిందూమతమును పూర్తిగా సమర్థించకుండా, హిందూమతములోని వేదములను మాత్రము సమర్థించి చెప్పుచుందురు. అదియూ వేదములందు

తమ మతమునకు ఉపయోగపడు కొన్ని శ్లోకములను మాత్రము తీసుకొని వాటికి అర్థము చెప్పుచుందురు. అట్లు చెప్పబడు విషయమంతయు తమ మతమును ఉద్దేశించి వేదములలో కూడా కలదనీ, వేదములు కూడా తమ మతమును సమర్థించుచున్నవనీ చెప్పుచుందురు. ఈ విధముగా తమ మతమును అభివృద్ధి చేసుకొను నిమిత్తము కొందరు క్రైస్తవ బోధకులు హిందూమతములోని వేదములను సమర్థించుచున్నారు. అంతమాత్రమున వారు హిందూమతమునంతటినీ సమర్థించారనుకోవడము పొరపాటు. హిందూమతములోని గ్రంథములలో గల కొన్ని శ్లోకములను లేక కొన్ని వాక్యములను తమ మతమును సమర్థించుచున్నవని చెప్పుచూ, చివరకు తమ మతమును గురించి ప్రచారము చేసుకొనుచుందురు. వేదములలో ఏసును గురించి చెప్పారనీ, వేదములలో రక్తప్రోక్షణము వలన పాప పరిహారము కలదని చెప్పారనీ, ఇంకా ఎన్నో విషయములు క్రైస్తవ మతమును గురించి వేదములలో చెప్పియున్నారనీ ప్రచారము చేయుచుందురు.

అదే విధముగా ముస్లీమ్‌లలో కొందరు బోధకులుగాయున్నవారు కొన్ని సంఘములను ఏర్పరచుకొని, తాము ఇతర మతములను కూడా సమానముగా గౌరవిస్తామని చెప్పుకొనుచుందురు. అటువంటివారు హిందూమతములోని వేదములను, ఉపనిషత్తులను, పురాణములను, చివరకు భగవద్గీతను కూడా వాడుకొనుచూ, అందులో వారికి అవసరమైన శ్లోకములను, వాక్యములను, పద్యములను చెప్పుచూ అవన్నియూ తమ మతమును బలపరుస్తున్నవని చెప్పి ప్రచారము చేసుకొనుచుందురు. ఇదంతయు ఒక పథకము ప్రకారము తమ మతమును ప్రచారము చేసుకొను నిమిత్తము చెప్పునది తప్ప, హిందూమతమును పూర్తిగా సమర్థించుటకు కాదు. ఉదాహరణకు దేవుడు మనిషివలె పుట్టడు అను ఖుర్‌ఆన్‌లోని

విషయమును సమర్థించుటకు, దానికి సరిపడు శ్లోకమును భగవద్గీతనుండి చెప్పి, ఖుర్‌ఆన్‌లో చెప్పిన విషయమునే భగవద్గీతలో కూడా చెప్పారని చెప్పుచుందురు. ఇక్కడ హిందూమతములోని భగవద్గీతనూ, దానిలోని శ్లోకమునూ చెప్పినా, అది తమ మతమును ప్రచారము చేయు నిమిత్తమేనని తెలియుచున్నది. భగవద్గీతలోని వారికి అవసరమైన శ్లోకములను మాత్రము తీసుకొని చెప్పుదురుగానీ, భగవద్గీతలో దేవుడు మనిషిగా పుట్టుతాడు అని ఉన్న శ్లోకమును మాత్రము చెప్పరు.

వేదములు, వేదములలోని ఉపనిషత్తులు, భగవద్గీత మరియు పురాణములను అన్నిటిని ఉపయోగించుకొనుచూ, ఎక్కడ ఏది అవసరమో దానిని చెప్పుచూ క్రైస్తవులు తమ మతమును ప్రచారము చేసుకోగా, అలాగే ముస్లీమ్‌లు కూడా ప్రత్యేకముగా సంఘములను ఏర్పరచుకొని, ఆ సంఘముల అధ్యక్షులు ఒకరికంటే మరొకరు పోటీగా హిందువుల గ్రంథములను వాడుకొనుచూ, అందులోనుండి వారికి అనుకూలమైన శ్లోకములను, వాక్యములను వాడుకొనుచూ, వారి మతమును గొప్పగా చెప్పుకోవడము జరుగుచున్నది. ఇదంతయు గమనిస్తే హిందూమతములోని గ్రంథములన్నియు ఇటు బైబిలునూ, అటు ఖుర్‌ఆన్ గ్రంథమునూ సమర్థిస్తున్నట్లు కనపడుచున్నది. హిందూమతమును చూపించుచూ మిగతా రెండు మతములు తమ తమ మతములను ప్రచారము చేసుకోవడము తప్ప, వారు హిందూ మతమును సామరస్యముగా చూచినట్లు ఏమాత్రము కనిపించడములేదు. మొత్తము మీద మతపిచ్చి తప్ప దైవభావముగానీ, జ్ఞానప్రసక్తిగానీ వీరి పనులయందు కనిపించడములేదు. ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రావచ్చును. అదేమనగా! అన్నిటిని సృష్ఠించిన దేవుడు మతములను ఎందుకు సృష్ఠించాలి? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు.

దేవుడు జ్ఞానమును సృష్ఠించాడుగానీ, మతములను సృష్ఠించలేదు. మతము అనునది ప్రాథమిక అజ్ఞానమని మేము చాలామార్లు చెప్పాము. దేవుడు తన జ్ఞానమును రెండు దేశములలో నాలుగుమార్లు తెలియజేశాడు. దేవుడు తన ధర్మమును అనుసరించి ఎవరితోనూ నేరుగా మాట్లాడడు. అయితే ఆయన (దేవుడు) ప్రత్యక్షముగా ఎవరితో మాట్లాడకున్నా, పరోక్షముగా మాట్లాడవచ్చునను సూత్రమును బట్టి, తన జ్ఞానమును గ్రహములైన ఇద్దరిచేత రెండుమార్లు, మనుషులవలెనున్న తన దూతలచేత రెండుమార్లు, రెండు దేశములలో తన జ్ఞానమును చెప్పించాడు. అలా చెప్పించిన జ్ఞానములో ఒక గ్రహమూ, ఒక దూత (మనిషివలెనున్న భగవంతుడు) చెప్పిన జ్ఞానము భగవద్గీత అను ప్రథమ దైవ గ్రంథముగా బయలుపడినది. అట్లే మరొక గ్రహము చెప్పిన జ్ఞానము ఖుర్ఆన్ గ్రంథము గానూ, వచ్చిన దూత చెప్పిన జ్ఞానము బైబిలు గ్రంథముగానూ తయారు కావడము జరిగినది. మొత్తము మీద దేవుడు తెలియజేసిన దేవుని జ్ఞానము మూడు గ్రంథములైనది. ఆ మూడు గ్రంథములలోనిది దేవుని జ్ఞానమే, కనుక ఆ మూడు గ్రంథములను మూడు దైవ గ్రంథములని చెప్పడము జరిగినది.

దేవుడు తన విధానమ ులను (ధర్మములను) మనుషులకు తెలుపుటకు మూడు దైవ గ్రంథములను, మూడు కాలములలో ఇవ్వగా, మనిషి ఆ మూడు గ్రంథములను తీసుకొని, దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకారము కాకుండా, తన స్వంత జ్ఞానముతో మూడు గ్రంథములను మూడు మతములను పుట్టలుగా తయారు చేసుకొని తాము ఆ పుట్టలలో నివశించు చెదలుగా మారిపోయాడు. ప్రపంచములో దేనిని చేయుటకుగానీ ఏమాత్రము స్వతంత్రత లేని మనిషికి, దేవుడు ఒకే ఒక స్వాతంత్ర్యమును

ఇచ్చాడు. ఒకే ఒక దేవుని విషయములో మాత్రము మనిషికి స్వతంత్రము కలదు. ప్రపంచ విషయములలో మనిషికి ఏమాత్రము స్వతంత్రత లేదు. మనిషిని కర్మ తన వశములో ఉంచుకొని కర్మప్రకారమే నడిపించుచున్నది. దేవుని విషయములలో కర్మ పని చేయదు. కర్మాతీతమైనది దైవము. అందువలన దేవుని విషయములో మనిషిని తన ఇష్టము ప్రకారము నడుచు కొనునట్లు దేవుడే మనిషికి స్వాతంత్ర్యమునిచ్చాడు. దేవుని విషయములో స్వాతంత్ర్యత కల్గిన మనిషి దేవుడిచ్చిన మూడు దైవ గ్రంథములను తీసుకొని తన ఇష్టమొచ్చినట్లు మూడు మతములను సృష్ఠించి, వాటికి ఆధారము మూడు గ్రంథములని భగవద్గీతను, బైబిలును, ఖుర్ఆన్‌ను చూపడము జరిగినది. అలాచూపడమే కాకుండా మూడు దైవ గ్రంథములను మూడు మత గ్రంథములుగా వర్ణించి చెప్పడము జరిగినది. అందువలన మూడు మతములలో ఒక్కొక్క మతమువారు ఒక్కొక్క గ్రంథమును తమ మత గ్రంథముగా చెప్పుకొంటున్నారు. తాము ఖుర్ఆన్ గ్రంథము ప్రకారము అనుసరించుటవలన తమది ప్రత్యేక మతముగా ఉన్నదని ముస్లీమ్‌లు అనుచున్నారు. అట్లే తాము బైబిల్ గ్రంథమును అనుసరించుట వలన క్రైస్తవులమైనామని కొందరంటున్నారు. అదే విధముగా తాము ముస్లీమ్, క్రైస్తవులకు వేరుగానున్న హిందూమతముగా ఉన్నామని కొందరంటున్నారు. అయితే హిందువులలో కొందరు తమ గ్రంథము భగవద్గీతయని, కాదు తమ గ్రంథములు వేదములని కొందరూ అంటున్నారు. క్రైస్తవ మతము వారికి బైబిలు, ముస్లీమ్ మతము వారికి ఖుర్ఆన్ గ్రంథము ఆధారమని వారు చెప్పుచుండగా, హిందువులు మాత్రము తమ గ్రంథమేదో కూడా సరిగా తెలియని స్థితిలో ఉంటూ కొందరు భగవద్గీతయంటే, కొందరు వేదములని అంటున్నారు. అంతేకాక ముస్లీమ్‌లు తమ దేవుడు “అల్లాహ్” అనీ, క్రైస్తవులు తమ దేవుడు “యెహోవా” అని అంటూ ఉంటే, హిందువులు

మాత్రము తమ దేవుడు ఎవరో చెప్పలేని స్థితిలో ఉండి ఒక్కొక్కరు ఒక్కొక్క దేవున్ని తెలుపుచూ, రాముడని, రంగడని, విష్ణువని, ఈశ్వరుడని అనేక మందిని చెప్పుచున్నారు.

ఆధ్యాత్మిక విషయములలో జీవునికి స్వాతంత్ర్యమునిచ్చి, దైవ మార్గములో కర్మబంధము లేకుండా దేవుడు చేసి, మనిషికి స్వేచ్ఛనిచ్చుట వలన మనిషి తన భక్తి మార్గములోనే మతమును సృష్ఠించుకొన్నాడు. మతము అనునది దైవమార్గములో ముఖ్యమైన విశ్వాసమార్గమని అనుకొని, ఈ మతములో తప్ప ఏ మతములోనూ దేవుడు తెలియబడడు అని చెప్పుకొనుచూ, తమ మతమే నిజమైన దేవుని మార్గమను నమ్మకముతో ప్రతిమనిషి యున్నాడు. మతము అనునది దైవమార్గములో ప్రాథమిక అజ్ఞానమని తెలియలేకపోయారు. క్రైస్తవులలో, ముస్లీమ్‌లలో మతము వరకే అజ్ఞానము ఆగక, ఇంకా కొంత ముందుకు ప్రాకి మతములోనే కొన్ని తెగలు ఏర్పడి, మా తెగయే దేవునికి దగ్గరగాయున్నదని ఎవరికి వారు అనుకోవడము జరిగినది. ఆ రెండు మతములలో క్రైస్తవులు కొన్ని తెగలుగా ఉండగా, ముస్లీమ్‌లు ఏకంగా 74 తెగలుగా ఉన్నట్లు వినికిడి. అందులో "జమాయతే ఇస్లామ్" తెగ ప్రత్యేకమైనదికాగా మిగతాది సున్నీ జమావత్ తెగ అనియూ, సున్నీ జమావత్ తెగలోనే 73 భాగములున్న వనియూ, కొందరు ముస్లీమ్ పెద్దలు చెప్పగా విన్నాము. ఇక హిందూ మతమును చూస్తే కులములను పేరుతో వందలసంఖ్యతో హిందూమతము కలగూర గంపవలెకలదు. ముస్లీమ్ మతములో సున్నీ జమావత్ తెగకంటే జమాయతే ఇస్లామ్ తెగవారు మేమే నిజమైన భక్తులము, మా మార్గమే దేవునికి దగ్గరగా యున్న మార్గమని ఏక్‌మీనార్ మస్జీద్‌లను ఏర్పరచుకొని చెప్పుచుండగా, సున్నీ జమావత్ వర్గమువారు మేము ఎన్ని చీలికలుగాయున్నా

జమాయతే ఇస్లామ్ తెగకంటే మేమే దైవమార్గములో ముందున్నామని చెప్పుకొనుచూ, రెండు మీనార్‌ల మస్జీద్‌లు ఏర్పరచుకొని ప్రత్యేకముగా కనిపించుచున్నారు.

క్రైస్తవులు, ముస్లీమ్‌లు వర్గములు, చీలికలు అను రూపములో ఉండగా, హిందూ మతము కులములను రూపములో అనేక రంగుల గుడ్డలతో కుట్టిన బొంతగా తయారైపోయినది. అలా తయారవడమేకాక అందులో ఒక వర్ణము (కులము) వారు దేవుని ముఖమునుండి పుట్టినవారనీ, వారే దేవునికి దగ్గరవారనీ, మిగతా కులముల వారందరూ దేవునికి చేతుల యందునూ, తొడలయందునూ, పాదములయందునూ, పుట్టారనీ, చేతుల యందు పుట్టిన క్షత్రియులు రాజ్యమును పాలించు రాజులుగా ఉండవలెననీ, తొడలయందు పుట్టిన వైశ్యులు ఒకచోట కూర్చొని వ్యాపారము చేసుకోవాలని, పాదములందు పుట్టిన శూద్రులు పైన పుట్టిన మూడు తెగలవారికి సేవలు చేయు నిమిత్తమే ఉండవలెననీ, దేవుని ముఖమునందు పుట్టిన బ్రాహ్మణులు మాత్రము దేవుని ఆరాధన చేయుచూ దేవునికి దగ్గరగా ఉందురనీ ప్రచారము చేసుకొన్నారు. అలా ప్రచారము చేయడమేకాక ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో జ్ఞానయోగమున పదమూడవ (13) శ్లోకమునందు "చాతుర్వర్ణ్యం మయా సృష్టం" నాలుగు వర్ణములను మనుషులలో సృష్టించాను అని దేవుడు చెప్పగా దానిని వక్రీకరించి దేవుడు చెప్పిన భావమును వదలి తాము స్వంతముగా అర్థము చెప్పుచూ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు రకముల మనుషులను దేవుడు సృష్టించాడని చెప్పారు.

జనాభా శాతములో 90 పాళ్ళుగల శూద్రులను మిగతా వారికి సేవ చేయు నిమిత్తము నియమించి వారిచేత పనులను చేయించుకొనుచూ,

దేవుని జ్ఞానమునకు పూర్తి దూరముగా ఉంచారు. ఈ విధముగా హిందువులలో 90 శాతము మనుషులను దేవునికి దేవుని జ్ఞానమునకు దూరముగా ఉంచి, అంటరానివారిగా చెప్పి తమ వెంటవచ్చునట్లు చేసుకొన్నారు. మతమనునదే పెద్ద అజ్ఞానమని మేము చెప్పుచుండగా అందులో చీలికలు మరీ అజ్ఞానము. ప్రత్యేకించి హిందూమతములో శూద్రులను పేరుతో వారి మెదడులో దేవుడను భావము రాకుండా చేసి, దేవునికి అంటరాని వారని, దేవుని జ్ఞానమునకే దూరముగా ఒక వర్ణమువారు ఉంచడము అజ్ఞానములో మరీ పెద్ద అజ్ఞానమని చెప్పవచ్చును. ఎవరైనా శూద్రులుగా యున్న మాలాంటివారు దేవుని జ్ఞానమును బోధించితే, అగ్రవర్ణముగా పేరుగాంచినవారు పూర్తి అసూయచెంది, మేము తప్ప శూద్రులు ఎవరూ దైవజ్ఞానమునకు అర్హులు కాదను ఉద్దేశ్యముతో, యోగిగా యున్న మేము చెప్పు జ్ఞానము కూడా హిందువులది కాదనీ, పరమతమును బోధించుచున్నామనీ, ఏమీ తెలియని వారిని ప్రేరేపించి, మా మీదికి కూడా దాడులకు పంపినవారు కలరు. పైగా తాము హిందూధర్మ రక్షకులమని, మేము మా మతమును రక్షించు కొనుటకు భౌతికదాడులైనా చేస్తామని చెప్పుకొంటున్నారు. తమకు ఇష్టము లేని శూద్రులు జ్ఞానమును చెప్పితే, వారు హిందువులైనా పరమతము వారుగా కనిపిస్తారంటే హిందూమతము కులము అను అజ్ఞానములో ఎంతగా కూరుకుపోయివున్నదో చెప్పకనే అర్థమగుచున్నది.

క్రైస్తవ, ముస్లీమ్ మతములు రెండూ కొన్ని చీలికలుగాయున్నా అవి అన్నియు దేవుని విషయములో ముందుకు పోవుటకు పోటీపడుచున్నవి. ఒక దానికంటే మరొకటి ముందున్నామని చెప్పుకొంటున్నవిగానీ, హిందూ మతములో 90 శాతము జనాభాయున్న శూద్రులను దేవుని జ్ఞానమునకు

పూర్తి అనర్థము చేసినట్లు మిగతా ఏ మతములోగానీ, ఏ తెగనూ అంటరాని అనర్థులుగా చేయలేదు. హిందూమతము తప్ప మిగతా మతములవారు ఎన్ని తెగలుగా వారి అంతర్గతములోయున్నా బయటికి మాత్రము మా మతము మిగతా మతములకంటే గొప్పదనీ, దేవునికి దగ్గరగా యున్నదని చెప్పుకొనుచుందురు. మిగతా రెండు మతములైన క్రైస్తవ, ముస్లీమ్ మతములు రెండూ, దేవుని విషయములో ఏమీ తెలియక అనర్థులుగాయున్న హిందూమతములోని 90 శాతము శూద్రులను తమవైపు ఆకర్షించుకొని, తమ మతమును పెంచుకోవాలని ప్రయత్నము చేయను మొదలుపెట్టాయి. ఈ విధముగా ప్రయత్నము చేయు రెండు మతములలో క్రైస్తవ మతము ముందంజవేసి శూద్రులుగాయున్న అన్ని కులముల వారికి కొంత జ్ఞానము చెప్పి, జ్ఞానము యొక్క రుచి చూపించి తమవైపు లాగుకొన్నారు. జ్ఞానము మీద శ్రద్ధలేని వారికి కొంత ఉద్యోగ అవకాశములు ఇచ్చి బ్రతుకుతెరువును చూపించి కొందరినీ, ఆర్థిక ఇబ్బందులు తీర్చి కొందరినీ, చేసుకొన్న పాపములు లేకుండా పోతాయని చెప్పి కొందరినీ తమవైపు లాగుకొని క్రైస్తవులుగా మార్చుకొన్నారు. తమ గ్రంథమే ఆఖరి గ్రంథమనీ, దీని తర్వాత దేవుని జ్ఞానమే లేదనీ, నిజమైన దేవుడు మా మతములోనే తెలియుననీ, వారి ఉపాయముకొద్దీ వారు చెప్పుచూ కొంతమంది హిందువులను ముస్లీమ్‌లు లాగుకొన్నారు. వర్షము వచ్చిన రెండవరోజు భూమి నుండి ఉసుర్లు (ఒకజాతి పురుగులు) బయటికి వస్తే సులభముగా దొరికే ఆహారము కదాయని తేళ్ళు, కప్పలు మొదలగునవి తినుటకు వచ్చినట్లు సులభముగా తమ మాటలకు లొంగు హిందువులమీద మిగతా రెండు మతములూ వాలిపోయి, ఎవరికి దొరికిన వారిని వారు తమ మతములో చేర్చుకొని వారి మత ముద్రవేసి, హిందువు అను పేరును లేకుండా చేయుచున్నారు.

ఊరకనే దొరకు ఉసుర్లను తేళ్ళు, కప్పలు సులభముగా చిక్కించుకొని భక్షించునట్లు హిందూమతములో దేవుని జ్ఞానమునకు అనర్హులుగాయుండి ఏ దారీ తెలియని హిందువులను క్రైస్తవులు, ముస్లీమ్‌లు సులభముగా తమ మతములోనికి చేర్చుకోవడము జరుగుచున్నది. ముస్లీమ్‌లు కొంత ఆలస్యముగా ఆ పనిని ప్రారంభించినా, క్రైస్తవులు తెలివిగా ముందే వేట ప్రారంభించి భారతదేశములోని హిందువులను నలభై (40) శాతము పైగా క్రైస్తవులుగా మార్చివేసుకొన్నారు. కొన్ని ప్రాంతములలో నూటికి తొంభైమంది హిందువులనుండి క్రైస్తవులుగా మారిపోయారు. కొంత ఆలస్యముగా తమ మతము క్షీణించిపోవుచున్నదని తెలుసుకొన్న హిందువులు స్వమత రక్షణ అను నినాదమును తెరపైకి తెచ్చారు. చెరువులోని చేపలన్నిటినీ బెస్తవారే (మత్స్యకారులే) పట్టుకొని పోతే మాకు ఏమీ మిగలవని తలచిన కొంగలు బెస్తవారు తమ చెరువు దగ్గరకు రాకుండా చేయుటకు, చెరువు దగ్గరకు వచ్చిన వారిమీద దాడిచేసి, ముక్కుతో పొడిచి, కాళ్ళతో రక్కి, రెండూ చేతకానప్పుడు చివరకు వారినెత్తిన రెట్టవేసి చెరువుకు దూరముగా పోవునట్లు చేసెడివట.

బెస్తవారు చేపలను అమ్ముకొని బ్రతకాలనుకుంటే, వారినుండి కాపాడునట్లు కనపడు కొంగలు, చేపలను తామే తినవలెనని స్వార్థముతో దాడిచేశాయిగానీ, చేపలమీద దయతోకాదు. నెలకొకరో, వారమునకొకరో సమీప గ్రామమున ఎవరైనా చనిపోతే, వారు శవము యొక్క అంత్యక్రియలు చేసిన తర్వాత చేపలు తమ కాళ్ళను తాకకుండా దూరము పోవునట్లు నవధాన్యములను చెరువులో కలిపి స్నానము చేసిపోయెడివారు. అయితే అలా అంత్యక్రియల తర్వాత స్నానమునకు వచ్చి నవధాన్యములు చెరువులో కలిపి చేపలకు మంచి చేయు వారిని చూచిన కొంగలు, వారు కూడా

చేపలు పట్టనువచ్చారని తలచి, స్నానము చేయను వచ్చిన వారిమీద కూడా కొంగలు దాడి చేశాయట. చేపలకు ధాన్యము వేసి అవి పెరుగుటకు సహకరించు వారిమీద కూడా కొంగలు దాడిచేయడము చూచి అక్కడికి వచ్చినవారు, ఆ కొంగలకు గ్రుడ్డికొంగలని పేరుపెట్టారు. అలా పెట్టిన పేరు శాశ్వతముగా నిలిచిపోయినది. మాటల సందర్భములో గ్రుడ్డి కొంగల వలె పొరపాటుపడినారనుట వినుచుందుము.

హిందూమతములో శూద్రులందరూ చెరువులోని చేపలవలె ఉండగా, అగ్రకులము వారు కొంగలవలెవుండి, క్రైస్తవులు, ముస్లీమ్‌లు అను ఇతర మతములవారిని చేపలపట్టు వారుగా (బెస్తవారు) తలచి, తమ మతములో చేపలవలె నున్న శూద్రులను తమ ఆధీనములో లేకుండా చేయుచున్నారను భావముతో, హిందూ ధర్మరక్షణ సంఘములను ఏర్పాటు చేసి క్రైస్తవులను, ముస్లీమ్‌లను తమ మతమువద్దకు రాకుండా చేయుటకు, మత మార్పిడి చేయకుండా ఉండుటకు కొంత కృషి చేయుచున్నారు. చేపల సంరక్షణ తమ బాధ్యత అని చెప్పుచున్న కొంగలు, చేపలకు ఆహార ధాన్యమువేసి మంచి చేయు మనుషులమీద కూడా దాడిచేసి, గ్రుడ్డికొంగలవలె ప్రవర్తించి నట్లు, హిందూ రక్షకులమనువారు తమ మతమునకు జ్ఞానమును చెప్పి, సత్యమును తెలిపి ఇతర కులములకు, మతములకు లొంగకుండునట్లు చేయు జ్ఞానులను కూడా నమ్మక, వారుచెప్పు జ్ఞానము తెలియక, తమ మతములోని గురువుల మీద కూడా దాడిచేస్తూ గ్రుడ్డి కొంగలవలె ప్రవర్తించుచున్నారు. కొంగలు ఎవరు మంచివారని తెలియక దాడి చేసివుండవచ్చును. అయితే హిందూ మతములో జ్ఞానము చెప్పు గురువులు తమ జ్ఞానమునే చెప్పుచున్నారని తెలిసినా, కులపిచ్చితో మేమే గురువులుగా చెలామణి అవ్వాలి, మాకంటే తక్కువ కులము వారు గురువులుగా చెలామణి

కాకూడదను భావముతో, హిందువులకు జ్ఞానము చెప్పి మేలుచేయు వారిని పరమత బోధకులని పేరుపెట్టి గురువులైన వారిని కూడా హింసించను మొదలు పెట్టారు. ఈ విధముగా అగ్రవర్ణము వారు హిందూ మతములోని మిగతా కులముల వారిని పైకి రానివ్వకుండా చేయుట వలన హిందూ మతము అభివృద్ధి కాకుండా, ఉన్నది ఉన్నట్లు కూడా లేకుండా తొందరగా క్షీణించను మొదలు పెట్టినది.

మేము ఆధ్యాత్మిక విద్యలో యాభై గ్రంథములను రచించి నూట యాభై ఉపన్యాసములను చెప్పినా, మేము అగ్రకులమువారము కాదను సాకుతో, పరమతమును బోధిస్తున్నాడని నిందవేసి ప్రచారము చేసి ప్రజల నుండి దూరము చేయాలని హిందూధర్మ రక్షకులమనువారు చాలామార్లు ప్రయత్నించారు. వాస్తవముగా హిందూ ధర్మమంటే ఏమిటో తెలియని వారు, ధర్మరక్షకులమని పేరు పెట్టుకొన్నంతమాత్రమున ధర్మరక్షకులౌతారా? మేము చెప్పు జ్ఞానము ముందర వారి యుక్తులు, కుయుక్తులు ఏమీ చేయలేక పోయాయి. చివరకు ప్రజలు మా జ్ఞానములోని ఔన్నత్యమును గ్రహించిన వారై, మూడు మతముల వారూ మావద్దకు చేరి ఒకే జ్ఞానమును తెలియుట చేత అందరూ ఆశ్చర్యపోవడము జరిగినది. మా జ్ఞానములో దేవుడు అను విధానము తప్ప, మతము అను విధానము లేనిదానివలన, మూడు మతములవారు మా జ్ఞానమును తెలుసుకొని మా మతములు వేరైనా మా జ్ఞానము ఒక్కటే, మా దేవుడు ఒక్కడే అని చెప్పుకోవడము మాకు సంతోష దాయకమే అయినా, కొందరు హిందువులకే మామీద అసూయగా ఉండడమూ, అదియూ ఒక వర్గమునకు చెందినవారికే అసూయగా ఉండడమును చూస్తే హిందువులలో మత మాయయే కాకుండా, కులపిచ్చి అను రోగము కూడా తీవ్రముగా ఉన్నదని చెప్పవచ్చును. ఇంతవరకు

నేడు భూమిమీద మూడు మతములున్న విధానము, ఆ మూడు మతములు ఎంతెంత అజ్ఞానములో ఉన్నది, సూచన ప్రాయముగా చెప్పుకొన్నాము.

ఇటువంటి పరిస్థితులలో ఒక యోగిగా మేము చేయవలసిన బాధ్యత ఏమిటి? అని యోచించి ప్రజలందరికీ మూడు మతములలో మాయ ఎంత తీవ్రముగా ఉన్నదో, ఉన్నదున్నట్లు తెలుపాలనుకొన్నాము. అలా తెలుపడము వలన మతము అను మాయ ఉచ్చులో (వలలో) మనిషి చిక్కుకోకుండా ఉండగలడనీ, అలా ఉన్నప్పుడే మనిషికి అసలైన జ్ఞానము తెలిసి, అసలైన దేవున్ని ఆశ్రయించగలడని తలచాము. దేవుడు తెల్పిన అసలైన ధర్మములు మూడు మూల గ్రంథములైన గీత, బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములలో కలవని తెలుపాలనుకొన్నాము. అది తెలిసినప్పుడు అన్ని మతములు దేవుని దృష్ఠిలో సమానమని తెలియును. అలా తెలిసినప్పుడు భూమిమీద మతమార్పిడులు అను సమస్యే ఉండదు. మతమార్పిడులు లేనప్పుడు మతద్వేషములు ఉండవు. అప్పుడు జగత్ ఏక కుటుంబమగును.

జగదేక కుటుంబము అగుటకు మావంతు బాధ్యతగా మేము కృషి చేయవలసియుండును. ఆ నేపథ్యములో కొన్ని మతములలో మనుషులు చేయు తప్పులను కొన్ని చోట్ల ఎత్తి చూపి వాటిని సవరించవలసియుండును. అలాగే కొన్ని సందర్భములలో కొందరిని మందలించి మీరు చేయుచున్నది అధర్మమని, అజ్ఞానమని చెప్పవలసి ఉంటుంది. మరికొన్నిచోట్ల దైవ గ్రంథములలోని వాక్యములను వివరించి చెప్పి, దీని ప్రకారము నడిచినప్పుడే దేవుడు తెలియునని చెప్పవలసియుంటుంది. కొన్ని సమయములలో కొందరు అజ్ఞానులు మీరు చెప్పునది జ్ఞానమేకాదని ఎదురుతిరిగి మాట్లాడినా ఓర్చుకొని, సరియైన సమాధానముతో వారిని నిజజ్ఞానమువైపు మార్చ వలసియుంటుంది. దైవ గ్రంథములను తప్ప మిగతా వేదములను,

పురాణములను ఖండించి చెప్పవలసియుంటుంది. ఇవన్నీ చేయుటకు ముఖ్యముగా మనిషికి ఓర్పు, సహనములు ఉండడమేకాక, నిజమైన దైవ జ్ఞానము తనకు తెలిసివుండాలి. ఇవన్నియూ తెలిసి మేము ఆత్మప్రేరణతో ప్రజలకు దైవజ్ఞానమును తెలుపాలనుకొన్నాము. ప్రజలలో ఏ మతము వారైనా ఉండవచ్చును. అయినా అందరికీ సమానముగా వారిలోని తప్పులను తీసివేసి మంచి మార్గమును కలుగజేయాలన్నదే మా ఉద్దేశ్యము. అందువలన మేము చెప్పు జ్ఞానమును ఎవరుగానీ అసూయతో చూడకుండా శ్రద్ధతో తెలియాలని తెలుపుచున్నాము.

ఇప్పుడు చెప్పుచున్న గ్రంథము పేరు **"ఇందువు-క్రైస్తవుడా?"** అను ప్రశ్నగా మొదలవుతుంది. ముందు ఇందూ మతములోనున్న వాడు క్రైస్తవ మతములోనికి మారితే క్రైస్తవుడవుతాడా అన్నది ఇందులోని సమాచారమని పేరునుబట్టి తెలిసిపోవుచున్నది. అయితే అందరూ అనుకొన్నంత సులభమైన సమాచారము ఇందులో లేదు. ఇక్కడ ఇందువు అంటే ఏమిటి? క్రైస్తవుడంటే ఏమిటి? అను విషయమును గురించే ఎక్కువగా ఉండును. ఇందులోని భాగముగా ముందు ఒక ప్రశ్న వేసుకొందాము. అదేమనగా! ఒక ఇందువు లోను అట్లే మరొక క్రైస్తవునిలోను భౌతికముగాగానీ, మానసికముగాగానీ ఏమి తేడాగలదు? అనునది ప్రశ్న? ఈ ప్రశ్నను గురించి ముందు కొంత జ్ఞానమును తెలిసిన ఒక మనిషిని ప్రశ్నించి చూద్దాము.

ప్రశ్న :-నీవు ప్రస్తుత కాలములోయున్న మతములలో ఏ మతమునకు సంబంధించిన వాడివి?

జవాబు :- నేను క్రైస్తవ మతస్థుడను. నా మతమును గురించి నీకేమి పని? మీకు ఏమికావాలో దానిని అడగండి.

ప్రశ్న :-దయచేసి ప్రశ్నను నాకు వదలివేయండి. జవాబును మీరు చెప్పండి. సమాజములో మనుషులలోనున్న కొన్ని అనుమానములను, కొంత అజ్ఞానమును తీసివేయుటకు మిమ్ములను ఈ విధముగా ప్రశ్నించవలసి వచ్చినది. మీకు తెలిసిన సమాధానమును చెప్పండి. మీ సమాధానమును బట్టి లోకములో ఎందరో బాగుపడగలరు. అందువలన మీరు కొంత సహనముతో సమాధానము చెప్పండి. ఇప్పుడు మీరు క్రైస్తవులని తెలిసినది. అయితే మీరు బోధకులుగా ఉన్నారా? లేక సాధారణ మనిషిగా ఉన్నారా?

జవాబు :- నేను క్రైస్తవ మత బోధకుడను. బైబిలును గురించి ఏమడిగినా చెప్పగలను.

ప్రశ్న :-నాకు బైబిలు గురించి సంపూర్ణముగా తెలియదు. బైబిలులోగల అరవై ఆరు (66) పాఠములలో నాలుగు పాఠములైన మత్తయి, మార్కు, లూకా, యోహాన్ సువార్తలు మాత్రము తెలుసు. అవసరమునుబట్టి అందులోని విషయములడుగ గలను. ఇదంతయు ఇతరులు బాగుపడు నిమిత్తము, జ్ఞానులుగా మారు నిమిత్తము అడుగుచున్నాను తప్ప వేరు ఉద్దేశ్యము లేదని ముందే చెప్పుచున్నాను. అందువలన మీరు, మీకు తెలిసిన సరియైన, సమాధానమును ఇవ్వగలరని ఆశిస్తూ, ముందు ఒక ప్రశ్న అడుగుచున్నాను. ఒక హిందువు (ఇందువు) లో మరియొక క్రైస్తవునిలో భౌతికముగా ఏమి తేడా ఉన్నది?

జవాబు :- భౌతికముగా ఏమీ తేడా ఉండదు. మానసికముగానే హిందువుకు క్రైస్తవునికి ఎంతో తేడా ఉండును. హిందువుల మనస్సులో ఎందరో దేవతలు ఉందురు. వారు వానల కాలము వానదేవున్ని, ఎండలకాలము అగ్ని దేవున్ని పూజించుచుందురు. అలాగే కాలమునుబట్టి వచ్చే పండుగలను ఏర్పరచుకొని శ్రీరామనవమి వచ్చినప్పుడు శ్రీరామున్ని, ఆంజనేయ

జయంతి వచ్చినప్పుడు ఆంజనేయున్ని పూజించుదురు. ఆంజనేయుడు రాముని బంటు, సేవకుడు అని అందరికీ తెలుసు. అయినా శ్రీరామనవమి రోజు రాముడే దేవుడని పూజించినవారే, ఆంజనేయ జయంతి రోజు రామున్ని మరచిపోయి ఆయన సేవకున్నే దేవునిగా భావించి పూజించు చుందురు. రాముడు పెద్ద, ఆంజనేయుడు చిన్న అని చెప్పిన హిందువులే కొన్ని సమయములలో కొన్ని పండుగలలో ఇద్దరికీ సమాన పీట వేయు చున్నారు. అప్పుడు గురువును శిష్యున్ని ఒకే మంచము మీద కూర్చోబెట్టి ఒకే గౌరవమును ఇచ్చినట్లగును కదా! అలా చేయడము తప్పుకాదా! అదే విధముగా శివరాత్రి రోజు శివున్ని పూజించి నీవే దేవుడవు, నీవు తప్ప భూమిమీద నిన్ను మించిన దేవుడు వేరే ఎవరూ లేరని పూజింతురు. కొంత కాలమైన తర్వాత కొన్ని నెలలకే వినాయక చవితి వస్తే అప్పుడు వినాయకున్ని శివునికంటే ఎక్కువ పూజింతురు. శివరాత్రి రోజు మాత్రము శివున్ని పొగిడి పూజించినవారు, వినాయక చవితి ఒక రోజు ఉన్నా వినాయకున్ని మూడు రోజులు కొంతమంది, తొమ్మిది రోజులు కొంతమంది, పదకొండు రోజులు కొంతమంది పూజించి చివరి రోజు గొప్పగ ఊరేగింపు చేయుచున్నారు.

శివుని కొడుకు వినాయకుడు అని చెప్పు హిందువులు శివరాత్రి రోజు తండ్రిని దేవుడనుచున్నారు. శివరాత్రి రోజు తండ్రిని దేవుడనిన వారే మాటమార్చి వినాయక చవితినాడు కొడుకైన వినాయకున్ని దేవుడను చున్నారు. తండ్రికంటే మించినట్లు ఎక్కువ రోజులు వినాయకున్ని పందిరికట్టి పూజించి శివున్ని ఒక్కరోజు మాత్రము పూజించడము కొడుకు ముందర తండ్రిని తక్కువ చేసినట్లు కదా! మా లెక్కలో తండ్రి దేవుడా? కొడుకు దేవుడా? అని అనుమానము వచ్చుచున్నది. ఎక్కడైనా దేవుడు ఒక్కడే ఉంటాడు కదా! అలాంటప్పుడు కొన్నిచోట్ల యజమాని అయిన

రామున్ని దేవుడనినవారే, మరికొన్నిచోట్ల సేవకుడైన ఆంజనేయున్ని దేవుడు అంటున్నారు. శివుని విషయములోకొచ్చేటప్పటికి శివరాత్రికి తండ్రి అయిన శివుడు దేవుడైతే, వినాయక చవితికల్లా కొడుకైన వినాయకుడే దేవుడగుచున్నాడు. ఇదేమైనా నీతిగా ఉన్నదా? న్యాయముగా ఉన్నదా? తండ్రికంటే కొడుకును ఎక్కువగా గౌరవించడముగానీ, సమానముగా పూజించడముగానీ చేయడము వలన తండ్రి అయిన శివున్ని అవమానించి నట్లు కాదా! మీ మతములో ఎవరు దేవుడో చెప్పలేక ఒక్కొక్కరు ఒక్కొక్క దేవున్ని చెప్పుచున్నారు. ఎక్కడైనా ప్రపంచమునకు అధిపతి అయినవాడు, ప్రపంచమును సృష్ఠించిన సృష్ఠికర్త అయినవాడు ఒక్కడే దేవుడుంటాడుగానీ, ఇంతమంది దేవుళ్ళుంటారా? చివరికి జంతువులను కూడా దేవునిగా చెప్పుకొను మానసిక స్థితిలో హిందువులున్నారు. క్రైస్తవులైన మేము అట్లు లేము. మాకు ఒక్కడే దేవుడు ఆ దేవున్నే ప్రార్థిస్తాము తప్ప ఇతరులను ప్రార్థించము. అందువలన హిందువులు, క్రైస్తవులు అందరూ మనుషులే అయినా హిందువుల మనోభావములు వేరుగా ఉన్నాయి. క్రైస్తవుల మనో భావములు వేరుగా ఉన్నాయి.

ప్రశ్న :- మీరు చెప్పిన విషయముతో మేము కూడా ఏకీభవిస్తాము. అయితే హిందువులైన వారంతా మీరు చెప్పుచున్నట్లే ఉన్నారా అని చూస్తే ఎక్కువ శాతము అలాగేయున్నా, బహుకొద్దిమంది హిందువుల దైవగ్రంథముగా చెప్పుచున్న భగవద్గీత యొక్క జ్ఞానము ప్రకారము ఒకే దేవున్ని ఆశ్రయించి, ఒకే దేవున్ని ఆరాధించుచూ, దైవ జ్ఞానమును అనుసరించి పద్ధతిగా యున్నారు. మీరు మనోభావములో ఒకే దేవున్ని ఒకే జ్ఞానమును ఆశ్రయించి నట్లే హిందువులలో కూడా కొందరు ఉండుట వలన వారు మీతో సమానముగా ఉన్నట్లే కదా? అటువంటి వారు మీతో సమానముగా దైవమార్గములో ఉన్నారని ఒప్పుకుంటారు కదా?

జవాబు :- హిందూమతములో ఒకే దేవున్ని ఆశ్రయించి, ఇతర దేవతలను ఒప్పుకోకుండా ఉన్నవారిని నేను ఎక్కడా ఇంతవరకు చూడలేదు. అందువలన మా భావములో హిందువులు అంటే మార్గము తప్పి నడచు వారని మేము లెక్కించుకొన్నాము. అయితే మీరు చెప్పినట్లు భగవద్గీత ప్రకారము ఒకే దేవున్ని ఆశ్రయించినవారు హిందువులలో ఎక్కడైనా ఉంటే, అటువంటి వారిని మాతో సమానముగా ఒకే దేవున్ని ఆరాధించువారిగా లెక్కింతుము. అయితే మా బైబిలు ప్రకారము "యెహోవా" ఒక్కడే దేవుడు అని మేము అనుకొంటాము. ఆ విషయమును తెలిపినది దేవుని కుమారుడయిన ఏసు. ఏసు పెళ్ళి చేసుకోకుండా బ్రహ్మచారిగా, ధరించుటకు రెండవ వస్త్రము లేకుండా, నిరాశగా బ్రతికి మూడు సంవత్సరములు దేవుని జ్ఞానమును ప్రజలకు బోధించాడు. ఆయన దేవుని కుమారుడు అని ఋజువు చేసుకొనుటకు చనిపోయి మూడవ రోజున లేచినవాడు. అటువంటి ఏసు చెప్పిన జ్ఞానము నిజమైన జ్ఞానమని మేము నమ్ముచున్నాము. ఆయన చెప్పిన బైబిలును ఆధారము చేసుకొని మేము జ్ఞానపద్ధతిగా ఉన్నాము. హిందువులేమో ఎనిమిదిమంది భార్యలుగల కృష్ణుడు, విలాసవంతమైన జీవితమును గడిపిన కృష్ణుడు చెప్పిన భగవద్గీతను అదియు కొందరు హిందువులు ఆశ్రయించారని ఒకే దేవున్ని ఆరాధిస్తున్నారని మీరు చెప్పుచున్నారు. కృష్ణుడు ఏసువలె దేవుని కుమారుడు కాదు కదా! విలాస జీవితమును గడిపి జీవితములో ఎక్కడా జ్ఞానము చెప్పనివాడు ఒకచోట ఒక రోజు అదియు కొన్ని నిమిషములు జ్ఞానమును చెప్పితే, ఆయన చెప్పినది నిజమైన జ్ఞానమని, ఆయన బోధించినది నిజమైన దేవున్నేనని ఎలా నమ్మాలి? అందువలన మీరు అనుకొన్నట్లు హిందువులు సరియైన దేవున్ని నమ్మలేదేమో, అప్పుడు వారు మాతో సమానము కాదు కదా!

నా ప్రశ్న :- అనుమానములు వ్యక్తము చేయడములో తప్పులేదు. అనుమానములు తీరిన తర్వాత అసలైన సత్యము ఎవరికైనా తెలియగలదు. నీ అనుమానములు తీరుటకు ఒక ప్రశ్నను అడుగుచున్నాను జవాబు చెప్పండి. కృష్ణుని విషయమును అటుంచి ఏసును గురించి అడుగుచున్నాను. ఏసు దేవుని కుమారుడు అయినప్పుడు దేవుడు కానట్లే కదా! మాలోని సందిగ్ధము ప్రకారము ఏసు దేవుని కుమారుడా? మనుష్య కుమారుడా?

జవాబు :- ఏసు దేవుని కుమారుడే, తండ్రియైన యెహోవా పంపగా వచ్చిన వాడు. అందువలన ఆయన ముమ్మాటికీ దేవుని కుమారుడే.

నా ప్రశ్న :- దేవునికి కుమారుడుంటే కుమారునికి తల్లి కూడా ఉండాలి. అప్పుడు దేవునికి భార్య ఉన్నట్లే కదా! తండ్రి యెహోవా, కుమారుడు ఏసు, తల్లి ఎవరు? అనగా దేవుని భార్య ఎవరు?

జవాబు :- దేవునికి భార్య ఉన్నట్లు మా గ్రంథములో వ్రాయలేదు. దేవుని కుమారుడు ఏసు అని మాత్రమే కలదు.

నా ప్రశ్న :- వ్రాసినదే నమ్మగలిగినప్పుడు భగవద్గీతలో నేనే దేవున్ని అని కృష్ణుడు చెప్పినప్పుడు ఎందుకు నమ్మలేదు. ఏసు నాకు తండ్రి ఉన్నాడని చెప్పాడా? తండ్రియైన యెహోవా నాకు కుమారుడున్నాడని చెప్పాడా?

జవాబు :- ఏసే తండ్రిని గురించి చెప్పాడు. అందరికీ తండ్రి యెహోవానే అని కూడా చెప్పాడు.

నా ప్రశ్న :- అందరికీ అంటే కేవలము క్రైస్తవులకేనా లేక సమస్త మానవులకా?

జవాబు :- క్రైస్తవులకు మాత్రమే అని చెప్పలేదు. కావున సమస్త మనుషులందరికీ అని చెప్పవచ్చును.

నా ప్రశ్న :- సర్వమానవులకు తండ్రిని గురించి బైబిలు గ్రంథములో చెప్పబడినది. బైబిలు గ్రంథములో దేవుని సమాచారము ఉన్నది. కనుక బైబిలును దేవుని గ్రంథమని మేము కూడా అనుచున్నాము. అలాగే భగవద్గీతలో కూడా దేవుని జ్ఞానము కలదు. అటువంటప్పుడు భగవద్గీతను మీరు కూడా దైవ గ్రంథముగా ఒప్పుకోవచ్చును కదా! ఎవరు ఒప్పుకొనినా ఒప్పుకోకపోయినా ప్రపంచములో దైవ గ్రంథములు మూడు గలవు. ఒకటి ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత, రెండు ద్వితీయ దైవ గ్రంథము బైబిలు, మూడు అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్. ఈ మూడు గ్రంథములలో మార్చి మార్చి దేవుని విషయములే చెప్పబడినాయి. భగవద్గీతలో అందరికీ తండ్రిని నేనే అని చెప్పినవాడు మనిషిగాయున్న కృష్ణుడు. మనిషిగా కనిపించు కృష్ణుడు కనిపించని దేవున్ని నేనే అన్నాడు. బైబిలు గ్రంథములో తండ్రియైన దేవుని కుమారున్ని నేనే అని ఏసు చెప్పాడు. మనిషిగాయున్న ఏసు కనిపించని దేవుని కుమారున్ని అని చెప్పాడు. రెండుచోట్ల కనిపించే మనిషే చెప్పగా విన్నాము. కనిపించే మనిషి నేనే దేవున్నని ఒకచోట, నేను దేవుని కుమారున్ని అని మరొక చోట చెప్పియున్న దానినిబట్టి చూస్తే వీరు ఇద్దరూ సామాన్య మనుషులు కాదని తెలియుచున్నది. భగవద్గీతలో గానీ, బైబిలు గ్రంథములోగానీ ప్రత్యక్షముగా దేవుడు చెప్పలేదు. ప్రత్యక్షముగా కనిపించే మనిషే చెప్పాడు. బైబిలులో ఏసు చెప్పిన మాట ప్రకారము దేవుడు పేరుకుమాత్రము తెలుసు, దేవుని భార్య తెలియదు. అలాగే భగవద్గీతలో కృష్ణుడు చెప్పిన దానిప్రకారము ఎవరికీ కనిపించని దేవుడు మనిషిగా ఎలా కనిపించుచున్నాడని ప్రశ్నించిన దానికి కూడా జవాబు తెలియదు. నేను దేవున్ని అని చెప్పిన కృష్ణుని మాటకు, నేను దేవుని కుమారున్ని అని చెప్పిన ఏసు మాటకు ప్రత్యక్షముగా జవాబు లేదు. అయితే ఎవరి అంతరంగములో వారు ఈ ప్రశ్నలకు జవాబును తెలుసుకోవలసిందే.

ఈ రెండు ప్రశ్నలకు జవాబులు వారివారి శ్రద్ధమీద, వారివారి విశ్వాసము మీద ఆధారపడియుండును. ఏసు చెప్పిన మాటప్రకారము ఏసు దేవుని కుమారుడు అని ఎలా నమ్మగలుగుచున్నామో అలాగే కృష్ణుడు దేవుడే అనుమాటను కూడా నమ్మవలసివస్తున్నది. ఒకవేళ హిందువులైనవారు, భగవద్గీత మీద ప్రేమ ఉన్నవారు కృష్ణుడు దేవుడేయని నమ్మవచ్చును. క్రైస్తవులుగాయున్నవారు నమ్మగలరా?

జవాబు :- మేము ఎంతమాత్రము నమ్మము. క్రైస్తవులుగాయున్న ఎవరూ కృష్ణున్ని దేవుడని నమ్మరు.

నా ప్రశ్న :- క్రైస్తవులు కృష్ణున్ని నమ్మరు. హిందువులు ఏసును నమ్మరు. ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు ప్రవర్తించితే అజ్ఞానము తప్ప జ్ఞానము ఎవరి దగ్గరా లేకుండాపోతుంది. మొండిగా వాదించే దానికంటే ఈ పద్ధతి ప్రకారము మేము నమ్మము అని ఎవరైనా చెప్పగలరా? ఏసును ఎందుకు నమ్మరు అని అడిగితే శాస్త్రబద్ధమైన సమాధానము హిందువులవద్దలేదు. అలాగే కృష్ణుని మాటను ఎందుకు నమ్మరు అంటే సూత్రబద్ధమైన జవాబు క్రైస్తవులవద్దయూ లేదు. గ్రుడ్డిగా ఎవరి మతమును వారు గొప్పగా చెప్పుకోవడము తప్ప దేవుడు ఇచ్చిన దైవ గ్రంథములలో దేవుడు ఇచ్చిన జ్ఞానమును చూడడము లేదు. క్రైస్తవ మతములో చాలామందికి ఏసును గురించి ఏసు ఎవరో, ఎక్కడినుండి వచ్చాడో ఎక్కడికి పోయాడో తెలియదు. అలాగే హిందువులకు కృష్ణున్ని గురించి తెలియదు. కృష్ణుడు ఎవరో సంపూర్ణముగా తెలిసినవారు హిందువులలో కూడా లేరు. తమ మతములోని కృష్ణున్ని గురించి తెలియని హిందువులు పరమతములోని ఏసును గురించి ఎలా చెప్పగలరు? అలాగే తమ ఏసును గురించి పూర్తిగా తెలియని క్రైస్తవులు పరమతములోని కృష్ణున్ని గురించి ఎలా తెలియగలరు.

అందువలన రెండు మతముల వారికీ తమ ప్రవక్తలైన కృష్ణున్ని గురించిగానీ, ఏసును గురించిగానీ తెలియదనియే చెప్పవచ్చును.

అలాంటప్పుడు మాకు మా ఏసును గురించి మేము ఒప్పుకొంటాము అని క్రైస్తవులు అంటే అది వారు గ్రుడ్డిగా చెప్పేమాటయేగానీ, వాస్తవముగా వారికి ఏసును గురించి తెలియదు. అలాగే కృష్ణున్ని గురించి హిందువులు ఆయన దేవుడని ఒప్పుకొంటాము అంటే అది కూడా వారు గ్రుడ్డిగా చెప్పుమాటయే నని అర్థమగుచున్నది. అట్లే కృష్ణున్ని మేము ఒప్పుకోము అని క్రైస్తవులనినా, ఏసును మేము ఒప్పుకోము అని హిందువులనినా ఇరువురూ గ్రుడ్డిగా మాట్లాడు మాటలేగానీ, ఎందుకు ఒప్పుకోలేరో ఆధారమును చూపి ఇరువురూ చెప్పలేదు. ఎవరి మతమును వారు ప్రచారము చేసుకొనుటకు హిందువులు ఏసును, క్రైస్తవులు కృష్ణున్ని అగౌరవముగా మాట్లాడుచున్నారు. భగవద్గీతగానీ, బైబిలుగానీ, రెండూ దైవ గ్రంథములైనప్పుడు అందులో దేవుడు పరోక్షముగా చెప్పిన మాటలు పూర్తి సత్యముగాయున్నప్పుడు, మనుషులు రెండు గ్రంథములను రెండు మతములుగా చెప్పుకొని, మతము అను మాయలోపడిపోయి, దేవుని మాటనే విస్మరించి తన మాటనే గొప్పగా చెప్పుకొనుచూ, హిందువు ఏసును, క్రైస్తవులు కృష్ణున్ని ఒప్పుకోని స్థితిలో ఉండిపోయారు. అంతేకాక మతద్వేషములు పెంచుకొని ఒకరినొకరు హింసించుకొను స్థితికి చేరి పోయారు. ఇప్పుడు సూటిగా ఒక ప్రశ్న అడుగుచున్నాను. ఈ ప్రశ్నలు ఇతరులకు జ్ఞానమార్గములో కనువిప్పు కొరకేగానీ, అగౌరవపరచుట కని తలచకూడదు. ఏసు దేవుని కుమారుడా? అయితే ఎలాగైనా వివరముగా చెప్పగలరా?

జవాబు :- తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని బైబిలు గ్రంథములో

కలదు. అక్కడ తండ్రి కుమారుడు అని చెప్పబడియున్నది కదా! దానినిబట్టి ఏసు దేవుని కుమారుడని చెప్పవచ్చును.

ప్రశ్న :- బైబిలులో మత్తయి సువార్త చివరి 28వ అధ్యాయములో 19వ వాక్యమునందు తండ్రి యొక్కయూ, కుమారుని యొక్కయూ, పరిశుద్ధాత్మ యొక్కయూ అని ఉన్నది. ఇక్కడ తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ అని మూడు పేర్లు వచ్చాయి. ఈ ముగ్గురిలో తండ్రి ఎవరో, కుమారుడు ఎవరో, పరిశుద్ధాత్మ ఎవరో ఎవరికీ సరిగా అర్థము కాలేదు. ముగ్గురినీ విడివిడిగా వివరించి ఎవరూ చెప్పలేదు. అటువంటప్పుడు తండ్రి, కుమారుడు అను ఇరువురికి దేవుడు, దేవుని కుమారుడు ఏసు అని చెప్పితే, తండ్రివలన ఏసు పుట్టలేదని పరిశుద్ధాత్మ వలన పుట్టాడని కొందరు చెప్పుటకు అవకాశము కలదు. బైబిలు గ్రంథములో మత్తయి సువార్త 1వ అధ్యాయములో 21వ వచనమందు "ఆమె గర్భము ధరించినది పరిశు ద్ధాత్మ వలన" అని కలదు. అందువలన ఏసు పరిశుద్ధాత్మ కుమారుడా? లేక తండ్రి కుమారుడా? అని ప్రశ్నించితే ఎటూ చెప్పలేని పరిస్థితి క్రైస్తవులలో కలదు. ఎందుకనగా బైబిలు గ్రంథములో కొన్నిచోట్ల ఏసు తండ్రి కుమారుడని చెప్పబడినది. కొన్నిచోట్లేమో పరిశుద్ధాత్మ కుమారుడని చెప్పబడియున్నది. దీనినిబట్టి క్రైస్తవులవద్ద సరియైన సమాధానము లేదు. సమాధానము లేకున్నా బైబిలు గ్రంథములోని వాక్యములు సరిగా అర్థము కాకున్నా, కొందరు గ్రుడ్డి నమ్మకముతో చెప్పుచున్నారు. అయితే అలా నమ్మినవారు మిగతా దైవ గ్రంథములలోని విషయములను కూడా అలాగే నమ్మాలి కదా! ఒకవేళ ఎవరైనా వివరముగా చెప్పినప్పుడైనా నమ్మాలి కదా! అలా నమ్మక పోవడానికి కారణము నేను ఫలానా మతస్థుడనను అజ్ఞానము తప్ప వేరు ఏమీకాదని తెలియుచున్నది. బైబిలులో తండ్రి

పరిశుద్ధాత్మ విషయములో సందిగ్ధతయున్నా, ఏసు ఎవరి కుమారుడో తెలియకున్నా, భగవద్గీతలో కృష్ణుడు దేవుడనుటకు అనుమానము లేని ఆధారములున్నవి. అనుమానముతో కూడుకొన్న వాక్యములను గ్రుడ్డిగ నమ్మినప్పుడు, అనుమానము లేని వాక్యములను నేరుగా చూచి ఎందుకు నమ్మకూడదని ప్రశ్నించుచున్నాను. మేము క్రైస్తవులము అను ఒకే ఒక ఉద్దేశ్యముతో, భగవద్గీత హిందువులది అను భావముతో ఉండుట వలన క్రైస్తవులు శ్రీకృష్ణున్ని దేవుడని ఒప్పుకోలేక పోవుచున్నారు. మీకు అర్థముకాని బైబిలును చేతపూని, అర్థమగుటకు అవకాశమున్న భగవద్గీతను అసూయగా క్రైస్తవులు చూచుచుండుట వాస్తవమా కాదా మీరే చెప్పండి?

జవాబు :- మాకు అర్థముకానీ అర్థము కాకపోనీ మా గ్రంథము మాకు గొప్ప. ఇతరుల గ్రంథమును (భగవద్గీతను) ఒప్పుకొంటే మా దేవున్ని కాదని వేరే దేవుని వెంటపడినట్లగును. అప్పుడు ప్రభువు మమ్ములను క్షమించడు. అందులన భగవద్గీతను మేము ఒప్పుకోము.

నా ప్రశ్న :- భగవద్గీతను చదవకూడదనిగానీ, ఇతర గ్రంథములను చదివితే వేరే దేవుని వెంటబడినట్లనిగానీ, అట్లు చదివిన వానిని క్షమించనని చెప్పినట్లు గానీ, బైబిలు గ్రంథములో ఎక్కడైనా కలదా? చెప్పండి.

జవాబు :- మా పెద్దలు చెప్పినట్లు, మా గ్రంథములలో ఉన్నట్లు దేవున్ని తప్ప ఇతరులను నమ్మము. అందువలన గీతనుగానీ, కృష్ణున్నిగానీ మేము నమ్మడము లేదు.

నా ప్రశ్న :- దేవున్ని తప్ప ఇతరులను నమ్మవద్దను మాటను మేము కూడా ఒప్పుకొంటాము. ఆ మాటను ఎవరైనా ఒప్పుకొని తీరవలసిందే. నేను దేవుని కుమారున్ని అని చెప్పిన ఏసుమాటను నమ్మినప్పుడు నేనే దేవున్ని అని చెప్పిన వానిమాటను ఎందుకు నమ్మకూడదని అడుగుచున్నాను. దేవున్ని

తప్ప ఇతరులను నమ్మము అను మాట ప్రకారము దేవుడు కానివారిని నమ్మకపోయినా ఫరవాలేదు. దేవున్నని చెప్పుకొన్న వాని మాటలను కూడా నమ్మకపోవడానికి కారణమేమి?

జవాబు :- ఎలా నమ్మాలి? కృష్ణుని జీవితమును చూస్తే ఆయన దేవుడని నమ్ముటకు అవకాశమే లేదు. అంతేకాక ఆయనను దేవుడనుటకు ఏసువలె ఎవరి పాపములను కృష్ణుడు క్షమించలేదు కదా! నా వలన మీకు పాప క్షమాపణగలదని కూడా చెప్పలేదు. ఏసు నా వలన మీకు పాపక్షమాపణ కలదని చెప్పాడు. చేసి చూపించాడు. అందువలన ఆయనను దేవుడని నమ్ముచున్నాము.

నా ప్రశ్న :- ఏసు నా వలన పాప క్షమాపణ కలదని చెప్పాడు. కృష్ణుడు నా జ్ఞానము వలన కర్మనాశనము కలదని చెప్పాడు. ఎలా చూచినా ఇద్దరి మాట ఒక్కటే. వారి మాటప్రకారమే జరిగినది. పాప క్షమాపణ అనినా, కర్మనాశనమనినా రెండూ ఒక్కటే. కావున ఈ విషయములో కూడా మీరు పొరపాటు పడినారని తెలియుచున్నది. ఇంతవరకు ఎన్నో విధముల మిమ్ములను ప్రశ్నించాను. నా ప్రశ్నకు మీరు చెప్పు జవాబుకంటే మా ప్రశ్నయే పెద్దగా చెప్పబడినది. ఎంతో వివరముగా ప్రశ్నించినా చివరకు మీ జవాబులు స్వమతాభిమానముతోనే చెప్పబడినాయి. స్వంత మతము మీద ప్రేమ అభిమానములున్నప్పుడు ప్రక్క మతములో ఉన్నదంతా తక్కువ గానే కనిపించుచుండును. అదే విధముగా క్రైస్తవ మతము మీద అభిమానమున్న వారందరికీ హిందూమతము మీద ద్వేషముండును. మత ద్వేషముల వలననే భగవద్గీతను క్రైస్తవులు ఒప్పుకోవడము లేదు. అలాగే కృష్ణున్ని ఒప్పుకోవడము లేదు. బైబిలు గ్రంథములో ఎక్కడగానీ ఏసు తనది క్రైస్తవ మతమని చెప్పలేదు. క్రైస్తవ మతమును పెంచుటకు ఇతర

మతములను తగ్గించి మాట్లాడి, ఆ మతస్థులను మభ్యపరచి తమ మతములో చేర్చుకోమని కూడా చెప్పలేదు. ఏసు మతమార్పిడి చేయమనీ, క్రైస్తవ మతమును అభివృద్ధి చేసినవాడు నా భక్తుడగుననీ ఎక్కడా చెప్పలేదు. అటువంటప్పుడు మీరు హిందూమతస్థులను క్రైస్తవులుగా మార్చుటకు ఎందుకు ప్రయత్నిస్తున్నారు? క్రైస్తవ మతములోని ప్రతి బోధకుడు చెరువులో చేపలవలె, వానాకాలము సులభముగా దొరుకు ఉసుర్ల ఆహారమువలె నున్న హిందువులలోని శూద్రులను తమ మతములోనికి మార్చాలని చూస్తున్నారు. బైబిలులో దేవుడు చెప్పని పనిని (మత మార్పిడిని) క్రైస్తవులు ఎందుకు చేయుచున్నారని అడుగుచున్నాను. ప్రస్తుత కాలములో పెద్ద ప్రశ్నగయున్న దీనికి మీరు జవాబు చెప్పండి.

జవాబు :- మేము మా మతమును అభివృద్ధి చేయుటకు మతమార్పిడి చేస్తున్నామని, హిందువులను క్రైస్తవులుగా మారుస్తున్నామని అనుకోవడము పొరపాటు. మేము అట్లు ఎప్పుడూ చేయలేదు.

నా ప్రశ్న :- గత యాభై సంవత్సరములను చూస్తే మొదట 90 శాతమున్న హిందువులు నేడు 65 శాతమునకు దిగిపోయారు. దీనినిబట్టి యాభై సంవత్సరములలో 25 శాతము హిందువులు క్రైస్తవులుగా మారిపోయారు. క్రైస్తవ బోధకులు తమ మతమును ప్రచారము చేసి, మా మతములో పాప క్షమాపణకలదనీ, మీరు చేసుకొన్న పాపములన్నీ మా మతములోనికి వస్తే పోతాయని, అనేక రకముల ఆశలను కల్పించిన దానివలన, చెరువులోని చేపలు మత్స్యకారుల వలలో చిక్కుకొన్నట్లు చేపలవలెనున్న హిందువులు క్రైస్తవ బోధలు అను వలలో చిక్కుకొని, చివరకు క్రైస్తవ మతము అను గంపలోనికి చేర్చబడి క్రైస్తవులయినారు. ఈ విధముగా మీరు హిందువులను క్రైస్తవులుగా మార్చలేదేమో చెప్పండి. గత యాభై సంవత్సరముల క్రిందట

90 శాతమున్న హిందువులు 25 శాతము క్రైస్తవులుగా ఎందుకు మారారో చెప్పండి?

జవాబు :- హిందువులు క్రైస్తవులుగా మారినమాట నిజమేగానీ, మేము వారిని క్రైస్తవులుగా మారమని చెప్పలేదు. హిందూమతములో ఆదరణలేని వారు, అగ్రకులముల క్రింద నలిగిపోవుచున్నవారు, అగ్రకులముల వారు శూద్రులను అంటరానివారిగా నీచముగా చూచుట వలన, చాలామందికి దేవాలయ ప్రవేశము లేనిదానివలన, హిందూమతములో ఎందుకు పుట్టామని బాధపడు వారందరికీ మా మతము బాగా కనిపించింది. హిందూ మతములో ఏనాడూ జ్ఞానబోధ వినేదానికి నోచుకోని హిందువులకు మా క్రైస్తవ మతములోని బోధలు బాగా కనిపించాయి. దేవాలయములలోనికి ప్రవేశము లేనివారికి మా చర్చిలో ఎటువంటి ఆంక్షలు లేకుండా, అందరికీ ప్రవేశముండుట బాగా కనిపించింది. ఈ విధమైన ఎన్నో లోపములు హిందూమతములో ఉండుట వలన, ఆ లోపములన్నీ లేని మా మతము లోనికి ఎదురు ప్రవాహమునకు చేపలు వచ్చినట్లు వచ్చారు. నేటికినీ ఎందరో హిందువులు క్రైస్తవమతములోనికి రావాలని చూస్తున్నారు. మీ మతములో అగ్రకులముల పెత్తనము అను చలికి తట్టుకోలేని వారందరూ వెచ్చగా ఉంటుందని క్రైస్తవ మతము అను కోటులోనికి దూరుకోవాలని చూస్తున్నారు. హిందూ మతములో కొన్ని పద్ధతులు మారనంతవరకు శూద్రులుగాయున్న అన్ని కులములవారూ మా మతమువైపు చూస్తూనే ఉందురు. మతము మారవలెనని ప్రయత్నము చేయుచునే ఉందురు.

నా ప్రశ్న :- మీరు చెప్పినట్లు హిందువులలో అగ్రకులముల వారుండుట నిజమే. అయినా శూద్రులను ఇబ్బంది పెట్టేంతగా వారు ఏమీ ప్రవర్తించలేదే! కొన్ని సాంప్రదాయముల ప్రకారము వారు నడుచుకోవడము వాస్తవమే.

అంతమాత్రమున మిగతా హిందువులు మతము మార్చుకోవలసినంత పరిస్థితి ఏమీ లేదు కదా!

జవాబు :- ఇంతవరకు నీతిగా, న్యాయబద్ధముగా మన మధ్య సంవాదము సాగుచున్నది. మీరు అడుగవలసిన దానిని వదలకుండా అడిగారు. మీరన్నట్లు మా మతము మీద మాకు అభిమానము గౌరవము ఉండుట నిజమే. మా తప్పును మేము ఒప్పుకొంటున్నాము. అటువంటప్పుడు మీ లోపములను మీరు కూడా ఒప్పుకోవచ్చును కదా! ఉన్నదున్నట్లుగా దాచుకోకుండా (Open Heart గా) మాట్లాడండి. మీరు సమాజములో ఒక యోగిగా ఉంటూ, స్వచ్ఛమైన భగవద్గీతా జ్ఞానమును హిందూమతములో బోధిస్తున్నారు. ఎన్నో సంచలనమైన జ్ఞానవిషయములను యాభై గ్రంథములుగా వ్రాశారు. హిందూ మతములో ఎంతోమంది అభిమానించు గురువుగా ఉన్నారు. మీరు చెప్పు ప్రతీదీ భగవద్గీతను ఆధారము చేసుకొని చెప్పు జ్ఞానమే. ఇటువంటి గొప్ప జ్ఞానమున్న మిమ్ములను హిందూ మతములో ఎంతో గొప్ప వ్యక్తిగా క్రైస్తవులయిన మేము గుర్తించాము. అయితే హిందూమతములో అగ్రవర్ణముల వారు మిమ్ములను ఎన్నోమార్లు వ్యతిరేఖించారు. మిమ్ములను పరమత బోధను ప్రచారము చేయుచున్నారన లేదా? ఏమాత్రము దైవజ్ఞానము తెలియని హిందూ ధర్మరక్షకులమను వారిని, వెనుకనుండి ప్రేరేపించి మీ మీద దాడిచేయుటకు ప్రయత్నించలేదా? హిందూమతమునకు మేమే పెద్దలమని, మేమే హిందూ సాంప్రదాయము లను కాపాడువారమని చెప్పి హిందూ ధర్మ రక్షణ, పరిరక్షణ అను పేర్లతో సంఘములను స్థాపించి, అందులో మతాభిమానముగల హిందువులలో శూద్రులనే సభ్యులుగా చేర్చి, శూద్రుల వ్రేలితో శూద్రుల కన్నునే పొడవాలని అగ్రవర్ణముల హిందువులు ప్రయత్నించడము లేదా? చౌదరీ కులమున

పుట్టిన మీరు ఎంతో పెద్ద యోగిగా, సంపూర్ణ జ్ఞానము తెలిసిన వ్యక్తిగాయున్నా మిమ్ములను అనంతపురం జిల్లా గుంతకల్లులో హిందూధర్మరక్షణ (విశ్వహిందూపరిషత్) లో నున్న శూద్రుల చేతనే అవమానపరచుటకు ప్రయత్నించలేదా? హిందూజాతికే ఆదర్శ గ్రంథమైన మీరు వ్రాసిన త్రైత సిద్ధాంత భగవద్గీతను మీ ముందే అగ్గిపెట్టి కాల్చలేదా? ఆ రోజు మిమ్మల్ని అవమానపరచినది ఒక రెడ్డి ఒక కమ్మ కులస్థులు కాగా మిగత ఇరవైమంది శూద్రులే కదా! ఏమాత్రము జ్ఞానము తెలియనివారిని వెనుక ప్రేరేపించినది అగ్రకులము వారైన స్వాములని మీకు తెలియదా? మీకు వారిగుండా బాధకలుగలేదా? వారి వ్రేలు తీసి వారి కన్నులే పొడిచినట్లు మీవారే మిమ్ములను ఇబ్బంది పెట్టలేదా? నేడు క్రైస్తవ మతమును ఎందుకు మత మార్పిడి చేయుచున్నారని, హిందువులను యాభై సంవత్సరములలో 25 శాతము క్రైస్తవులుగా మార్చినారని, ఆ విధముగా మత మార్పిడి చేసి హిందువులను క్రైస్తవులుగా మార్చడము క్రైస్తవుల తప్పుగా, ఇంతవరకు మాతో వాదించిన మిమ్ములను అవమానపరచుటకు, ఎవరో ప్రచురించిన క్రైస్తవ ప్రచార కాగితమును మీరే ప్రచురించారని అసత్య ఆరోపణ చేసి, మీ ప్రెస్‌లో పని చేయు భాస్కర్‌రెడ్డిని విపరీతముగా కొట్టలేదా? ఆ ప్రచార కాగితములో ఎవరు ప్రచురించినది అడ్రస్‌యున్నా, మీరు కాదని తెలిసినా, అదే పనిగా దాడిచేయాలని ఆ రోజు వచ్చిన వారందరూ శూద్రులే కదా! మీ అనుచరులు పదిమందయినా ఉంటారని వారిని కొట్టి అవమాన పరచాలని వచ్చిన ఇరువదైదుమంది శూద్రులకు నాయకుడు ధీరజ్‌రెడ్డి కూడ ఒక శూద్రుడే కదా! ధీరజ్‌రెడ్డి ఒంటరిగాయున్న భాస్కర్‌రెడ్డిని కొట్టిపోయాడు. ఒక రెడ్డి మరొక రెడ్డిని క్రైస్తవుడని ఆరోపణ చేసి దాడిచేస్తే ఎవరి వ్రేలుతో ఎవరి కన్నును పొడిచారో మీరే బాగా ఆలోచించుకోండి. ఇదంతయు గమనిస్తే నేటికినీ అగ్రకులములవారు తెలివిగా ప్రవర్తించుచూ,

మిగిలిన హిందువులను క్రైస్తవులుగా మారకుండునట్లు హిందూ ధర్మరక్షణ సంఘములను ఏర్పాటు చేసి, ఆ సంఘములను ఇష్టమొచ్చినట్లు వాడు కొనుచూ, వారికంటే ఏ హిందువూ (ఏ శూద్రుడు) పైకి రాకూడదను ఉద్దేశ్యముతోనే మిమ్ములను చూచి అసూయపడిన అగ్రవర్ణములవారు, శూద్రుల చేతనే దాడులను చేయించారు కదా!

ఆ రోజు హిందువులైన మీ మీదికి అనేకమార్లు హిందువుల చేతనే దాడులు చేయించినది, వెనుకవుండి ప్రేరేపించినది హిందువులలోని అగ్రవర్ణముల వారేనని మీకు కూడా తెలుసు. ఆ సంఘటనల వలన మానసికముగా బాధపడిన మీ శిష్యులు దాదాపు 500 మంది మూకుమ్మడిగా ఇస్లామ్ మతములోనికి పోతామని హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో విలేకరుల మీటింగ్‌లో చెప్పలేదా? విషయము తెలిసిన మీరు ఎవరో తెలివి తక్కువ పనిచేస్తే మనము మతము మారడము అజ్ఞానమవుతుందని సర్దిచెప్పి అందరినీ నివారించలేదా? నేటికినీ హిందూధర్మరక్షణ అను పేరుతో అగ్రవర్ణముల వారు తమ పెత్తనమును చెలాయించుచూ అక్రమాలు చేయడము లేదా? జ్ఞానమును చెప్పి హిందూమతమును ఉద్ధరించు మిమ్ములను మీ శిష్యులను హింసించడము అక్రమము కాదా! మీరే చెప్పండి. జాతీయ గాయకుడైన జేసుదాసు భక్తిపాటలలో పేరుగాంచిన వ్యక్తి అయినప్పటికీ, ఆయన ఎంతో భక్తిగా ఏడుకొండల వెంకటేశ్వరున్ని దర్శించుకోవాలని తిరుమలకు వస్తే ఆయన క్రైస్తవుడని ఆలయములోకి ప్రవేశించకుండా వెనక్కు పంపినట్లు జేసుదాసే ఒక టీవి ఛానల్‌లో బాధపడి చెప్పుకోవడము అసత్యమా? ఇన్ని అవకతవకలు జరుగుచున్నా హిందూమతమును ఏమీ అనకుండా, హిందువులు క్రైస్తవులుగా మారుటకు తప్పంతా మీదే అని మమ్ములను (క్రైస్తవులను) అనడము న్యాయమేనా

మీరే చెప్పండి. హిందూ మతములో అగ్రవర్ణముల హిందువులు ప్రేరేపిస్తే, మిగతా హిందువులు మిమ్ములను బాధపెట్టలేదా? హిందూమతములో ఎంతో పెద్ద జ్ఞానులైన మీకు సముచిత స్థానమున్నదా? ఏ ఒక్క స్వామీజీ అయినా మీతో ఏకీభవించి మాట్లాడుచున్నాడా? మీరే చెప్పండి!

నా ప్రశ్న :- మీరు అడిగినవన్నీ సత్యములే. మీరు మతమువైపు నుండి మాట్లాడుచున్నారు. కావున హిందూమతములోని తప్పులు మీకు కనిపించుచుండవచ్చును. అయినా నేను మతమువైపు నుండి మాట్లాడడము లేదు. దైవికముగా దేవుని వైపునుండి మాట్లాడుచున్నాను. భగవద్గీతలోనూ, బైబిలు గ్రంథములోనూ గల జ్ఞానమును ఆధారము చేసుకొని మాట్లాడుచున్నాను. మతము పెద్ద మాయ అని మేము ముందే చెప్పాము. నేను దైవ గ్రంథములను చూచి, అందులోని జ్ఞానమును అనుసరించి మతమార్పిడి మంచిదికాదని చెప్పుచున్నాను. మీరు కూడా మీ మతమువైపునుండే పని చేయుచున్నారు తప్ప దేవునివైపునుండి పని చేయడము లేదు. మీ బైబిలు గ్రంథమునుండి మీరు ఎంత శాతము అర్థము చేసుకొన్నారో, ఏమని అర్థము చేసుకొన్నారో అట్లే ప్రవర్తించుచున్నారు. మీరు చేయుచున్న పనినిబట్టి చూస్తే బైబిలు గ్రంథములో ప్రత్యేకించి ఏసు చెప్పిన నాలుగు సువార్తలలోని జ్ఞానము అర్థముకాలేదని మాకు తెలియుచున్నది. మా బైబిలులోని జ్ఞానము హిందువైన మీకు ఎలా తెలయగలదని మీకు ప్రశ్న రావచ్చును. దానికి మా జవాబు ఏమనగా! మా భగవద్గీతలో ఉన్నదే ఏసు చెప్పిన నాలుగు సువార్తలలో గలదు. కావున నాకు భగవద్గీత ఎలా తెలుసో అలాగే బైబిలు కూడా తెలుసు.

వాస్తవముగా ఉన్నదున్నట్లు చెప్పితే హిందువులకు భగవద్గీత ఏమాత్రము అర్థము కాలేదు. అలాగే బైబిలు కూడా క్రైస్తవులకు అర్థము

కాలేదనియే చెప్పుచున్నాము. భగవద్గీత హిందువులకు అర్థమైనట్టేయున్నా అందులోని మూడు ఆత్మల విషయము భగవద్గీతను అనువదించి వ్రాసిన గొప్ప స్వామీజీలకు కూడా తెలియకుండా పోయినది. వారికి అర్థము కాలేదను విషయము వారు వ్రాసిన విధానమునుబట్టియే తెలిసిపోవుచున్నది. భగవద్గీత మూడు ఆత్మల త్రైత సిద్ధాంతముతో కూడుకొన్న విషయము హిందువులైన వారికి ఎలా తెలియకుండా పోయినదో, అలాగే క్రైస్తవులకు కూడా బైబిలులోని సారాంశముగానీ, మూల సూత్రములుగానీ ఏమాత్రము అర్థము కాలేదని చెప్పవచ్చును. నేడు క్రైస్తవ బోధకులు బోధించు విధానముగానీ, జ్ఞానముగానీ బైబిలులోని సారాంశమునకు విభిన్నముగా యున్నది. బైబిలులో మత్తయి సువార్త 28వ అధ్యాయములో 19వ వాక్యము యందుగల తండ్రి ఎవరో, కుమారుడు ఎవరో, పరిశుద్ధాత్మ ఎవరో సరియైన భావముతో ఇంతవరకు ఎవరికీ అర్థము కాకుండా పోయినది. ఏసు శిలువ వేయబడి తాత్కాలిక మరణమును పొంది పూర్తి చనిపోకుండా చనిపోయినట్లు కనిపించడము, శ్వాస ఆగిపోవడము, శవముగా మారి పోవడమును తాత్కాలిక మరణము అంటాము. ఈ విషయము అర్థము కావాలన్నా, ఏసు శిలువ మీద చనిపోలేదని తెలియాలన్నా మా రచనలలోని **"మరణ రహస్యము"** అను గ్రంథమును చూడండి. కేవలము ముప్పైమూడు గంటలు (33) మరణస్థితిలోవుండి, రెండవరోజు 48 గంటలు కూడా పూర్తి కాకముందే మరణమునుండి లేవడము జరిగినది. మరణమునుండి లేచిన తర్వాత దాదాపు నలభై రోజులుండి, ముప్పైమూడు మార్లు తన శిష్యులకు కనిపించాడు. అలా కనిపించిన ఏసు తన చివరి దర్శనములో శిష్యులకు ఒక ముఖ్యమైన మాట చెప్పాడు. ఎవరైనా జీవితము చివరిలో తనవారికి చెప్పు మాట ముఖ్యమైనదిగా ఉంటుంది. అలాగే ఏసు తన జీవితములో చివరి కలయికైన దానివలన ఇలా చెప్పాడు. మత్తయి సువార్త

28వ అధ్యాయము 19,20 వాక్యములను చూడండి. “మీరు వెళ్ళి సమస్త జనులను శిష్యులుగా చేయుడి. తండ్రి యొక్కయు, కుమారుని యొక్కయు, పరిశుద్ధాత్మ యొక్కయు నామమున వారికి బాప్తిస్మమిచ్చుచు, నేను మీకు ఏయే సంగతులను ఆజ్ఞాపించితినో, వాటినన్నిటిని గైకొనవలెనని వారికి బోధించుడి. ఇదిగో నేను యుగ సమాప్తి వరకు సదాకాలము (ఎల్లకాలము) మీతో కూడా ఉన్నానని వారితో చెప్పెను.” ఈ విధముగా ఏసు చెప్పిన చివరిమాట సమస్త మనుషులలో ఎవరికైనా అర్థమైనదా? అంటే అందరు అర్థమయినట్లే చెప్పగలరు కానీ, అందరికీ అర్థమైన భావము వేరు, ఏసు ఆనాడు చెప్పిన భావము వేరు. ఆ రోజు తన బోధను ప్రజలకు బోధించమన్నాడు. ఆ బోధలో తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మను గురించే చెప్పమన్నాడు. ఇది దేవుడు మనుషులకు ఇచ్చిన ఉత్తరువు. అయితే దేవుడు చెప్పిన పనిని ఏ బోధకుడైనా చేయుచున్నాడా? అంటే వారికే అర్థముగాని తండ్రి, కుమారున్ని, పరిశుద్ధాత్మను గురించి ప్రజలకు చెప్పక, కేవలము మాయతో కూడుకొన్న మతమును గురించే బోధించుచున్నారు. హిందువులు తమ మతమును కాపాడుకోవాలని మతము వెంటనే పడిపోయారు. క్రైస్తవులు తమ మతమును వృద్ధి చేసుకోవాలని మతము వెంట పడినారు.

భగవద్గీతలో చెప్పిన ప్రకారము హిందువులు లేరు, అలాగే బైబిలు గ్రంథములో ఏసు చెప్పినట్లు క్రైస్తవులు లేరు. ఇరువురూ దైవిక భావమును వదలి, ప్రపంచ భావముతో కూడుకొన్న మత విధానములో ఉండిపోయారు. బైబిలులోగానీ, భగవద్గీతలోగానీ దేవుడు మతము అను మాటనే చెప్పలేదు. ఈ రెండు గ్రంథములలోనూ మరియు అంతిమ గ్రంథమైన ఖుర్ఆన్ గ్రంథములోనూ దేవుడు తన జ్ఞానమును మాత్రము సూత్రబద్ధముగా

బోధించాడు తప్ప, మత ప్రసక్తిని ఎక్కడా చెప్పలేదు. మేము నేడు మూడు దైవ గ్రంథముల ప్రకారము మనుషులు చేయు మత ప్రచారములనూ, మత మార్పిడులను పూర్తిగా ఖండించుచున్నాము. నేను దేవుని మాటను అనుసరించుచుండుట వలన, ఏ మతమువైపూ మొగ్గుచూపక ఒక పక్షము కాకుండా, రెండు మతములవారినీ సమానముగా మీరు దేవుని జ్ఞానము ప్రకారము నడుచుచున్నారా?యని నిలదీసి అడుగుచున్నాను. నేను పుట్టినది హిందూ కుటుంబములోనని హిందువులవైపుగా మాట్లాడడముగానీ, ఇతర మతములను అసూయ భావముతో చూడడముగానీ లేదు. రెండు మతములలోనున్న తప్పులను బహిర్గతము చేసి అడుగుచున్నాము. అలా చేయడము వలన అన్ని మతములవారిని వారి మత ధ్యాసనుండి దేవునివైపు ధ్యాస మరల్చడానికేనని తెలియవలెను.

నేను వ్రాసిన అనేక గ్రంథములలో ఎక్కువగా హిందువులకే జ్ఞానమును చెప్పుచూ వచ్చాము. మా బోధలలో మూడు దైవ గ్రంథ విషయములు ప్రస్తావిస్తూ వచ్చాము. నాకు దైవ భావము ప్రకారము అన్ని మతములూ సమానమే, మూడు దైవ గ్రంథములలోని జ్ఞానమూ సమానమే. అందువలన నా బోధలు తప్పు చేసిన వారిని పెద్దలు దండించునట్లు, ఏ మతములో తప్పులు కనిపించినా, వాటిని సరిచేయుటకు చెప్పిన మాటలు, మీ పెద్దలు మిమ్ములను దండించినట్లు ఉండును. ప్రస్తుతము ఇందువు, క్రైస్తవుడా అను పేరుతో వ్రాయు గ్రంథములో ఇంతవరకూ ఇరువైపులా సమానముగా చెప్పుచూ వచ్చినా, ఇప్పటినుండి క్రైస్తవ బోధకులు మత ప్రచారము కొరకు ఎటువంటి తెలివిని ఉపయోగించు చున్నారో, ఎటువంటి బోధలు చేయుచున్నారో చెప్పవలసినయున్నది. మేము చెప్పు విషయములు కొందరికి కొంత బాధ కలిగించినా వారి తప్పును

వారికి చూపించి తిరిగి అటువంటి తప్పు చేయకుండా, దేవుని మార్గము వైపు వారిని మళ్ళించుటకేనని ముందుగానే చెప్పుచున్నాను.

దాదాపు 40 సంవత్సరముల క్రితము నేను ఒక మారుమూల పల్లెటూరికి పోవడము జరిగినది. అప్పటికి నాకు 23 సంవత్సరముల వయస్సుండెడిది. ఆ పల్లెటూరిలో ముస్లీమ్‌లు ఐదు లేక ఆరు కుటుంబములు ఉండగా, మిగతా ఎనభై కుటుంబములు హిందువులవే ఉన్నాయి. ఆరు వందల జనాభాయున్న ఆ గ్రామములో ముస్లీమ్‌లను సులభముగా వారి వేషధారణను బట్టి గ్రహించవచ్చును. అయితే ఒక వ్యక్తిని చూచి ఇతను హిందువా లేక ముస్లీమా అని అనుమానము వచ్చింది. అప్పుడు నా అనుమాన నివృత్తి కొరకు నీది ఏ మతము అని అడిగాను. ఆ మాటకు అతను అర్థముకానట్లు నావైపు చూచాడు. అతనికి నా మాట అర్థము కాలేదని, అదే మాటనే కొంతమార్చి అర్థమగునట్లు నీవు ఏ మతస్థుడవు అని అడిగాను. ఆ మాటకు అతను నేను తెలుగువాడిని అన్నాడు. అతను మొరటుగా "నేను తెలుగోన్ని" అని చెప్పినప్పుడు అతనికి మతము అను విషయమే తెలియదని నాకు అర్థమైపోయినది. కొన్నిచోట్ల నాగరికతలేని మారుమూల గ్రామములలో హిందువులు ముస్లీమ్‌లు కలిసి బ్రతుకుతున్నా వారికి మతమను ధ్యాసలేదు. మతద్వేషములులేవు. అటువంటి వారికి వారి మాట్లాడే భాషనుబట్టి నేను తెలుగోన్ని, నేను తురకోన్ని (ముస్లీమ్‌ను) అని అంటున్నారు. తెలుగు భాష మాట్లాడేవాడు తెలుగోడిననీ, తురక భాష (ఉర్దూ భాష) ను మాట్లాడేవాడు తురుకోడినని చెప్పడము ఆ పల్లెటూరిలో అలవాటైపోయినది. వారు భాషను బట్టి వారిని కొంతవేరుగా చెప్పుకొంటున్నారు తప్ప వారికి మతము అనునదే తెలియని స్థితిలో ఉన్నారని అర్థమగుచున్నది.

పది సంవత్సరముల తర్వాత అదే ఊరికి నేను పోవడము జరిగినది. పది సంవత్సరముల తర్వాత కూడా ఆ ఊరి అభివృద్ధిలో ఏ మార్పూ కనిపించలేదు గానీ మనుషులలో కొంతమార్పు కనిపించినది. మొదట వారు మాట్లాడే భాషనుబట్టి నేను తెలుగువాడిని, తురకవాడిని అని చెప్పుకొను వారు కొంత మార్పుచెంది, నేను హిందువును, నేను ముస్లీమ్‌ను అని చెప్పుకొను స్థితికి వచ్చారు. పది సంవత్సరముల క్రితము చూచిన వారిని చూచిన నేను, పది సంవత్సరముల తర్వాత వారిలో వచ్చిన మార్పును చూచి ఆశ్చర్యపోయాను. పది సంవత్సరముల క్రింద ఆ ఊరిలో ఒక పెద్దమ్మ గుడి, ఒక పీర్ల చావిడి మాత్రము ఉండెడిది. ఉగాది రోజు పెద్దమ్మ గుడిలో ఊరంతయూ పూజలు చేసి, కోళ్ళు, పొట్టేళ్ళను బలి ఇచ్చి పండుగ చేసుకొనెడివారు. అలాగే పీర్ల పండుగ వస్తే ఊరంతయు కలిసి పీర్లపండుగ చేసుకొనెడివారు. ముస్లీమ్‌లు, హిందువులు ఇరువురూ కలిసి రెండు పండుగలు ఉత్సాహముతో చేయడము వలన ఏది ముస్లీమ్ పండుగో, ఏది హిందువుల పండుగో అర్థము కాకుండెడిది. ఈ విధముగా ఎంతో సామరస్యముగా హిందువులు ముస్లీమ్‌లు కలిసి బ్రతుకుచూ, ఒకరినొకరు మామా అనియో చిన్నాన్నా, పెద్దనాన్నా అనియో, బావా అనియో ఒక కుటుంబములోని వారు పిలుచుకొనునట్లు పలకరించుకొనెడివారు. ఆ ఊరంతయు ఒకే కుటుంబములాగా ఉండెడిది. పది సంవత్సరముల తర్వాత నేను ఫలానా మతమువాడినని చెప్పుకోవడమేకాక, ఊరి బయట బయలు ప్రాంతములో ఒక మసీద్‌ను కూడా ముస్లీమ్‌లు కట్టుకోవడము జరిగినది.

పది సంవత్సరముల తర్వాత ఆ ఊరిలో క్రొత్తగా మసీద్ కనిపించడమే కాకుండా, ఒక క్రైస్తవ చర్చి కూడా కనిపించినది. అయితే

ఆ ఊరిలోనికి క్రైస్తవులు ఎక్కడనుంచో రాలేదు. ఆ ఊరి చివరి భాగములో నున్న దళిత కుటుంబములు కొన్ని, ఊరి మధ్యలోనున్న యాదవ కుటుంబములు కొన్ని, బోయ (వాల్మీకి) కుటుంబములు కొన్ని కలిసి క్రైస్తవులుగా మారిపోయి, వారు ఆదివారము ప్రార్థన కొరకు చర్చిని నిర్మించు కొన్నారు. పది సంవత్సరముల క్రిందట మతముల పేర్లు కూడా తెలియని వారు, తర్వాత మూడు మతములవారిగా చెప్పుకోవడము ప్రారంభించారు. మొదట ఎవరి దేవుడు ఎవరో తెలియనివారు, మా దేవుడు ఈయన వారి దేవుడు ఆయన అని చెప్పుకొను స్థితికి వచ్చారు. తర్వాత రెండు మూడు సంవత్సరములకు కొంత నాగరికతగా మారిన, ఆ ఊరి హిందూ ప్రజలలో హిందూమతము మీద అభిలాష పెరిగినది. హిందువులకు దేవుడు రాముడని రాముని దేవాలయమును ఊరి మధ్య కట్టించడము జరిగినది. ఈ విధముగా ఆ ఊరిలో క్రొత్తగా చర్చి, రాముని దేవాలయము తయారైనవి. ముస్లీమ్‌లు రాముని దేవాలయమునకుగానీ, పెద్దమ్మ దేవాలయమునకుగానీ రావడం మానుకొని అల్లా అయిన ఒకే దేవున్ని ఆరాధించడము తప్ప ఇతర దేవతలకు మ్రొక్కడము తప్పు అని చెప్పుకొనెడివారు. క్రైస్తవులు అందరికీ సృష్టికర్త అయిన యెహోవానే దేవుడు అనెడివారు. ఇక మిగిలిన హిందువులు మా రాముడే దేవుడు అనెడివారు. ఈ విధముగా భిన్న భావములచేత ఏకత్వముగా, ఒకే కుటుంబముగానున్న ఆ ఊరిలో భిన్నత్వములు ఏర్పడి అభిప్రాయ భేదములు పెరిగిపోయాయి. ఆ ప్రాంతములో క్రొత్త ప్రాజెక్టు కట్టడము వలన, ఆ భూములన్నీ సస్యశ్యామలముగా పంటలు పండి ఊరంతయూ ఆర్థికముగా పెరిగిపోయి మంచి స్థోమత కల్గినవారుగా, ఎంతో సుఖమయ జీవనము గడుపువారిగా తయారైనారు. అయితే మాయ మతము అను చిచ్చును పెట్టి అది రగులునట్లు చేసి, ఒకరిమధ్య ఒకరికి ఘర్షణ

వాతావరణమును సృష్ఠించి, వారిని మానసికముగా కృంగదీస్తూ హాయిగా బ్రతుకనివ్వడము లేదు.

ఇదంతయు గమనిస్తే నలభై సంవత్సరముల క్రితము ఆర్థిక స్థోమత లేకున్నా, హాయిగా ఒకే కుటుంబముగా బ్రతుకు ఆ ఊరి ప్రజలు, నేడు మంచి స్థోమతకల్గియున్నా ఐకమత్యము లేనివారై ఒకరికొకరు శత్రువుల వలె చూచుకొనుచూ, మానసికముగా కృంగిపోయి బ్రతుకవలసివచ్చినది. ఒకప్పుడు ఏక కుటుంబముగాయున్న వారు నేడు ఒకరినొకరు నమ్మని స్థితిలో బ్రతుకుచున్నారు. దీనికంతటికీ కారణము ఆ ఊరిలోనికి **'మతమ్మారి'** (మాయ) ప్రవేశించడమేనని తెలియుచున్నది. ఒక ఊరిలోనే కాకుండా ఒక దేశములోనే కాకుండా మొత్తము ప్రపంచమంతా నేడు ఇదే పరిస్థితి ఏర్పడియున్నది. ఇంతమంది మనుషుల తలవ్రాతను మార్చిన మతము ఎక్కడిది? దీనిని ఎవరు సృష్ఠించారు? అని ప్రతి మనిషి ప్రశ్నించుకొని చూడవలసిన అవసరమున్నది.

దేవుడు మనుషులకు ప్రసాదించిన మూడు దైవ గ్రంథములలో దేవుని జ్ఞానము కూర్చబడియున్నది. అంతేగాక దేవుని జ్ఞానమును ఇతరులకు తెలియజేయమని కూడా చెప్పబడినది. అందువలన గ్రంథములలోని జ్ఞానమును తెలిసినవారు తెలియనివారికి చెప్పడము జరుగుచున్నది. తెలిసినవారు తెలియని వారికి చెప్పడము సేవా ధర్మ మగును. దేవుని జ్ఞానమును ఇతరులకు తెలియజేయడము దేవునికి సేవ చేసిన దానితో సమానమగును. దేవున్ని మనిషి పూజించినా లేక ప్రార్థించినా దేవునికి ఇష్టముండదు. తన జ్ఞానమును ప్రచారము చేయు వానినే ఇష్టపడును. అందువలన దేవుని జ్ఞానమును తెలిసినవారు తెలియని వారికి చెప్పడముకంటే ప్రపంచములో ఉత్తమమైన పనిలేదని చెప్పవచ్చును. అయితే

దేవుడిచ్చిన గ్రంథములలోని జ్ఞానమును ముందు మనము చదివి తెలుసుకొని తర్వాత ఇతరులకు చెప్పడము సులభమేకదా! ఇందులోని కష్టమేమున్నదని ఎవరైనా అనుకోవచ్చును. అంత సులభమైన పని దేవుని లెక్కలో ఎంతో శ్రేష్టమైనదయినప్పుడు, ఆ పనినే చేసి దేవునికి ఇష్టునిగా ఉండవలెనని తలచి, కొందరు దేవుని జ్ఞానమును చెప్పడము దేవుని కార్యముగా భావించి చేయుచున్నారు.

అయితే ఎంతో సులభముగా కనిపించు దైవ జ్ఞానబోధ చాటున కనిపించకుండా మాయ అనునది కూడా ఉన్నదని ఎవరికీ తెలియదు. దైవ జ్ఞానము ఎవరికైనా అంత సులభముగా దొరకనట్లు చేయుటకు దేవుడే మాయను సృష్టించి పెట్టాడు. అందువలన జ్ఞానము తెలిసి చెప్పుచున్నానని అనుకొను వానివద్ద దేవుని జ్ఞానమున్నదో లేదో కూడా అర్థము కానట్లు మాయ చేయుచున్నది. దీనినంతటినీ గమనిస్తే దేవుని జ్ఞానము సులభమైనదని అనుకొనినా, దేవునికి ఇష్టుడు కానివానికి అతి కష్టముగానే ఉండును. గ్రంథమున్నది, నేను చూచి చదువుకోగలను. జ్ఞాపకము పెట్టుకొని తిరిగి చెప్పగలను, ఒకమారు చూచినంతమాత్రమున ఎలాగైనా దానిని వర్ణించి చెప్పగలను అని అనుకొనువారికి కూడా అర్థమైనట్లే ఉన్నా, మాయ ప్రభావము వలన అతను జ్ఞానమునకు ఆమడ దూరములో ఉండును. అందువలన మొదట జ్ఞానము తెలుసుకొని ఇతరులకు బోధించు వారివద్దనుండి మాయ మొదలై, జ్ఞానము వినేవాని వరకుయుండి, ఎవనికి ఏది అర్థము కావలెనో, ఎవనికి ఏది అర్థము కాకూడదో అలాగే చూచి చేయుచున్నది. మాయ ప్రభావమును ఉపయోగించి చెప్పేవానికి కొన్ని విషయములను తెలియకుండ చేయగలదు. అట్లే వినే వానికి ఏది అర్థము కాకూడదో, ఏది అర్థముకావలెనో అలాగే అర్థమగునట్లు మాయ చేయగలదు.

దేవుని ఆజ్ఞకు లోబడి పని చేయు మాయ, దేవునిమార్గములో స్వార్థ బుద్ధి యున్నవానికీ, కుత్సిత బుద్ధియున్న వానికీ దేవుని జ్ఞానములోని అసలైన భావమును తెలియకుండా చేసి, వానికి మాత్రము అన్నియు తెలిసినట్లు తృప్తిపొందించును. అప్పుడు వాడు నాకు దేవుని జ్ఞానము తెలిసింది అనుకొనునుగానీ, వాడు దేవుని జ్ఞానమునకు ఎంతో దూరమున్నట్లు వానికి ఏమాత్రము తెలియదు. దేవుని జ్ఞానమును బోధించడము అనునది దేవుని సేవ అయినా, మనిషి సక్రమముగా లేనప్పుడు సేవను మాయ ఎలాగైనా మార్చగలదు.

భూమిమీద ఎందరో బోధకులు మూడు మతములలోనూ ఉన్నారు. మూడు గ్రంథములనుండి జ్ఞానమును గ్రహించి ఇతరులకు చెప్పగలుగు చున్నారు. అయితే దేవునికి నచ్చని విధానము ఏదున్నా అతనిని దేవుడు ఇష్టపడడు. మాయ వానిని వదలిపెట్టదు. వానికి తాను గొప్ప జ్ఞానిని అనుకొనునట్లు చేసి, అతనికి తెలియకుండానే దేవునికి దూరముగా ఉండునట్లు చేయును. ఇప్పుడు ఉదాహరణకు ఒక బోధకుడు తన లోపల ఉద్దేశ్యము ఒకటుండగా బయటికి మరొక విధముగా మాట్లాడుచు, ఎదుటి వాళ్ళను మభ్యపెట్టాలని చూస్తున్న వ్యక్తి, ఎలా తన బోధను చెప్పుచున్నాడో చూడండి. మొదట ఒక ఉద్దేశ్యమును బయటికి కనిపించునట్లు వ్రాసి, ప్రకటించి మాట్లాడుచూ పదిహేను నిమిషములకే మొదటి ప్రకటనకు పూర్తి విరుద్ధముగానున్న తనలోపలి ఉద్దేశ్యమును చెప్పడము పూర్తి కపటముగా మాట్లాడినట్లగుచున్నది. ముందు ఒకటి చెప్పి తర్వాత రెండవ దారిలోనికి ఉద్దేశ్యపూర్వకముగా తీసుకొని పోవువారిది కపటబుద్ధియని మనకే తెలిసి పోవుచుండగా, అటువంటి వారిని దేవుడు ఒప్పుకోడు, మాయ ఒప్పుకోదు. నేను చెప్పునది దేవుని జ్ఞానమేకదా! అని బుకాయించినా దేవుని జ్ఞానమును నీ ఇష్టమొచ్చినట్లు వాడుకొని, దేవుని జ్ఞానముతో చెలగాటమాడితే

అటువంటి బోధకుడు ఎవడైనాగానీ, వానిని మాయ దేవునికి దూరంగా ఉంచి, దేవుని జ్ఞానము కానిదానినే అతనికి మాయ అంటగట్టగలదు. ఎటువంటి బోధను చూచి దేవుడు ఇష్టపడడో ఉదాహరణకు ఒక దానిని చూస్తాము.

ఒక హిందువు క్రైస్తవునిగ మారడము, మారిన తర్వాత అంతటితో ఊరుకోకుండ హిందూమతమును ప్రేమించునట్లు తిరిగి హిందువుగా మారాలనుకొన్నట్లు పైకి చెప్పుచు క్రైస్తవ మతమును ప్రచారము చేయుటకు హిందూమతమును ఎరగ వాడుకొనుచు, వేదములను గొప్పగ చెప్పుచు అవి కూడా క్రైస్తవ మతమును సూచించునట్లు బహు తెలివిగ వ్రాసి ప్రచురించిన ఒక పత్రిక ఇలా కలదు.

## నేను హిందువుగా మారాలనుకుంటున్నాను

నేనీమధ్య, నాలో నేనే చాలా మథన పడిపోతున్నాను.

నా స్వంత దేశంలో, నా స్వంతవారి మధ్య, నేనేదో ఒక నేరం చేసినవాడిలాగా, అనవసరంగా అవమానం పాలైపోయాను.

ప్రతివాడూ నన్నొక అసహ్యమైన వ్యక్తిగా, అంటరానివాడినిగా చూస్తున్నాడు. ఒక కుట్రదారుగా, ఒక విదేశీతొత్తుగా నన్ను అందరూ పరిగణిస్తున్నారు. నన్నొక దేశద్రోహిగా, నీచుడిగా చిత్రీకరిస్తున్నారు.

ఇంతకూ నా వాళ్ళ మధ్యలో నేనింతగా అవమానించబడటానికి కారణం, నేను యేసుక్రీస్తును నా దేవునిగా స్వీకరించటమే. నా దేశం హిందూదేశం. తరతరాలుగా వేల సంవత్సరాలుగా ఈ దేశం నమ్మిన మతం, హిందూమతం. వేలాది సంవత్సరాలుగా ఈ నేల మీద వేళ్ళూనుకున్న హిందూ మతాన్ని కాదని, ఎక్కడో విదేశీ గడ్డ మీద పుట్టిన క్రైస్తవ మతాన్ని నేను అవలంబించటం - సహజంగానే నా సాటి భారతీయులకు బాధ కలిగించింది. వారి బాధను చూస్తుంటే, నాకూ బాధగానే ఉంది.

నా వాళ్ళ దృష్టిలో నేను అనవసంగా చెడ్డవాణ్ణెందుకు కావాలి? ఏదో_ నాలుగు తరాల వెనుక మా పూర్వీకులు - ఏ కారణం చేతనో గాని, తెల్లదొరల కాలంలో క్రైస్తవ మతంలోకి మారారు. ఇప్పుడు చూడబోతే రోజులు మారాయి. ప్రస్తుత కాలంలో క్రైస్తవుణ్ణని చెప్పకోవటం ఏమంత గౌరవప్రదంగా లేదు.

అసలిదంతా ఎందుకొచ్చిన గొడవ ? ఏ మతం అవలంబిస్తేనేం ? చిత్తశుద్ధి ఉంటే చాలదా ? మతం కోసం, నా చుట్టూ వున్న సమాజానికి ఎదురీదటం ఎందుకు? నా స్వంత వాళ్లకు నేను శత్రువును కావటం ఎందుకు ?

అదీ గాక - నాకసలే దేశాభిమానం మెండు ! నా గడ్డ మీద పుట్టిన మతాన్ని ప్రపంచానికి చాటి చెప్పటం నాకు గౌరవంగా వుంటుంది గానీ, పరాయి దేశం వాళ్ళ మతాన్ని నేను నెత్తిన పెట్టుకోవటం నాకు మాత్రం ఏమంత గౌరవంగా వుంటుంది?

**నాకు, నా వాళ్ళ మధ్యలో మళ్ళీ గౌరవం పొందాలని వుంది! అందుకే, నేను మళ్ళీ హిందువుగా మారిపోవాలనుకుంటున్నాను.**

**అయితే నేను హిందువుగా మారాలంటే ఏం చేయాలో నాకర్థం కాలేదు. ఏ గ్రంథాన్ని నేను ప్రామాణికమైనదిగా ఎంచాలి ? ఏ దేవుణ్ణి సృష్టి, స్థితి లయకారకుడిగా ఎంచాలి? నేను అయోమయంలో పడిపోయాను.**

**ఏమైనా సరే - నేను హిందువుగా మారి, నా దేశంలో నేను మళ్ళీ గౌరవనీయమైన వ్యక్తిగా జీవించాలన్న ఆశ మాత్రం చావలేదు.**

**ఒకదానికొకటి పూర్తిగా విరుద్ధమైన పురాణ గ్రంథాలను కాస్త ప్రక్కనపెట్టి అసలు హిందూమతానికి "పునాది" వంటి వేదాల మీద దృష్టి నిమగ్నం చేయాలని తీర్మానించాను.**

**ఆర్య సమాజ స్థాపకులైన స్వామి దయానంద సరస్వతిగారు చెప్పిన మాట కూడా అదే కదా ?**

**"పురాణ గ్రంథాలు ప్రామాణికమైన దేవోక్తులు కావు - వేదములే ప్రామాణికమైనవి. గనుక పురాణ గ్రంథాలను విడిచిపెట్టి, వేదాలను పరిశోధించండి. వైదిక మార్గము నవలంబించుడి" అని నినదించారు - దయానంద సరస్వతి గారు.**

**ఆ మాటలు చెప్పినందుకు దయానంద సరస్వతిగారిని దేశద్రోహి అని గాని విదేశీతొత్తు అని గానీ ఎవరైనా అనగలరా?**

అపచారం ! అపచారం !! దయానంద సరస్వతిగారిని హిందూమత సంస్కర్తగా ఆధునిక ప్రవక్తగా యావత్తు భారతీయ సమాజం గౌరవిస్తూ వుంది.

అందుచేత నేను స్వామీదయానంద సరస్వతుల వారి సందేశాన్ననుసరించి, వేదగ్రంథాలలో చెప్పబడిన మార్గంలోనే ఆ పరమాత్ముని చేరుకోవాలని, ఆయనను తెలుసుకోవాలనీ సంకల్పించాను. వేదకాలంలో భారతీయ ఋషిపుంగవులు నమ్మిన సిద్ధాంతం ప్రకారమే నేను దేవుణ్ణి చేరుకోవాలని ఆశించాను.

ఈ ఉద్దేశ్యంతో పరిశోధన సాగించిన నాకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది - ప్రస్తుత కాలపు భారతీయ సమాజం, వేదకాలపు హిందూమత సిద్ధాంతాలను విడిచి దారి తొలగిపోయిందని నాకు అర్థమైంది.

వేదకాలపు హిందూమత సిద్ధాంతం ప్రకారం, మానవుడు పరమాత్ముని సన్నిధికి చేరేటప్పుడు జంతురక్త ప్రోక్షణం తప్పనిసరి అని నేను గమనించాను.

వేదకాలంలో హిందువులు, బలులు అర్పించారు. యజ్ఞాలు నిర్వహించారు. "సర్వపాపపరిహారో రక్తప్రోక్షణ మవశ్యమ్" - అంటే "రక్తం చిందింపకుండ పాపక్షమాపణ కలుగదు" అని ఎలుగెత్తి చాటి చెప్పారు.

సర్వవిశ్వపాప పరిహారం కొరకు ఒక యజ్ఞం జరగాల్సి వుందని వేదకాలపు హిందూ ఋషులు నమ్మారు. ఆ యజ్ఞానికి "అజామేధం" అని పేరు పెట్టారు. ఒక మచ్చలేని మేకను తేవాలి. దాని తలమీద బలుసు కంపను చుట్టి కిరీటంగా పెట్టాలి. ఆ మేకను ఒక చెక్కబల్లకు మేకులతో కొట్టి వేలాడదీయాలి. దాని ఎముకలు విరుగకుండా జాగ్రత్తగా దాని రక్తమంతా ఓడ్చాలి. అలా ఆ మేక చనిపోయిన తరువాత మళ్ళీ దానికి ప్రాణం పోయాలి. అదీ "అజామేధం" అంటే!

మళ్ళీ మొదటికొచ్చింది. వ్యవహారం! వేదకాలపు హిందువుల మతాన్ని నేనూ నమ్మితే-చచ్చినట్టు మళ్ళీ నేను యేసుక్రీస్తునే నా దైవంగా నమ్ముకోవలసి వస్తుంది! ఎందుకంటే సామవేదపు ప్రవచనం ప్రకారం సర్వలోక పాపపరిహారార్థం తన రక్తాన్ని చిందించి బలిగా మరణించి లేచినవాడు యేసుక్రీస్తు ఒక్కడే మరి!

ఇప్పుడు నేను క్రీస్తుకు దూరం అయితే తప్ప, నా సోదర భారతీయులు నన్ను గౌరవించరు, ఆదరించరు అలా నేను క్రీస్తుకు దూరమవ్వాలంటే వేదాలను తృణీకరించట మొక్కటే మార్గం.

అంతటి దారుణానికి నేను ఒడిగట్టలేను, వేదాలను నేను తృణీకరించ లేను వేదాలలో చెప్పబడిన రక్తప్రోక్షణ, యజ్ఞంనకు అక్కరలేదని కొందరు చెబుతున్నారు. అలా చెప్పటం సనాతన హిందూ ధర్మానికి తీరని ద్రోహం చేయటమే

మన వేదాలలో యజ్ఞాన్ని గూర్చిన ప్రస్తావన, వివరణా ఎంత స్పష్టంగా వున్నదంటే వేదాలను గౌరవించేవారు క్రీస్తుప్రభువును యజ్ఞపురుషుడుగా విశ్వవిమోచకునిగా జగద్రక్షకునిగా అంగీకరించక తప్పటంలేదు. క్రీస్తుప్రభువు పట్ల అకారణద్వేషం పెంచుకున్న కొందరు భారతీయ పండితులకు ఈ పరిస్థితి మింగుడు పడటంలేదు. వేదాలలో దాగిన క్రీస్తు సిలువయజ్ఞాన్ని మరుగు చేయడానికి సదరుపండితులు ఒక వితండ వాదాన్ని ఈ మధ్య ప్రచారం చేస్తున్నారు. వేదకాలపు యజ్ఞాలలో జంతురక్తాన్ని చిందించే హింసాత్మక విధానం లేనేలేదనీ వేదకాలపు ఆర్యులు తాముపండించిన వ్యవసాయ ఫలాలను, ధాన్యాన్ని దేవతలకు అర్పించటాన్నే వారు "యజ్ఞం" అని పిలిచారనీ వారి వాదన.

అయితే ఇదంతా అసలు సత్యాన్ని మరుగుచేయడానికి కొందరు చేస్తున్న వ్యర్థప్రయత్నం, వృధా ప్రయాస తప్ప మరేమికాదు. ఆర్యులు సస్యద్రవ్యాలను దేవతలకు అర్పించినమాట వాస్తవమే కానీ పాప పరిహారం కోసం మాత్రం వారు జంతురక్త ప్రోక్షణాన్ని జరిగించారనటానికి ఖచ్చితమైన ఆధారాలున్నాయి. సందేహం లేదు. - "రక్తము చిందింపకుండా పాప క్షమాపణ కలుగదు" అని ప్రాచీన భారతీయ వేదఋుషులు నమ్మారు. (ఈ విషయంలో సత్యాన్ని రుజువులతో సహా తెలుసుకోగోరేవారు నన్ను సంప్రదించవచ్చు)

దేశభక్తుడినైన నేను, సనాతన హిందూ ధర్మాన్ని, వేదాలను గౌరవించే నేను, సర్వలోకపాప పరిహారం కోసం యజ్ఞమై తిరిగి లేచిన యేసును విడిచి పెట్టడం ఎలా న్యాయం అవుతుందో నాకు అర్థం కావటం లేదు! యజ్ఞం అక్కర్లేదని ఇప్పడు వాదించటం, వేదఋుషులను వెర్రిబాగుల వాళ్ళ క్రింద జమకట్టటమే అవుతుంది. వేదకాలపు హిందూఋుషుల పట్ల నా గుండెల్లో అపారగౌరవాన్ని పెంచుకున్న నేను యజ్ఞపురుషుడైన యేసుక్రీస్తులో నెరవేరిన "అజామేధం" లో విశ్వాసముంచక తప్పటంలేదు - నా విశ్వాసాన్ని నా సోదర భారతీయులకు చెప్పక తప్పటంలేదు. నన్ను ఇంకేం చేయమంటారు ??

సత్యమేవ జయితే నానృతమ్
సత్య సంస్థాప నాభిలాషి

రచయిత చిరునామా
అద్దంకి రంజిత్ ఓఫీర్
యం.ఐ.జి. 877, కె.పి.హెచ్.బి. కాలనీ,
హైదరాబాద్ - 500 072 ఫోన్ : 040 - 3058536

ప్రచురణ
పి. సంగీతరావు
అద్దేపల్లి (Post), భట్టిప్రోలు (Post & Mandal), గుంటూరు జిల్లా.
పిన్ - 522 256. ఆంధ్రప్రదేశ్.

ఇది చదివిన తర్వాత అర్థమైనదేమంటే మొదట హిందూమతము మీద అభిమానముగా ప్రేమను ఉలకబోసిన విధానము ఒక వ్యూహము ప్రకారము చెప్పినది. క్రైస్తవమత ప్రచారములో భాగమే మొదట నేను తిరిగి హిందువును కావాలనుకోవడము. మొదట హిందూమతము వదలి క్రైస్తవునిగ మారినపుడే హిందూమతము మీద లేని అభిమానము తర్వాత వచ్చిందని చెప్పడము ఇతరులను మభ్యపెట్టుటకని తెలియుచున్నది. హిందూ మతములోని జ్ఞానమును తెలియని స్వాములు కొందరు చేసిన ప్రచారములను ఆధారముగ చేసుకొని, వాటి బలహీనతను బయటికి చెప్పుచు, హిందూ మతమునే కించపరచడము జరిగినది. హిందూమతమునకు పునాది వంటివి వేదాలని చెప్పడము, దయానంద సరస్వతి సందేశాన్ననుసరించి వేద గ్రంథాలు చెప్పిన మార్గములోనే పరమాత్మని చేరుకోవాలని చెప్పడము, ఆ మాటలు చెప్పిన దయానంద సరస్వతిని దేశద్రోహి అనిగానీ, విదేశీతొత్తు అనిగానీ ఎవరైనా అనగలరా అని చెప్పడము చూస్తే, హిందువుల వ్రేలుతో హిందువుల కన్నునే పొడిచినట్లున్నది.

మానవులకున్న మూడు గుణముల విషయములే వేదములని "త్రైగుణ్య విషయా వేదా" అను భగవద్గీత మాటకు, దయానంద సరస్వతి వేదములే దేవున్ని తెలుసుకొనుటకు ఆధారమని చెప్పుట వ్యతిరేఖము కాదా! గుణ విషయములే వేదములని "గుణమయి మమ మాయా" గుణములే మాయ అని, గుణములతో కూడివున్న మాయను దాటుట దుస్సాధ్యమని, గుణములతో కూడిన వేదములను వదలినపుడే దేవున్ని తెలియవచ్చునని, గీతలో దేవుడు చెప్పగ వేదములు ముఖ్యమని దయానంద సరస్వతి ఎలా చెప్పగలడు. ఒకవేళ చెప్పివుంటే హిందూమతములోని నిగూఢమైన జ్ఞానము ఆయనకు కూడా తెలియదనియే చెప్పవచ్చును.

వేదములు ప్రపంచమునకు సంబంధించినవి. వాటిని ఆధారము చేసుకొన్నవారు మాయా ప్రపంచములోనే ఉండగలరు. కాని దైవ సంబంధమైన మోక్షమును పొందలేరు. వేదాలను పట్టుకొని దేవున్ని తెలుసుకోవాలనుకోవడము కుక్కతోకను పట్టుకొని గోదావరి ఈదగలనను కోవడము వంటిదే అగును. వేద సిద్ధాంతములను అనుసరించి మానవుడు పరమాత్మను చేరుటకు జంతురక్త ప్రోక్షణం తప్పనిసరి అని అద్దంకి రంజిత్ వ్రాయడము హాస్యాస్పదము. కర్మయోగము వలనగానీ, బ్రహ్మయోగము వలనగానీ దేవుడు తెలియబడుతాడని బ్రహ్మవిద్యాశాస్త్రమైన గీతయందు చెప్పారు గానీ, జంతురక్తము కార్చడము వలన మనిషికి దేవుడు తెలియ బడడు. ఈ మాటలు దైవజ్ఞానము ఏమాత్రము తెలియనివారు వ్రాసినవిగా అర్థమగుచున్నది.

యజ్ఞమును గురించి వ్రాయుచు రక్తముతో చేయాలని వ్రాసినారు. యజ్ఞములంటే ఇంతవరకు హిందూ స్వాములకే సరిగ్గా అర్థముకాలేదు. అటువంటి యజ్ఞములను గురించి ఇతర మతస్థులు మాట్లాడడము ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గానికి ఎక్కినానన్నట్లున్నది. యజ్ఞములు రెండు రకములని అవి శరీరములోపల జరుగుచున్నవని **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** లో స్పష్టముగ చెప్పబడియున్నది. నేను కూడా ఏసును దేవునిగ భావించి ఆయనను గురించి ఆయన బోధల గురించి ఎంతో గొప్పగ చెప్పుచున్న వాడినే. అయినప్పటికీ మేము మతానికి అతీతమైన దేవున్ని ఏసులో చూశాము.

**'సర్వ పాపపరిహారో రక్తప్రోక్షణ మవశ్యకమ్'** అని ఒకమాటను తీసుకొని మన పాపము పోవుటకు ప్రభువు రక్తము కార్చాడని చెప్పుచున్నారు. పాపము పోవాలంటే రక్తము కారాలని చెప్పారుగానీ, ఫలానావారి రక్తమని

ఆ శ్లోక పదములో లేదు కదా! పాపము అనుభవిస్తేగాని అయిపోదు. ఆ విషయమును మనము తెలుసుకొనునట్లు దేవుడు ప్రత్యక్షముగా చూపుచున్నాడు. ఉదాహరణకు ఒకడు బస్సు క్రిందపడి గాయాలపాలై రక్తము కారునపుడుగానీ, ఇతర ప్రమాదములు జరిగినపుడుగానీ అతన్ని మనము చూచినపుడు పాపము! ఎంతపని అయినది అని మనము అంటుంటాము. ఇక్కడ మనకు తెలియకుండానే పాపము అని పలుకబడుచున్నది. దీనిని బట్టి వాడు రక్తము కార్చుచు బాధపడడము పాపము వలననే అని, దేవుడే మనలోపలినుండే గుర్తు చేసినట్లున్నది. పాపము పరిహారము కావాలంటే దానిఫలితమైన బాధను అనుభవించవలసిందే. ఎవడు బాధపడితే వాని పాపము అయిపోతుంది. ఇది శాస్త్రబద్ధమైన సూత్రము. రక్తము కారుట వలన పాపము పోతుందని మేము కూడా ఒప్పుకుంటాము. కానీ ఎవరినో చంపి మన పాపము పోతుందని అనుకోవడము పొరపాటు. నీ పాపము పోతుందని ఇతరులను బాధించినా, వారి రక్తమును కారునట్లు చేసినా, క్రొత్త పాపము వచ్చి చేరుతుంది కాని పాతది పోదు. ప్రభువును చంపి పాపమును మూటగట్టుకొన్న కైపావంటి గురువులు ఆయన మరణము వలన మన పాపము పోయిందని మాట్లాడిన మాటలను నేటి క్రైస్తవులు మాట్లాడడము శోచనీయము.

మనము నిత్యము అనుభవిస్తున్న బాధలు పాప కళంకములు కావా! ప్రభువు మరణముతో మన పాపములు పోయివుంటే నేడు ఏ క్రైస్తవుడైన పాపము అనుభవించకుండ, బాధపడకుండా, రక్తము కారకుండ భూమిమీద ఉన్నాడా? ప్రభువును బలవంతముగా చంపి, పాపము మూటగట్టుకొన్న మానవాళి, ఆయన జ్ఞానముతో ఆ పాపమును పోగొట్టుకోవాలి కానీ నాకు పాపమే లేదు అనుకోవడము పొరపాటు. పాపపుణ్యములు కంటికి కనిపించు

నవి కావు. కనిపించని దానిని గురించి పోయింది అనుకోవడముకంటే ఉన్నదని పాపభీతికల్గి ప్రభువు అందించిన జీవజలము అను జ్ఞానముతో పాపమును కడిగివేసుకొనువాడు నిజమైన క్రైస్తవుడని మేము నమ్ము చున్నాము. అట్లుకాక మన తెలివిని మత ప్రచారమునకు వినియోగిస్తూ ప్రభువు చెప్పిన మాటలను వక్రమార్గము పట్టించువాడు ఎప్పటికీ ప్రభువు భక్తుడు కాలేడు.

ఇదంతయు గమనిస్తే దైవ గ్రంథమైన బైబిలులో దేవుడు వేదములు గొప్పవని చెప్పాడా? లేదు. అందులో వేదముల ప్రసక్తే ఏసు ఎప్పుడూ తీసుకురాలేదు. ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో దేవుడు నేను వేదముల వలన తెలియబడుతానని చెప్పాడా? ఎక్కడా అలా చెప్పలేదు. పైగా వేదములు గుణముల సమ్మేళనము అని సాంఖ్యయోగము 45వ శ్లోకమున చెప్పాడు. అంతేకాక వేదములే నా మాయయని విజ్ఞానయోగమున 14వ శ్లోకమున చెప్పాడు. విశ్వరూప సందర్శన యోగమున 48 మరియు 53వ శ్లోకమునందు వేదముల వలన నేను తెలియబడనని స్వయముగా దేవుడే చెప్పాడు. అటువంటి దేవుని మాటలను కాదని దైవ గ్రంథములకు వ్యతిరేఖముగా మాట్లాడుచున్నానను జ్ఞాపకము ఏమాత్రము లేకుండా చెప్పడము జరిగినది. అంతేకాక మొదట హెడ్డింగులో ఒకమాటను చూపి చివరికి వేరొక ఉద్దేశ్యమును తెలుపడము దేవుని జ్ఞానముతో, మనుషుల జీవితములతో ఆడుకొన్నట్లు కాదాయని అడుగుచున్నాము. వారి తలలోనే స్థానము ఏర్పరచుకొన్న మాయ వారిని దేవుని జ్ఞానమును తెలిసినవారిగా, బోధకులుగా నమ్మించి, మాయతో కూడుకొన్నవని స్వయముగా దేవుడే చెప్పిన వేదములను, మాయ అతని మెదడుకు అతికించివేసినది. ఏ వేదములైతే తనను తెలుపలేవని అన్నాడో, ఏ వేదముల చేత నన్ను తెలుసు

కొనుటకు శక్యము కాదు అని దేవుడు అన్నాడో, అదే వేదములయందు అతని ధ్యాస ఉండడమునుబట్టి అతడు దేవునికి చాలా దూరముగా మాయ చేత నెట్టివేయబడినాడని తెలియుచున్నది.

ఏసును నిజమైన దేవుడని, బైబిలు నిజమైన దైవ గ్రంథమని నమ్మియున్నాను కదా! అటువంటి నేను దేవునికి దూరముగా ఉండడ మేమిటి? తనమీద అసూయతో వ్రాసిన వ్రాతలని మా మాటను తేలికగా తీసుకొనినా తీసుకోవచ్చును. దేవుని నిజతత్త్వమును తెలియక, దేవున్ని పొగిడినంత మాత్రమున, ఎవరంతకు వారు మేము దేవునికి దగ్గరగాయున్నా మని అనుకొన్నంతమాత్రమున, అటువంటివారిని దేవుడు ఒప్పుకోడు, దేవుని ధర్మములూ ఒప్పుకోవు. దైవ నిర్మితమైన మాయ ఏమాత్రమూ ఒప్పుకోదు. బైబిలు గ్రంథములోగానీ, ఏసు జీవితములోగానీ ఎక్కడా చెప్పని వేదములను గురించి మీకెందుకు అంతప్రేమ అని అడుగుచున్నాను. ఏసు తన చివరి మాటగా తండ్రియొక్క, కుమారునియొక్క, పరిశుద్ధాత్మయొక్క నామము లోనికి బోధించుచూ, నేను మీకు ఏయే సంగతులు ఆజ్ఞాపించితినో వాటినే బోధించవలెనని చివరిలో చెప్పిపోగా, ఆయన మాటను కాదని, ఆయన చెప్పని మాటలతో మనుషులను మభ్యపరచడము, జ్ఞానరీత్యా మంచిదా? అని అడుగుచున్నాము.

ఏసునందు విశ్వాసముంచిన ఏ క్రైస్తవుడైనా గానీ, తాము అనుసరిస్తున్న బైబిలు గ్రంథములోని జ్ఞాన విషయములే మాట్లాడవలెను గానీ, వేదములను గురించి మాట్లాడడము వాటిని పొగడడము బైబిలుకు వ్యతిరేఖమగును. రెండవ దైవ గ్రంథమైన బైబిలులో లేని జ్ఞాన విషయములు వేదములలో ఉన్నాయా? ఏసు ప్రభువు చెప్పని విషయములను దయానంద సరస్వతి చెప్పాడా? ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో వేదాధ్యయనము

వలన నన్ను తెలియుటకు శక్యముకాదు అని దేవుడు చెప్పితే, దేవుని మాటను కాదని, దయానంద సరస్వతి చెప్పాడని, వేదములను గురించి చెప్పుకోవడము వలన, దేవున్ని దేవుని మాటను అవమానపరచినట్లే యగుచున్నది. దేవుని మాటకంటే ఒక మనిషి చెప్పిన మాటే గొప్పగ ఎలాగ కనిపించినదో మాకు అర్థము కాలేదు. ఈ విషయములన్నీ గ్రహించిన మేము దేవుని జ్ఞానమునకు విలువ పెరుగునట్లు చేయుటకు ఇతరులు వ్రాసిన వాక్యములను మీకు తెలియచేసి, వాటిలోని అసత్యమును ఖండించి వాస్తవ జ్ఞానమును తెలియజేయాలని అనుకొన్నాము. ఆ నేపథ్యములో ఇప్పుడు అద్దంకి రంజిత్ కుమార్‌గారు రచించిన "హైందవ క్రైస్తవము" అను పుస్తకములో 4వ పేజీలోని ఒక వాక్యమును ఇక్కడ విశ్లేషించి చూస్తాము.

**"ప్రధానముగా వేదం సృష్టికర్తను గురించే మాట్లాడుతుంది. దేవున్ని చేరే మార్గమును చెప్పవు అనడము వేదాలను అవమానించడమే అవుతుంది."**

వేదాలను అవమానించాలనేది మాకేమైనా కోర్కెనా? మేము సత్యమును మాట్లాడుచున్నాము అసత్యమును ఖండించుచున్నాము. ఆ పనిలో తప్పును తప్పుగా, ఒప్పును ఒప్పుగా చెప్పడము ప్రపంచరీత్యా న్యాయము. దైవజ్ఞానరీత్యా ధర్మము. మేము ఊరక దేనినీ ఖండించడము లేదు. శాస్త్రబద్ధతను అనుసరించి ఖండించి చెప్పవలసియున్నది. దేవునికి సంబంధించిన శాస్త్రము బ్రహ్మవిద్యాశాస్త్రము. దానినే ధర్మశాస్త్రము అని కూడా అంటారు. బ్రహ్మవిద్యాశాస్త్రమును ఉపయోగించి ప్రపంచములోని అనేక వాక్యములను ఏది దైవికమైనది, ఏది దైవికము కానిదో నిర్ణయించి

చెప్పవచ్చును. అయస్కాంతమును పట్టుకొని లోహములను తాకినప్పుడు ఏది ఇనుమో, ఏది బంగారమో బయటపడును. అంతవరకు బంగారు రంగును పూసుకొన్న ఇనుమును కూడా మనము బంగారమని అనుకొను అవకాశము కలదు. నేడు భూమిమీద ఎందరో ఎన్నో మాటలను దైవ సంబంధమైనవని చెప్పుచున్నారు. అలాగే ఎందరో దైవ సంబంధ విషయములని ఎన్నో గ్రంథములను వ్రాశారు. వాటన్నిటిని కాదు అనిగానీ, ఔను అనిగానీ అనుటకు ఒక ఆధారముండాలి. ఆధారము లేకుండా దేనినీ ఖండించలేము, అలాగే సమర్థించనూ లేము. ఏ విధముగా అయస్కాంతమును ఉపయోగించి ఒకే రంగున్న బంగారును ఇనుమును వేరుపరచి కనుగొనుచున్నామో, శాస్త్రమును ఉపయోగించి అసలును నకిలీని, సత్యమును అసత్యమును, ధర్మమును అధర్మమును గుర్తించవచ్చును. ప్రపంచ విషయములను తెలుపుటకు ఐదు శాస్త్రములుండగా, కేవలము దేవుని విషయములో సత్యాసత్యములను తేల్చి చెప్పునది బ్రహ్మవిద్యా శాస్త్రము అని చెప్పవచ్చును. దానినే కొందరు ధర్మశాస్త్రమని కూడా చెప్పుచుందురు.

భూమిమీద ఏ మనిషి చెప్పిన వాక్యముగానీ, లేక ఏ గ్రంథములోని వ్రాతగానీ అది దైవికమైనదా కాదా అను సత్యమును తెలియుటకు మనకు ధర్మశాస్త్రము (బ్రహ్మవిద్యాశాస్త్రము) అవసరము. ముందు అయస్కాంతము ఫలానాది అని తెలియగలిగినప్పుడు, దానిని ఉపయోగించి ఇనుమును ఆకర్షించవచ్చును. అలాగే మొదట శాస్త్రములంటే ఏమిటి? అందులో ధర్మశాస్త్రము ఏది? అని తెలియగలిగినప్పుడు దానిని ఉపయోగించి గ్రంథములోని వాక్యమునుగానీ, మనుషులు చెప్పిన వాక్యమునుగానీ దైవిక సంబంధమైనదా, ప్రకృతి సంబంధమైనదాయని తేల్చి చెప్పవచ్చును. సమాజమును అసలైన దేవునివైపు నడిపించుటకు కొన్ని వాక్యములనుగానీ,

కొందరి మాటలనుగానీ, తప్పక శాస్త్రమును ఉపయోగించి చూచి సరియైన దైతే, సమర్థించి ప్రజలకియ్యవలెను. సరియైనది కాకపోతే, ఖండించి అది తప్పని చెప్పి ప్రజలను మోసపోకుండ చూడవలెను. ఈ కార్యము కొంత కష్టమైనదైనా, దేవుని మార్గమును సరళము చేయుటకు చేతనైనవారు చేయవలసిన పనియని తెలియవలెను. అలా చేయుట వలన జ్ఞాన రూపములో కల్తీ అయిన దేనినైనా తీసివేసి ప్రజలకు స్వచ్ఛమైన జ్ఞానమును అందించవచ్చును. ప్రపంచములో అన్ని కార్యములలోకెల్ల జ్ఞానమార్గమును సరళము చేసి, ఏ ఆటంకములు లేకుండా చూచి, వాటివలన ప్రక్కదారి పట్టిపోకుండా చేయడము అత్యంత ఉన్నతమైన కార్యమగును. అటువంటి ఉన్నత కార్యమును చేయుటకు ముందు మనము ప్రపంచములోనున్న షట్ శాస్త్రములలో ధర్మశాస్త్రమేదో మొదట తెలుసుకొందాము.

ధర్మశాస్త్రము దేవునికి తప్ప ఏ మనుషులకు తెలియదు. అందువలన దేవునిచేత చెప్పబడినదే ధర్మశాస్త్రమగును. దేవుడు తప్ప మనుషులు చెప్పినది ధర్మశాస్త్రము కాదు. దేవుడు ప్రత్యక్షముగా కాకుండా పరోక్షముగా చెప్పినవి మూడు గ్రంథములు భూమిమీద గలవు. ఆ మూడింటిని దైవ గ్రంథములు అంటాము. ఆ మూడు దైవ గ్రంథములలో ధర్మశాస్త్రము సంపూర్ణముగా కలదు. ధర్మశాస్త్రమును అనుసరించి దేవుడు మూడు గ్రంథములను తయారు చేసి మానవాళికి ఇచ్చాడు. ఆ మూడు గ్రంథములనే ప్రథమ దైవ గ్రంథమని మొదటి దానినీ, ద్వితీయ దైవ గ్రంథమని రెండవ దానినీ, అంతిమ దైవ గ్రంథమని మూడవ దానినీ అంటున్నాము. ప్రథమ దైవ గ్రంథముగా భగవద్గీత, ద్వితీయ దైవ గ్రంథముగా బైబిలు, అంతిమ దైవ గ్రంథముగా ఖుర్ఆన్ గ్రంథములు గలవు. దేవుని విషయములో ఏది సత్యమో, ఏది సత్యముకాదో, ఏది

ధర్మమో, ఏది ధర్మముకాదో తేల్చి చెప్పునవి ఈ మూడు గ్రంథములేనని తెలియవలెను. ఇప్పుడు అసలు విషయానికి వచ్చి చూస్తాము. పైన వేదములకు సంబంధించిన వాక్యమును చెప్పుకొని, అది దేవునికి సంబంధించినదా లేక మాయకు సంబంధించినదా అని చూచుటకు ధర్మ శాస్త్రమును వినియోగించుకొందాము. ఇతరులు వేదమునకు సంబంధించిన ఆ వాక్యము దేవునికి సంబంధించినదనీ, ఎవరైనా దేవునికి సంబంధించినది కాదు అంటే వేదములను అవమానపరచినట్లనీ చెప్పారు. అందువలన వారు చెప్పిన మాటను మూడు దైవ శాస్త్రములను అనుసరించి చూస్తే, బైబిలు గ్రంథములో వేదముల ప్రసక్తే లేదు. అలాగే ఖుర్‌ఆన్ గ్రంథములో కూడా వేదముల ప్రస్తావన రాలేదు. ఇక ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో మాత్రము వేదములను గురించి చెప్పడము జరిగినది.

భగవద్గీతలో సాంఖ్యయోగమున 45వ శ్లోకమందు "త్రైగుణ్య విషయా వేదా" అని ఒకచోట, విజ్ఞాన యోగమున 14వ శ్లోకమందు "గుణమయీ మమ మాయా దురత్యయా" అని ఒకచోట, అలాగే విశ్వరూప సందర్శన యోగమున 48వ శ్లోకమందు మరియు 53వ శ్లోకమందు వేదములను గురించి చెప్పడము జరిగినది.

*శ్లో॥ 48. నవేద యజ్ఞా ధ్యయనైర్న దానైర్న చక్రియాభిర్న తపోభిరుగ్రైః ।*
*ఏవం రూప శ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురు ప్రవీర ॥*

*శ్లో॥ 53. నాహం వేదైర్న తపసా నదానేన నచేజ్యయా ।*
*శక్య ఏవం విధోద్రష్టుం దృష్ట వానసి మాం యథా ॥*

48) భావము :- అర్జునా! భూమిమీద నీవు తప్ప ఈ రూపమును చూచినవారు ఎవ్వరూ లేరు. యజ్ఞముల వలనగానీ, వేదముల వలనగానీ,

దానముల వలనగానీ, తపస్సులచేతగానీ నన్ను చూచుటకు ఎవరికీ శక్యము కాలేదు.

53) భావము :- తపస్సుల చేతగానీ, దానములచేతగానీ, యజ్ఞముల చేతగానీ, వేదాధ్యయనము చేతగానీ ఇప్పుడు నీవు చూచిన ఈ రూపమును చూచుటకు సాధ్యపడదు.

సాంఖ్యయోగములో వేదములందు మూడు గుణముల విషయములే ఉన్నాయని 45వ శ్లోకమున చెప్పిన భగవంతుడు, విజ్ఞానయోగమున గుణములతో కూడుకొన్న నా మాయను జయించుట దుస్సాధ్యమని 14వ శ్లోకమున చెప్పాడు. తర్వాత విశ్వరూప సందర్శన యోగమున 48, 53వ శ్లోకములలో యజ్ఞముల వలనగానీ, వేదములవలనగానీ, తపస్సుల వలనగానీ, దానముల చేతగానీ నన్ను తెలియుటకు శక్యముకాదు అని చెప్పాడు. భగవంతుడు చెప్పిన మాటలనుబట్టి ప్రకృతి చేత పుట్టిన గుణముల విషయములే వేదములందు ఉన్నాయనీ, గుణములనే మాయ అంటారనీ చెప్పాడు. అప్పుడు వేదములు మాయతో కూడుకొన్నవని ప్రత్యేకముగా చెప్పకనే చెప్పినట్లున్నది. ఇదంతయు గమనిస్తే ధర్మశాస్త్రమైన భగవద్గీత గ్రంథము వేదములనుండి మానవున్ని దూరముగా ఉండమని చెప్పుచున్నట్లు తెలియుచున్నది. మరియు వేదముల వలన దేవుడు ఎప్పటికీ తెలియడని విశ్వరూప సందర్శనయోగములో తెలిసిపోయినది.

బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలో, వేదములను గురించి స్వయముగా భగవంతుడే వీటి వలన నేను తెలియబడను అని చెప్పినప్పుడు ఆ మాటను వదలి, మానవుడైన దయానంద సరస్వతో, ప్రేమానంద బృహస్పతో చెప్పిన మాటలను ఎందుకు పరిగణనలోనికి తీసుకొనవలెను?

భగవద్గీత భూమిమీద మొట్టమొదట తెలిసిన ధర్మశాస్త్రము. ధర్మశాస్త్రములోని దేవుని మాటను వదలి, వేదములను గురించి గొప్పగ చెప్పవలసిన అవసర మేమివచ్చినదని మేము ప్రశ్నించుచున్నాము. భూమిమీద స్వాములము, గురువులము, భగవానులము అని పేరు పెట్టుకొన్న వారందరూ నిజముగా గురువులు కారు, భగవంతులు కారు. అటువంటి వారి మాటలను విని తప్పుదారి పట్టవలసిన అవసరము లేదు. వేదములు, పురాణములు చదివిన వారికి భగవద్గీతలో వేదముల గురించి చెప్పిన విషయము తెలియకుండా ఉంటుందా? బహుశా తెలిసేవుంటుంది. ఇప్పుడు మరొక వాక్యమును చూస్తాము. "హైందవ క్రైస్తవము" అను పుస్తకములో 5వ పేజీలో ఈ విధముగా వ్రాయబడి వున్నది.

***"వేదాలు కరుణామయుడైన పరాత్పరుడు మానవాళికి ప్రసాదించిన తొలి జ్ఞానదీపము"***

ఈ వాక్యమునుబట్టి వేదములను దేవుడే సృష్ఠించాడని అందరికీ అర్థము కాగలదు. అయితే ఈ మాట పచ్చి అబద్ధమా లేక వట్టి నిజమా అని యోచించి, ఆలోచించి చూస్తాము. వేదాలను, పురాణములను దేవుడు వ్రాయవలసిన అవసరము లేదు. వేదములు గుణములతో కూడుకొన్నవి, కావున గుణములున్న మనుషులే వాటిని వ్రాయగలరు. దేవుడు గుణములు లేనివాడు, కావున దేవున్ని గుణాతీతుడు అని అంటారు. జీవుడైనవాడు తలలోని గుణచక్రములో పన్నెండు గుణములయందు చిక్కుకొని ఉన్నాడు. దేవుడు జీవునివలె గుణములలో లేడు. అందువలన ఆయన గుణాతీతుడు. గుణాతీతుడైన దేవున్ని పై వాక్యములో కరుణామయుడు అని సంబోధించి చెప్పాడు. ఏ గుణముతో సంబంధము లేనివానిని ఒక గుణముతో ముడివేసి

కరుణామయుడు అనడము దేవున్ని పొగిడినట్లా, లేక కించపరిచినట్లా మీరే ఆలోచించండి. గుమస్తా స్థానములో యజమానిని కూర్చోబెట్టడము వలన యజమానిని అవమానించినట్లు కాదా! యజమాని స్థానము గొప్పది, గుమస్తా స్థానము చిన్నది అయివుంటుంది. అటువంటప్పుడు యజమానిని గుమస్తా స్థానములో ఉంచడము వలన యజమానిని గుమస్తా స్థాయికి దిగజార్చినట్లగును. అందువలన జ్ఞానము తెలిసినవాడు ఎవడైనా దేవున్ని కరుణా మయుడు, దయామయుడు అని అనడు.

పై వాక్యములో దేవున్ని కరుణామయుడు అని చెప్పడమే పెద్ద తప్పు. అంతటితో ఆగక వేదాలను దేవుడే మానవాళికి ఇచ్చాడు అనడము మరీ పెద్దతప్పు. తన ధర్మములనే దేవుడు ప్రత్యక్షముగా ఎవరికీ చెప్పలేదు. పరోక్షముగా మనుషులకు చెప్పాడు. తన ధర్మములు తనకు తప్ప ఏ మానవునికీ తెలియవు. కావున తన ధర్మములను ప్రత్యక్షముగా కాకుండా పరోక్షముగా చెప్పాడు. ప్రత్యక్షముగా చెప్పితే దేవుడు ఎవరైనది, ఎట్లున్నది మనిషికి తెలిసిపోతుంది. దేవుడు ఎట్లున్నది ఎవరికీ తెలియకూడదు. కావున ఆయన ప్రత్యక్షముగా చెప్పక పరోక్షముగా చెప్పాడు. అందువలన ప్రపంచములో దేవున్ని ఇంతవరకు ఎవరూ చూడలేదని చెప్పవచ్చును. పూర్తి రహస్యముగాయున్న దేవుడు గుణములతో కూడుకొన్న వేదములను చెప్పినాడంటే! అడవిలోని పులివచ్చి మా పెరటిలోని ఆవు దగ్గర పాలు త్రాగిపోయిందని చెప్పినట్లుంటుంది. పులివచ్చి ఆవు పొదుగులోని పాలను త్రాగి పోయిందనడము ఎంత అసత్యమో, దేవుడు వేదాలను చెప్పాడనడము అంతే అసత్యమగును.

కొందరు మహర్షులు వ్రాసిన విషయములన్నిటినీ ద్వాపర యుగములో వ్యాసమహర్షి జమచేసి, వాటికి జతగా తాను కూడా కొంత

వ్రాసి కూర్చిన గ్రంథములే వేదములు. వేదములు నాలుగు గ్రంథములుగా నాలుగు పేర్లతో కలవు. నాల్గువేదములను జతచేసి, వ్రాసి నాలుగు గ్రంథములుగా చేసినవాడు వ్యాసుడు. వేదములను మానవాళికి పరిచయము చేసిన వ్యక్తి వ్యాసుడు. వేదములను అందించినవాడు వ్యాసుడు అని శాశ్వతముగా తెలియునట్లు, అంతవరకు వ్యాసునిగా పిలువబడు ఆయనను అప్పటినుండి వేదవ్యాసుడు అని అందరూ అనడము మొదలుపెట్టారు. వేదముల రచయిత గ్రంథకర్త వేదవ్యాసుడు. వేదములను గ్రంథరూపముగా ప్రజలకు పరిచయము చేసిన తర్వాత వ్యాసుడు పదునెనిమిది పురాణములను కూడా వ్రాయడము జరిగినది. ఈ విధముగా చతుర్ వేదములనూ, అష్టాదశ పురాణములను వ్యాసుడు వ్రాశాడని చాలామందికి తెలియక పోయినా, కొందరికైనా తెలుసు. కొందరికి తెలియనంత మాత్రమున వ్యాసున్ని ప్రక్కన పెట్టి, దేవుడే వేదముల రచయిత అనడము పూర్తి అసత్యము. దేవుడు సృష్ట్యాదిలోనే తన ధర్మశాస్త్రమును తెలియజేశాడు. ద్వాపరయుగము చివరిలో వేదవ్యాసుని చేత వేదములు బయటికి చెప్పబడినవి. అందువలన పై వాక్యములో దేవుడు వేదములను మానవులకు ఇచ్చాడు అనడము పూర్తి తప్పు. ఇప్పుడు "హైందవ క్రైస్తవము" అను పుస్తకములోనే ఆరవ పేజీయందు గల ఒక వాక్యమును తీసుకొని చూద్దాము.

***"సనాతన ధర్మమునకు మూలము వేదాలే. వేదము చెప్పిందేమిటో వింటే తప్ప ప్రజలకు సనాతన ధర్మము అంటే ఏమిటో తెలియదు."***

ఇంటిలో పెరిగిన కుందేలుకు అడవిలో తిరిగే పులి విషయము తెలుసు. అందువలన పులి సమాచారము ఎవరికైనా కావాలంటే, మా

ఇంటిలోని కుందేలే గతి అన్నట్లు, పులిలాంటి సనాతన ధర్మమును తెలియాలంటే, ఇంటి కుందేలులాంటి వేదాలే ఆధారమని రంజిత్ చెప్పిన మాటను విని వేదముల మీద ఆయనకున్న ప్రేమ ఎంతటిదో అర్థమైనది. వయస్సులో నేను తండ్రిలాంటివాడిని, ఆయన కుమారునిలాంటి వాడు. మా ఇంటిలో నా కుమారుడు ఒక విషయములో పొరపడి ఏదైనా తప్పు నిర్ణయమును తీసుకొంటే, ఇంటిలో పెద్దయిన నేను అది మంచి నిర్ణయముకాదు, దానివలన నీవు ఎక్కువ నష్టపోతావు అని తప్పక చెప్పి, ఆ నిర్ణయమునుండి తప్పించి, మంచి నిర్ణయము తీసుకొనేలాగ చూస్తాము. ఇప్పుడు ఎవరో క్రైస్తవుడు వ్రాసుకొన్నాడు నాకెందుకులే అని నేను అనుకోవడము లేదు. ఇంటిలో నా బిడ్డ పొరపడితే సర్ది చెప్పడము నా బాధ్యతయైనట్లు, దేవుని రాజ్యములో ఏక కుటుంబముగాయున్న మనము, ఒకరి తప్పును మరొకరు విప్పి చెప్పుకొని తప్పును సవరించుకోవడము మన బాధ్యత. ఇప్పుడు అదే దృష్టితోనే అద్దంకి రంజిత్ గారికి నీ నిర్ణయము తప్పు వేదాల మాయలో పడవద్దని చెప్పుచున్నాను.

వేదాల వలలోపడి హిందూ మతములో ఇంతవరకు ఎవరుగానీ దేవున్ని చేరలేదు. దేవునిమీద ఇష్టము, విశ్వాసమువుంటే దేవుడిచ్చిన బైబిలు గ్రంథమును ఆశ్రయించు, దానినే చెప్పు, దానినే పొగుడు. మనిషి ఆధ్యాత్మిక మార్గములో ప్రయాణించుటకు దేవుడే మార్గమును ఏర్పరచి భారతదేశములో భగవద్గీతను, ఇశ్రాయేల్ దేశములో బైబిలు మరియు ఖుర్ఆన్ గ్రంథములను దేవుడే మానవాళికి అందించాడు. దేవుని మార్గములో మూడు గ్రంథములు సమానమే అయినా, నేడు క్రైస్తవులందరూ బైబిలు గ్రంథమును తమ గ్రంథముగా చెప్పుకొంటున్నారు. ఒక మనిషి మూడు దైవ గ్రంథములలో దేనిని ఆశ్రయించినా, అందులో దేవుని జ్ఞానమే తెలియును. కనుక

వజ్రములాంటి బైబిలువుండగా, దానిని వదలి ఓటురాయిలాంటి వేదములను గురించి రంజిత్ ఎందుకు చెప్పుచున్నాడో మాకు అర్థము కాలేదు. అయినా మేము చెప్పదలచుకొన్నది ఏమనగా!

బైబిలు గ్రంథములో దేవుని విషయములు సంపూర్ణముగా ఉన్నవి. బైబిలు గ్రంథము ముందర వేదములు మృష్ఠాన్న భోజనములో కేవలము ఊరగాయ లాంటివి. అన్నముతింటే కడుపు నిండుతుందిగానీ, ఊరగాయను ఎంతతిన్నా కడుపులో మంటతప్ప ఆకలి తీరదు. అలాగే వేదములను ఎంత చెప్పుకొనినా, వాటివలన ప్రపంచములో చిక్కుకొనడము తప్ప దేవునికి దగ్గర కాలేరు. బైబిలు గ్రంథములో మత్తయి, మార్కు, లూకా, యోహాన్ సువార్తలు నాలుగు దేవుని జ్ఞానమును సంపూర్ణముగా అందించాయి. ఒక్క యోహాన్ సువార్తలో మనిషి తన మెదడుకు ఎంత అర్థము చేసుకోగలడో అంత జ్ఞానమును దేవుడు అందించాడు. యోహాన్ సువార్తలోని వాక్యములు మనిషిని కదిలించి వేసి కన్నీటిని కార్చు ఆనందమును అందించుచుండగా, దానిని గొప్పగా చెప్పుకోక ఉల్లిగడ్డ వాసనకు కళ్ళు మంటలేసి కళ్ళు నీళ్ళు కారితే వాటినే ఆనందభాష్పములు అనడము ఎంత సమంజసము కాదో, వేదములను గురించి పొగిడి చెప్పుకోవడము అంతే సమంజస మగును. దేవుడు మారువేషములో ఏసు అను పేరుతో భూమిమీదికి వచ్చి, తనకు తప్ప ఎవరికీ తెలియని జ్ఞానమును మూడు సంవత్సరములు ఊరూరు తిరిగి ప్రజలకు తెలియజేశాడు. ఆనాడు తనకంటూ ఒక నివాసము ఏర్పరచుకోకుండా, ముప్పైమూడు సంవత్సరములు ఇశ్రాయేల్ దేశములో వుండి, మూడు సంవత్సరములు జ్ఞానమును బోధించి, ముప్పై మూడు గంటలు మృతి చెంది తిరిగి బ్రతికి, మూప్పైమూడు మార్లు శిష్యులకు కనిపించి, చివరి కలయికలో తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని చెప్పి

బోధకులుగా యున్నవారు ముగ్గురిని గురించే బాప్తిస్మము ఇచ్చి, తాను చెప్పిన సమాచారమునే బోధించమని చెప్పగా, ఇటు బోధించే వారు తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ ఎవరో చెప్పడము లేదు. అటు తెలుసుకొనే వారూ ఆ ముగ్గురిని గురించి అడుగడమూ లేదు. ఆయన చివరిలో చెప్పిన ఎంతో గొప్ప జ్ఞానమునుగానీ, ముందు చెప్పిన యోహాన్ సువార్తలోని జ్ఞానముగానీ, ఎంతో అద్భుతము ఆశ్చర్యమును కల్గించునదై ఉండగా, దానిని వదలి వేదములను చెప్పుకోవడము పెద్దపొరపాటు. మనిషి అయిన తర్వాత ఎవరైనా దేవుని విషయములో పొరపాటు పడవచ్చును. అయినా దానిని ఆలోచించి సవరించుకోవడానికి దేవుడు ప్రతి మనిషికీ బుద్ధిని కూడా ఇచ్చాడు. అందువలన ఎవరైనా తమ తప్పును సవరించుకొనుటకు అవకాశమున్నది. ప్రపంచ విషయములో పొరపడినా ఫరవాలేదు. దేవుని విషయములో పొరపడకూడదు. మేము మతమునుగానీ, మతద్వేషమును గానీ మనస్సులో పెట్టుకొని ఎవరినీ విమర్శించడము లేదు. క్రైస్తవులైన వారు బైబిలులోనే జ్ఞానమును వెతుకమని చెప్పుచున్నాము. అలాగే ఏ మతమువారు ఆ మతమునకు అలవాటైన గ్రంథమునుండే జ్ఞానమును తెలుసుకోమని చెప్పుచున్నాము. హిందువులు భగవద్గీతను, ముస్లీమ్‌లు ఖుర్‌ఆన్ గ్రంథమును చూడమనీ, అందులోని దేవుని జ్ఞానమును తెలుసు కోమని చెప్పుచున్నాను. మా దృష్ఠిలో అన్ని మతములుగానీ, వారి గ్రంథములుగానీ సమానమే. సత్యమునే బోధించుచున్నాము గానీ మతమును బోధించడములేదు. నేను హిందువుల కుటుంబములో పుట్టినందుకు హిందువునేనని చెప్పవలసివచ్చినా, నేను హిందువే (ఇందువే) అయినా హిందువులు గొప్పగా చెప్పుకొను వేదములను ఖండించుచున్నాను కదా! దేవుడే ఖండించాడని చెప్పుచున్నాము కదా! దీనినిబట్టి మాకు

మతము ముఖ్యము కాదు, సత్యము ముఖ్యమని ఆ విధముగానే మాట్లాడు చుందుమని తెలియవలెను.

సనాతన ధర్మమంటే ఆదినుండి ఉన్న ధర్మమని అర్థము. ఆదిలో ఆకాశ శబ్ధము ద్వారా దేవుడు తెలియజేసిన జ్ఞానమే సనాతన ధర్మముగా చెప్పబడుచున్నది. దానినే కృష్ణుడు చెప్పాడు. దానినే ఏసు చెప్పాడు. దానినే జిబ్రయేల్ చెప్పాడు. ఆదిలో చెప్పిన ధర్మమును మనకు తెలిసి కృష్ణుడు, ఏసు, జిబ్రయేల్ ముగ్గురు చెప్పగా, ఆచరించిన వారిలో ముఖ్యముగా రావణబ్రహ్మ ఉన్నాడని చెప్పవచ్చును. ఈ విధముగా సృష్ఠి ఆదినుండి ఎప్పటికీ మారకుండ ఉన్న ధర్మమునే సనాతన ధర్మము అంటున్నాము. అంతే తప్ప సనాతన ధర్మమునది ప్రత్యేకించి ఒక మతమునకు సంబంధించినది కాదు. దేవుడు చెప్పినదే సనాతన ధర్మము. అది నేటికినీ మూడు దైవ గ్రంథములలోనూ చెక్కుచెదరకుండ, ఏ మార్పూ లేకుండా యున్నది. అందువలన సనాతన ధర్మములకు మూలము మూడు దైవ గ్రంథములేనని చెప్పవచ్చును. అంతేగానీ వేదములు ధర్మములకు మూలము కాదు.

ఇప్పుడు రంజిత్‌గారి "హైందవ క్రైస్తవము" అను గ్రంథమునుండి మరొక విషయమును స్వీకరించి, అందులోని సత్యాసత్యములను తెలుసు కొందాము. ముందు మాటలలోని ఎనిమిదవ పేజీయందు ప్రస్తావన అను పేరు క్రింద వ్రాయబడిన రెండు మూడు పేరాలలో ఇలా కలదు చూడండి.

***"భూలోకంలో ఎన్నో వేల, లక్షల గ్రంథములు వ్రాయబడినాయి. కానీ, ఈ భూమిమీద మొట్టమొదట వ్రాయబడిన గ్రంథము, అతి ప్రాచీన సాహిత్యం వేదాలే. వేదాలు ఒక అద్భుత విజ్ఞాన భాండాగారం"***

**<u>"ఈ వేదాలు ఎప్పుడు వ్రాయబడ్డాయి? ఈ విషయములో పండితుల మధ్య ఏకాభిప్రాయము లేదు. సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి వంటి ఉద్ధండులు, వేద విద్యాపారంగతులు వేదాలు క్రీస్తు పూర్వము 2000 ఏళ్ళ క్రితము వ్రాయంబడినవని అభి ప్రాయపడ్డారు."</u>**

భూలోకంలో తయారైన లక్షలాది గ్రంథములలో మొట్టమొదటిది వేదమే అని చెప్పడము, అతి ప్రాచీన సాహిత్యము వేదాలే అని చెప్పడము పూర్తి హాస్యాస్పదముగాయున్నది. అంతటి పురాణ గ్రంథములే వేదములైతే మాజీ రాష్ట్రపతి అయిన సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు వేదములు ఇప్పటికి నాలుగు వేల సంవత్సరముల క్రిందట తయారైనాయని ఎలా చెప్పాడు? అని ప్రశ్న రాక తప్పదు. వేదములు ఎప్పుడు తయారైనాయో పండితులవద్దనే ఏకాభి ప్రాయములేనప్పుడు, అతి ప్రాచీన గ్రంథాలని ఎలా చెప్పగలము? అటువంటప్పుడు వాటిని సనాతన ధర్మాలు అనడము కూడా తప్పేయగును కదా! వీటన్నిటినీ దృష్ఠిలో పెట్టుకొని సరియైన సమాధానము కొరకు కొంత యోచిస్తే, దానికి సంబంధించిన సమాచారము ఇలా కలదు.

భూమిమీద ఆదికవి వాల్మీకి అని అందరికీ తెలుసు. వాల్మీకి రామాయణమును వ్రాశాడు. ఆదికవి వ్రాసినదే మొదటి గ్రంథమవుతుంది. కనుక రామాయణము అన్ని గ్రంథములకంటే ముందు తయారైన గ్రంథమని అందరూ ఒప్పుకోకతప్పదు. అలాంటప్పుడు అన్నిటికంటే ముందు వ్రాయబడినవి వేదాలనడము పూర్తి పొరపాటు. క్రీస్తు పూర్వము 2000 సంవత్సరముల క్రితము వేదాలు వ్రాయబడినాయని డా॥ సర్వేపల్లి

రాధాకృష్ణన్ గారు చెప్పడము వలన అవి (వేదములు) ప్రాచీన గ్రంథములు కావని తెలిసిపోవుచున్నది. వేదముల వెనుకయున్న సత్యమును బయటికి తీస్తే, వేదములు క్రీస్తు పూర్వము మూడువేల (3000) సంవత్సరముల పూర్వము వ్యాసునిచే వ్రాయబడినాయని తెలిసిపోవుచున్నది. పూర్తిగా ఇప్పటికి మొత్తము ఐదువేల (5300) మూడు వందల సంవత్సరముల పూర్వము వేదములను వ్యాసుడు వ్రాసి వేదవ్యాసుడని పేరుగాంచాడు. వ్యాసుడు 4 వేదములను 18 పురాణములను వ్రాసిన తర్వాత చివరిలో భగవద్గీతను వ్రాయడము జరిగినది. భగవద్గీతలో భగవంతుడు చెప్పిన సారాంశమును వ్రాసిన తర్వాత వేదములు మాయతో కూడుకొన్నవని వ్యాసునికి తెలిసిపోయినది. అలా గుణ మాయతో కూడుకొన్న వేదములను వ్రాసి సమాజమునకు కీడు చేశానని వ్యాసుడు పూర్తిగా బాధపడిపోయాడు. దీనినిబట్టి వేదముల గ్రంథకర్త వ్యాసుడనీ, వేదములు దాదాపు 5300 సంవత్సరముల క్రితము వ్యాసునిచే వ్రాయబడినవని తెలిసిపోవుచున్నది. అందువలన వాటిని ప్రాచీన గ్రంథములనకూడదు. వేదములు ద్వాపర యుగము చివరిలో తయారుకాగా, త్రేతాయుగము మొదటిలోనే వాల్మీకి చేత రామాయణము తయారైనది. అందువలన వేదములకంటే ప్రాచీన గ్రంథము రామాయణమని చెప్పవచ్చును.

ఇప్పుడు అద్దంకి రంజిత్ వ్రాసిన ఒక కరపత్రములోని విషయమును గమనిద్దాము. కరపత్రములోని విషయములోగల తప్పుఒప్పులను తెలుసు కొంటే జీవితములో మనము ఎటువంటి తప్పు చేయకుండా ఆధ్యాత్మిక మార్గములో సాగగలమని తెలిసి, అదేపనిగా ఆ విషయమును గమనిద్దాము.

"వేదకాలపు హిందూ మత సిద్ధాంతము ప్రకారము మానవుడు

పరమాత్ముని సన్నిధికి చేరేటప్పుడు జంతురక్త ప్రోక్షణం తప్పని సరియని నేను గమనించాను."

"వేదకాలములో హిందువులు బలులు అర్పించారు, యజ్ఞాలు నిర్వహించారు. సర్వపాపపరిహారో రక్తప్రోక్షణ మవశ్యకమ్ అంటే రక్తము చిందింపకుండా పాపక్షమాపణ కలుగదు అని ఎలుగెత్తిచాటి చెప్పారు."

"సర్వపాపపరిహారం కొరకు ఒక యజ్ఞము జరగాల్సి ఉందని వేద కాలపు హిందూ ఋషులు నమ్మారు. ఆ యజ్ఞానికి "అజామేధం" అని పేరు పెట్టారు. ఒక మచ్చలేని మేకను తెచ్చి, దాని తలమీద బలుసుకంపను చుట్టి కిరీటముగా పెట్టాలి. ఆ మేకను ఒక చెక్కబల్లకు మేకులతో కొట్టి వ్రేలాడదీయాలి. దాని ఎముకలు విరగకుండా జాగ్రత్తగా దాని రక్తమంతా కారిపోవాలి. అలా ఆ మేక చనిపోయిన తర్వాత మళ్ళీ దానికి ప్రాణం పోయాలి. అదే అజామేధం అంటే."

ఈ వాక్యములన్నీ గమనిస్తే ఒక క్రొత్త యజ్ఞమును గురించి చెప్పారని తెలియుచున్నది. ఆ యజ్ఞము పేరు "అజామేధం" అని చెప్పి అది ఎలా చేయాలో కూడా చెప్పారు. యజ్ఞము పేరు ఏదైనా కావచ్చును. దానిని ఎలాగైనా చేయవచ్చును. ఇంతకీ అలా చేయబడు యజ్ఞము చేత

ఏదైనా దైవిక లాభమున్నదా, లేక ప్రపంచ లాభమున్నదా అని ఆలోచిస్తే దాని ద్వారా రెండూ లేవని తెలియుచున్నది. ఎవడో మతిభ్రమించి చెప్పిన వారిమాటలనెల్ల ఎందుకు వినాలి? వినినంతమాత్రమున దానిలోని యుక్తాయుక్తములను ఆలోచించకుండా వారు చెప్పినట్లు ఎందుకు చేయాలి? పొయ్యిమీద కుండబెట్టి కొన్ని కాయకూరలు, బియ్యము వేసి మసాలాలు వేసి వండితే వంట అవుతుంది. అలా వండిన దానిని కాయకూరల పలావు (వెజిటబుల్ బిరియాని) అని అనవచ్చును. అయితే పొరపాటుగా కాయ కూరలలో ఒక పాపరకాయను (తిక్కపుచ్చకాయను) కోసి వేసి వండితే అదికూడా కాయకూరల పలావే అని పిలువబడుతుంది. అయితే అది తినేదానికి మాత్రము పనికి రాదు. చూచేదానికి మాత్రము పనికివస్తుంది. కాయకూరలు, బియ్యము మసాలాలు అన్నీ వేసిన దానిలో పాపరకాయను (తిక్కపుచ్చకాయను) దోసకాయ అనుకొని కోసివేసిన దానివలన, వండిన పలావు అంతయు చేదుగా మారిపోయి, ఎవరూ తినేదానికి కూడా ఉపయోగపడదు. చివరకు పశువులు కూడా తినవు. అదే విధముగా యజ్ఞము అంటే ఎట్లుంటుంది, ఎలా చేయాలి? అని తెలియక ఎవరో చెప్పారని చేస్తే, చివరకు కాయకూరల బిరియాని కాస్త పాపరకాయ బిరియానియైనట్లు చేసిన యజ్ఞము దేనికీ పనికి రాకుండ పోతుంది. అలాగే వేదములో ఎవరో చెప్పిన అజామేధం అను యజ్ఞమును గురించి ముందు వెనుక ఆలోచించకుండ ఆచరిస్తే , కూరకాయల బిరియాని కాస్త తిక్కపుచ్చకాయల బిరియాని అయిపోయినట్లు అది దేనికీ పనికి రాకుండాపోవును. చివరికి వృథాప్రయాసగును.

వేదములు, పురాణములు ఆరు శాస్త్రములలో ఏ శాస్త్రమునకూ సంబంధించినవి కావు. శాస్త్రబద్ధము కాని దానిని గొప్పగ చెప్పుకోవడము,

దానికి ఏదో ఫలితముందని చెప్పుకోవడము అంతయూ మూఢనమ్మక మగును. శాస్త్రీయతలేని దానిని ఎవరూ సమ్మతించరు. పై వాక్యములో మానవుడు పరమాత్మ సన్నిధికి చేరుటకు జంతురక్త ప్రోక్షణం తప్పనిసరి అని వ్రాశారు. ఈ మాట మూడు దైవ గ్రంథములలో ఎక్కడైనా ఉన్నదా? అని అడుగుచున్నాను. అంతేకాక పై వాక్యములో "సర్వ పాప పరిహారో రక్తప్రోక్షణ మవశ్యకమ్" అనుమాట ఏ శాస్త్రములోనిదో చెప్పగలరా? పుక్కిడి పురాణములు, వెకిలి వేదములలోని మాటలను చెప్పవలసిన అవసరము ఏమి వచ్చినది? దేవునిలోనికి ఐక్యమగుట దేవుని విషయమగును. దేవుని విషయములు దైవ గ్రంథములైన ధర్మశాస్త్రములలో ఉండును. దైవ గ్రంథములైన భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములలో ఎక్కడైనా 'రక్తప్రోక్షణము' అనుమాటను దేవుడు చెప్పాడేమో చూపగలరా? మేక రక్తమును కారునట్లు చేసి దానిని చంపడము పాపముతో కూడుకొన్న పని కాక అజామేధ యజ్ఞమని సమర్థించుకోవడమేమిటి? రక్తము కారి చనిపోయిన మేకను తిరిగి ఎవరైనా బ్రతికించగలరా? ప్రకృతిసిద్ధమైన చావు పుట్టుకల సిద్ధాంతమునకు అది వ్యతిరేఖము కాదా? రక్తము పోయి చనిపోయిన మేకను బ్రతికించుట సాధ్యమయ్యే పనియేనా? అలా చనిపోయి బ్రతికిన వాడు ఏసు ఉన్నాడని చెప్పుటకే ఈ అజామేధ యజ్ఞమును గురించి చెప్పడము తప్ప వేరు ఏమీకాదు. అలా చెప్పవలసిన అవసరము ఏమి వచ్చినది?

యజ్ఞముల విషయమును గురించి దైవగ్రంథమైన బైబిలు, ఖురాన్ లో చెప్పకున్నా, భగవద్గీతలో వివరముగా చెప్పారు. యజ్ఞములను గురించి "అధి యజ్ఞోహమే వాత్ర దేహే దేహ భృతాంవర" అని అక్షర పరబ్రహ్మ యోగమను అధ్యాయములో స్వయముగా భగవంతుడైన దేవుడే చెప్పాడు.

ఈ మాటనుబట్టి యజ్ఞములు దేహములోనే జరుగుచున్నవనీ, బయట జరుగు యజ్ఞములు దైవ సంబంధము కాదని తెలిసిపోయినది. శరీరము లోపల జరుగు యజ్ఞములను గురించి భగవంతుడు తన భగవద్గీతయందు జ్ఞాన యోగమున ముప్పైమూడవ (33) శ్లోకములో ఇలా చెప్పాడు.

*33. శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప।*
*సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥*

భావము :- "ద్రవ్యయజ్ఞముకంటే శ్రేష్ఠమైనది జ్ఞానయజ్ఞము కలదు. జ్ఞాన యజ్ఞములో సర్వకర్మములు కాలి బూడిదయి పోవుచున్నవి" అని చెప్పబడి యున్నది. దీనినిబట్టి శరీరములో రెండు రకముల యజ్ఞములు జరుగు చున్నవనీ, అందులో ఒకటి "ద్రవ్యయజ్ఞము", రెండవది జ్ఞానయజ్ఞమనీ తెలియుచున్నది. ఆ రెండు యజ్ఞములలో ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనదనీ, మనిషి చేసుకొన్న సర్వకర్మలు అందులో కాలిపోవుననీ తెలియుచున్నది. ఈ విధముగా యజ్ఞములు శరీరములోనే జరుగుచున్నవని, వాటికి నేనే అధిపతిగాయున్నానని, అక్షర పరబ్రహ్మ యోగము నాల్గవ శ్లోకమున "అధి యజ్ఞోహమే వాత్ర దేహే దేహ భృతాంవర" అని అన్నాడు. ఇట్లు దైవ గ్రంథమైన భగవద్గీతలో శాస్త్రబద్ధముగా యజ్ఞములను గురించి చెప్పియుండగా, దీనిని గురించి చెప్పుకోక శాస్త్రముకానటువంటి వేదములను గురించి, వాటిలోని విషయములను గురించి ఎందుకు చెప్పుకోవాలి? కర్మలు లేకుండా పోయినప్పుడు జన్మకు పోకుండా ఎవడయినా దేవునియందు ఐక్యము కాగలడు. అంతేగానీ బయట యజ్ఞముల వలనగానీ, రక్తమును కార్చడము అను అజామేధ యజ్ఞము వలనగానీ ఎవడూ దేవున్ని చేరలేడు.

'హైందవ క్రైస్తవము' అను గ్రంథములో పూర్తి వేదములను, పురాణములను చెప్పడము యొక్క ముఖ్య ఉద్దేశ్యము హిందువులను ఆకర్షించుటకేనని తెలిసిపోయినది. హిందువులకు సంబంధించిన వేదములను, పురాణములను చెప్పుచూ వాటిని వివరించుచూ, ఆ వివరము ప్రకారము హిందువులను క్రైస్తవము వైపుకు తీసుకుపోవడానికేనని సులభముగా గ్రహించవచ్చును. లోపల ఏదో ఉద్దేశ్యమును ఉంచుకొని బయటికి మరొక రకముగా మాట్లాడడము కపటము అంటాము. అద్దంకి రంజిత్ చెప్పిన విషయములన్నియు మొదట హిందువులకు సంబంధించిన వేదములు, పురాణములతో మొదలుపెట్టి చివరకు క్రైస్తవమును, ఏసును సమర్థించడమూ, ఏసు గొప్ప దేవుడని చెప్పడమూ జరుగుచున్నది. మొత్తము 'హైందవ క్రైస్తవము' అను గ్రంథమంతా చివరి వరకూ అలాగే సాగినది. ఏసు గొప్ప దేవుడని మేము కూడా ఒప్పుకొంటాము. బైబిలు గ్రంథములో ఏసు గొప్పవాడనీ, తెలుసుకొనువానికి తెలుసుకొన్నంత కలదు. శాస్త్ర బద్ధముగా సమృద్ధిగా ఏసు దేవుడు అని తెలియునట్లుండగా బైబిలు పేరును చెప్పకుండా, హిందువుల వేదములను తీసుకొని చెప్పడము వెనుక హిందువులను క్రైస్తవమువైపు లాగుటకు తప్ప వేరు ఉద్దేశ్యము లేదని తెలిసి పోవుచున్నది.

ఈ విధముగా వ్రాయడము దురుద్దేశ్యముతో చేసిన పనేనని చెప్ప వచ్చును. దేవున్ని గురించి మాట్లాడే హక్కు అందరికీ ఉన్నది. బైబిలు గురించి చెప్పాలనుకుంటే చెప్పు, అందులో లేని దేవుని విషయములు వేదములలో ఉన్నాయా? లేక బైబిలులో వేదములను గురించి చెప్పారా? వేదములను గొప్పగా పెట్టుకొన్న హిందువులను తమ మతమువైపు లాగుకొను టకు వేదమునే చెప్పి చివరకు వేదములలో కూడా క్రైస్తవమును, ఏసును

గురించే ఉందని చెప్పడము హిందువులను దారిమళ్ళించుటకేనని తెలిసి పోవుచున్నది. ఈ విధముగా తమ మతమును పెంచుకొనుటకు ప్రయత్నము చేయడమును దేవుడు కూడా ఒప్పుకోడు. ఏసు గొప్పవాడు అని చెప్పడమే హైందవ క్రైస్తవము అను గ్రంథములోని సారాంశము. ఏసు గొప్పవాడు అను విషయమును మేము కూడా చెప్పుచున్నాము. అయితే నేను వేదములను, పురాణములను ఆధారము చేసుకొని చెప్పలేదు. బైబిలు గ్రంథము ప్రకారము అందులో ఆయన చెప్పిన జ్ఞానము ప్రకారము ఏసు గొప్పవాడే, నిజముగా దేవుడేనని హిందువునైన నేను కూడా చెప్పుచున్నాను. నేను పద్ధతి ప్రకారము బైబిలు ప్రకారము చెప్పుచున్నాను. దైవజ్ఞానము తెలిసిన ఎవడుగానీ ఆయన చెప్పిన జ్ఞానము ప్రకారము ఆయనను గొప్పవానిగానే చెప్పవచ్చును. భగవద్గీతలోనున్న జ్ఞానమునే ఏసు చెప్పిన దానివలన, భగవద్గీతను చెప్పిన కృష్ణుడే ఏసుగా పుట్టాడని మేము చాలామార్లు చెప్పాము. అయితే మేము మా మనస్సులోని మాటను ఉన్నదున్నట్లు చెప్పాము. వేదములను, పురాణములను అడ్డము పెట్టుకొని అడ్డముగా ఏదీ చెప్పలేదు. అంతరంగమున క్రైస్తవమును ఏసును ప్రచారము చేయాలని ఉండడము మంచిదే. ఆయన దేవుడే కాబట్టి దైవ గ్రంథమైన బైబిలును అనుసరించి అదేమాటను బయటికి చెప్పవచ్చును. అట్లుకాకుండా చెరువులో చేపలవలెనున్న హిందువులకు వేదములు, పురాణములను వలవేసి పట్టుకొని క్రైస్తవమను బుట్టలో వేసి పెట్టడమును మంచిదికాదని, ఆ పద్ధతిని, ఆ మత ప్రచారధోరణిని దేవుడు ఒప్పుకోడని తెలుపుచున్నాము. 'హైందవ క్రైస్తవము' అను పేరులోనే హిందువులను క్రైస్తవులుగా మారుస్తానని చెప్పినట్లున్నది. ఆ గ్రంథములో ఏ మూల చూచినా అదే ఉద్దేశ్యము కనిపించుచున్నది. ఇదంతా నా హిందూ మతము క్షీణించి పోతుందను

బాధతోనో, క్రైస్తవ మతము మీద అసూయతోనో నేను చెప్పడములేదు. ఇలా చెప్పడము దేవుని విధానమునకు వ్యతిరేఖమని తలచి చెప్పుచున్నాను. వేదములను పొగిడి చెప్పినంతమాత్రమున మేము మభ్యపడి పొంగిపోవడము లేదు. వేదములు హిందుత్వములోనివైనా అవి భగవద్గీతకంటే తక్కువయిన వనీ, అందులో దైవత్వము లేదనీ, భగవద్గీతలో దేవుడే వాటిని ఒప్పుకోకుండా ఖండించాడనీ చెప్పుచున్నాము.

మేము ఇందుత్వమును కాపాడుతాము అను ఉద్దేశ్యముతో "హైందవ క్రైస్తవము" లోని ప్రతి వాక్యమునకు శాస్త్రబద్ధమైన వివరమును ఇస్తూ అందులోని తప్పుఒప్పులను అందరికీ అర్థమగులాగున చెప్పుచున్నాము. ఇందుత్వమును కాపాడుదాము అని అనడము మీరు మీ మతమును గొప్పగా చెప్పడమే కదా! అని కొందరు క్రైస్తవులు ప్రశ్నించవచ్చును. ఇందుత్వము అనునది ఒక మతము కాదు, మతములోని భాగముకాదు. ఇందుత్వము అనునది అన్ని మతములలో ఉండు దేవుని విధానము. ఇందుత్వము అంటే ఏమిటో, దాని అసలు అర్థము ఏమిటో గ్రంథము చివరిలో తెలియ జేస్తాము. చివరిలో చెప్పడమే సరియైన సందర్భమగును. అందువలన మీ ప్రశ్నకు జవాబును ఓపికగా చివరిలో చూడమని తెలుపుచున్నాను.

<u>**ఇప్పుడు హైందవ క్రైస్తవములో మరియొక వాక్యమును తీసుకొని చూస్తాము. "వేదములు అపౌరుషేయములు అంటే మానవుల చేత కల్పింపబడినవి కావు. వేదములు బ్రహ్మ ముఖోద్భిష్టములు. అంటే బ్రహ్మ (సృష్టికర్త) నోటిలోనుండి వెలువడినవని మన పెద్దలు, గురువులు పదేపదే చెప్పుచున్నారు!"**</u>

వేదములు అపౌరుషేయములు అనుమాట నూటికి నూరుపాళ్ళు సత్యము. అయితే ఈ పదమును అర్థము చేసుకోవడములో చాలామంది పూర్తిగా పొరపాటుపడిపోయారు. పురుషులు అంటే మనుషులని, అపౌరుష అంటే మనుషులు వ్రాసినవి కావు అను అర్థమును చెప్పుచున్నారు. మనుషులు వ్రాయకపోతే ఎవరు వ్రాశారని ప్రశ్నించకుండా, వేదములు బ్రహ్మనోటినుండి పలుకబడినవని లేక చెప్పబడినవని గురువులు, పెద్దలు చెప్పినట్లు పై వాక్యములో వ్రాశారు. వాస్తవముగా పెద్దలు (జ్ఞానులు) గురువులు అలా చెప్పియుంటే, నిజముగా వారు గురువులూకాదు, పెద్దలూ కాదని చెప్పవచ్చును. ఎందుకనగా! అపౌరుషేయములు అనుమాటకు పురుషులు వ్రాసినవి కావు అనీ, బ్రహ్మదేవుడు చెప్పినవనీ చెప్పడము పూర్తి తప్పగును. అక్కడ అపౌరుషేయములు అను మాటలో వివరమును చూస్తే పురుషత్వము లేనివి అని అర్థముగలదు. పురుషత్వమంటే ఏమిటి? పురుషత్వము లేకపోతే అందులో ఏముంది? అని అడుగవచ్చును. దానికి జవాబు ఈ విధముగా కలదు.

సృష్ఠిని ఆదిలో సృష్ఠించినవాడు దేవుడు. అందువలన సృష్ఠించిన వాడు పురుషుడు అనీ, సృష్ఠింపబడిన ప్రకృతి స్త్రీతత్త్వము కల్గియున్నదనీ మొరటుగా చెప్పవచ్చును. ధర్మశాస్త్రమును అనుసరించి చెప్పితే ప్రథమ దైవగ్రంథమైన భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగము అను అధ్యాయమున ప్రకృతితో తయారైన శరీరము స్త్రీతత్త్వమనియూ, ప్రకృతి స్త్రీ అనియూ, దేవుడైన తాను పురుషుడననియూ, పురుషుడైన తనకూ స్త్రీ అయిన ప్రకృతికీ పుట్టినవారే సమస్త జీవరాసులనియూ అందువలన సమస్త జీవరాసులకు ప్రకృతి తల్లి అనియూ, దేవుడైన తాను తండ్రిననియూ చెప్పి యున్నాడు. ఇక్కడ దేవుడు తనను తాను పురుషుడనని చెప్పుకోవడము జరిగినది.

తర్వాత ప్రక్క అధ్యాయమైన పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున శరీరములోనున్న జీవుడు దేవుని అంశగలవాడైనందున క్షర పురుషుడనీ, ఆత్మ అక్షర పురుషుడనీ చెప్పి, తనను జీవాత్మ, ఆత్మలకంటే ఉత్తమునిగా చెప్పుచూ, జీవాత్మ, ఆత్మలను ఇద్దరి పురుషులకంటే ఉత్తమ పురుషుడైనందున తనను పురుషోత్తముడని అందురు అని స్వయముగా దేవుడే చెప్పడము జరిగినది అందువలన ప్రకృతి విషయములు ఎక్కడ ఉన్నా వాటిని స్త్రీతత్త్వ విషయములుగా, అలాగే దేవుని విషయములు ఎక్కడయున్నా వాటిని పురుషత్వ విషయములుగా చెప్పవచ్చును. పురుషుడు అనగా ఆధ్యాత్మిక అర్థములో దేవుడని అర్థముండుట వలన దైవ గ్రంథములైన భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములను పురుషత్వముతో కూడుకొన్న వగుట వలన వాటిని పౌరుషములనీ, ప్రకృతి విషయములతో కూడుకొన్న వేదములను పురుషత్వము లేని అపౌరుషములనీ చెప్పబడినవి. పౌరుషములనగా పరమాత్మతత్త్వముతో కూడుకొన్నవనియూ, అపౌరుషములనగా, ప్రకృతి తత్త్వముతో కూడుకొన్నవనియూ అర్థము చేసుకోవలెను.

దేవుడు భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగమున ప్రకృతి పురుషులను గురించి పూర్తి వివరముగా చెప్పియుండుటవలన, అపౌరుషేయములనగా పురుషత్త్వము లేనివనియూ, దైవజ్ఞానము లేనివనియూ చెప్పవచ్చును. వేదములలో ప్రకృతి జనితములైన మూడు గుణముల విషయములే ఉండుట వలన, వాటిని దైవత్వము లేనివని తెలియుటకు వేదములు అపౌరుషములని చెప్పడము జరిగినది. అసలైన అర్థము ఇలాగ ఉండగా, వేదములను మనుషులు చెప్పలేదు. బ్రహ్మయే స్వయముగా చెప్పాడని కల్పించిన తప్పు అర్థముతో చెప్పినా, వాస్తవానికి వాటిని మనుషులే వ్రాశారు. ఏ బ్రహ్మ స్వయముగా వేదములను చెప్పలేదు.

వేదములు నాలుగు ఒకే దేవున్ని నామకావాస్తే చెప్పి, ఎక్కువగా మిగతా దేవతలందరినీ చెప్పడము జరిగినది. ఏ దేవునికి ఏ పూజ చేయాలో, ఏ పూజ ఎలా చేయాలో చెప్పుచూ, మనిషికి మిగతా దేవతలందరినీ పరిచయము చేసినవి నాలుగు వేదములని చెప్పవచ్చును. మూడు దైవ గ్రంథములలో ఒకే దేవున్ని గురించి చెప్పగా, వేదములు మొత్తము సమస్త దేవతలను, వారి ఆరాధనలను గురించి తెలుపడము జరిగినది. హిందూ మతములోని వేదములు ద్వాపరయుగము చివరిలో భగవద్గీతకంటే ముందు తయారైనవి. అంతవరకు విశ్వవ్యాప్తముగాయున్న హిందూసమాజము హిందూమతముగా మారిపోయినది. వేదములు తయారగుట చేతనే ఇందూ సమాజము హిందూమతముగా కావడము జరిగినది. తర్వాత వెనువెంటనే మిగతా మతములు పుట్టుకొచ్చినవి. ఒక విధముగా ఇందూ (హిందూ) సమాజములోని ఏకత్వమును చెడగొట్టినవి వేదములేనని చెప్పవచ్చును. వేదములను అనేక ఋషులనుండి సేకరించి కూర్చి, వారు వ్రాసిన దానిని బట్టి తానుకొంత వ్రాసి, వ్యాసుడు వేదములను గ్రంథరూపము చేశాడు. ఆనాడు ఎందరో ఋషులు చెప్పినదంతా జ్ఞానమేనని నమ్మిన వ్యాసుడు అదే కోవలో తానూ కొంత వ్రాయడమేకాక, సేకరించిన దానినీ, తాను వ్రాసిన దానినీ అన్నిటినీ కలిపి వ్యాసుడు నాలుగు వేదములుగా గ్రంథ రూపము చేశాడు. తర్వాత అనతి కాలములోనే భగవంతుడైన శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీత సమాచారము అర్జునుని ద్వారా వ్యాసునికి చేరినది. అర్జునుడు వినిన దానిని చెప్పగా, విన్న వ్యాసుడు దేవుని జ్ఞానమునకు ఆశ్చర్యపోయి, తాను వేదములు, పురాణములు వ్రాసి తప్పు చేశానని తలచి, దానికి ప్రాయశ్చిత్తముగా బాధపడడమేకాక, దేవుడు భగవంతునిగా చెప్పిన జ్ఞానమును ప్రజలకు అందివ్వాలని భగవద్గీతను గ్రంథరూపముగా వ్రాసి

ఇచ్చాడు. వేదములను వ్రాసిన వ్యాసుడే తాను తప్పు చేశానని తలచి ఆ తప్పునుండి బయటపడుటకు భగవద్గీతను వ్రాసి ఇస్తే, నేటి ప్రజలలో కొందరు భగవద్గీతను వదలి వేదములను పొగడడము ఏమనవచ్చునో మీరే ఆలోచించండి. వేదములకు వ్యతిరేఖముగానున్న భగవద్గీతను వ్యాసుడు ఎందుకు వ్రాశాడో, వ్యాసుడే తన వ్రాతలో వేదములు గుణ సమ్మేళనము లనీ, వేదములు మాయయనీ, వేద సహితమైన మాయను దైవజ్ఞానము లేనివారు ఎవరూ దాటలేరని వ్యాసుడు ఎందుకు చెప్పాడో, కొందరైనా కొంతైనా యోచించక గ్రుడ్డిగా వేదములను పొగడడము జ్ఞానమనవచ్చునో, అజ్ఞాన మనవచ్చునో మీరే నిర్ణయించుకోండి.

'హైందవ క్రైస్తవము' అను గ్రంథములో హిందువులను మభ్య పెట్టుటకు ఎన్నో విషయములను వేదములనుండి తీసి చూపించారు. అలా చూపించుచూ చివరకు క్రైస్తవమును చాటి చెప్పాలనునదే వారి ఉద్దేశ్యము. వారి ఉద్దేశ్యమంతా మొత్తము మతము మీద ముడిపడియున్నది. ఆ విధానములో బోధించుచూ, ఏసు చనిపోయి తిరిగి అదే శరీరముతో లేచాడని, దానినే పునరుత్థానమనుచున్నామని, ఇంద్రుడే ఆ విధముగా ఏసుగా పుట్టి తన మహిమను అలా చూపాడనీ వ్రాశారు. తాము తమ మతమును ప్రచారము చేసుకొనుటకు మా లెక్కలో భగవంతుడైన ఏసును చివరకు ఇంద్రునిగా చెప్పడము సమంజసమా? అని అడుగుచున్నాము. మాకు తెలిసి ఇంతవరకూ ప్రపంచములో రెండుమార్లు గ్రహములు దేవుని జ్ఞానమును చెప్పగా, రెండుమార్లు భగవంతుడు జ్ఞానమును చెప్పాడు. ఎవడయితే శ్రీకృష్ణునిగా భారతదేశములో వచ్చాడో, ఆయనే ఏసుగా ఇజ్రాయేల్ దేశములో రావడము జరిగినది. దేవుడే భగవంతునిగా రెండు మార్లు రెండు పేర్లతో వచ్చి తన జ్ఞానమును చెప్పిపోతే, ఆయన ఎవరో తెలియనివారు ఇంద్రునిగా పోల్చి చెప్పడము దేవున్ని అగౌరవపరచినట్లు

కాదాయని ప్రశ్నించుచున్నాను. ఒక విధముగా ఏసు యొక్క మహిమను చాటిచెప్పి హిందువులను ఆకర్షించాలనుకొని చేసిన ప్రయత్నములో, వీరు క్రైస్తవ మతము కొరకు ఏసును కూడా అమ్మేటట్లున్నారనీ, బజారులో వేలము వేసేటట్లున్నారనీ తెలియుచున్నది. ఆ విధానము ఎట్లున్నదో అందరికీ తెలియుటకు 'హైందవ క్రైస్తవము' అను గ్రంథములో 44, 45 పేజీలలోని విషయమును ఉన్నదున్నట్లు చూపించుచున్నాము చూడండి.

"పునర్జన్మలున్నాయని భారతీయ సమాజము వేల యేళ్ళ తరబడి నమ్ముతోంది. ప్రతి జీవికీ పునర్జన్మ సహజమని నమ్మినప్పుడు, ఇక ఇంద్రుడు చచ్చిపోయి పునర్జన్మ ఎత్తడములో ఇంద్రుని మహిమ ఏముంది? ఇంద్రుని మహత్యమేముంది?

అందరూ చచ్చి, మళ్ళీ ఇంకొక మాతృగర్భములో జన్మించడము సాధారణమైన విషయము అనుకుంటున్నారు కనుక, దానికి భిన్నమైనది ఇంద్రుడు చేసి చూపించాలి. అప్పుడే మనము ఇంద్రుని మహత్యమును చూడగలము.

మరణించిన తర్వాత ఇంద్రుడు తన మహిమను చూపించాలంటే ఏం చేయాలి? మళ్ళీ ఎక్కడో, ఎవరూ గుర్తు పట్టడానికి వీలులేకుండా ఇంకొక అమ్మకడుపులో పుట్టడము కాదు. ఇంద్రుడు మరణించి మళ్ళీ ఆదే శరీరముతో లేవాలి. దానిని పునరుత్థానము అంటారు.

కొంచెము మనము ఇంగితాన్ని ఉపయోగించి ఆలోచిస్తే చచ్చి మళ్ళీ మరో గర్భమునుండి పుట్టడము ప్రాణికోటికి సర్వ సహజమని భారత సమాజము నమ్ముతోంది గనుక, ఇంద్రుని మహిమను మనము చూడాలి అంటే (చూడండి అంటోంది వేదము) ఇంద్రుడు మరణించి మళ్ళీ అదే శరీరముతో మరణాన్ని జయించి లేవాలి. మళ్ళీ పునరుత్థానుడు కావాలి.

అతడే సూర్యుడు, అతడే అగ్ని అతడే అన్నము. అతడు మరణించి లేచినవాడు. అతడు సృష్టికి పూర్వము ఒకసారి యజ్ఞమై నాడు. సృష్టి జరిగిన తర్వాత మనిషిగా మరోసారి యజ్ఞమైనాడు. మరణించి లేచి తన మహిమను చూపించాడు.

ఇంతవరకు వ్రాసిన వాక్యములన్నీ చూచారు కదా! ఈ గ్రంథకర్త ఏసును గొప్పగా చెప్పవలెనను ప్రయత్నము చేయడము మాకు కూడా సంతోషమే. అయితే ఆ ప్రయత్నములో వేదములను ఉపయోగించి చెప్పి ఏసును సామాన్య మానవుని స్థితిలోనికి దించివేశాడు. ఒక విధముగా ఇది తెలియక చేసిన పొరపాటేనని మాకు అర్థమగుచున్నది. అయితే తాను చేసిన పొరపాటేమిటో గ్రంథకర్తకు ఇంతవరకూ తెలియదనియే అనుకుంటాను. దీనికంతటికీ కారణము మతము మీద మమకారము తప్ప మరేమీ కాదని చెప్పవచ్చును. ఏసు చనిపోయి తిరిగి అదే శరీరముతో లేచినమాట నిజమే. క్రైస్తవులందరికీ అదే గొప్పకార్యముగా కనిపించు చున్నదనుకుంటాను.

చాలామంది క్రైస్తవులు మా దేవుడు తప్ప మరి ఏ ఇతర మతస్థుల దేవుళ్ళయినా చనిపోయి తిరిగి అదే శరీరముతో లేచారా? అని ప్రశ్నించు చున్నారు. తిరిగి అదే శరీరముతో మరణము నుండి లేచినవాడే నిజమైన దేవుడని కొందరు క్రైస్తవులు అంటున్నారు. ఇక్కడ ఇంద్రుడే ఏసు అను మనిషిగా పుట్టి తన మహత్యమును చూపుటకు, ఆ విధముగా చనిపోయిన తర్వాత మరణాన్ని జయించి పునరుత్థానుడయ్యాడని చెప్పుచున్నారు. ఏసు ఎవరో సరిగా గుర్తించలేని క్రైస్తవులు అలా ఆయనను ఇంద్రుడనడము చాలా పెద్దపొరపాటు. ఏసును చూచి ఇంద్రుడనడము చక్రవర్తిని చూచి పౌరాణిక నటుడు అన్నట్లున్నది. ఏసును ఇంద్రునితో పోల్చడము వలన ఏసు ఎంతటివాడో, ఎంత శక్తిగలవాడో తెలియకనే అలా చెప్పారని అనుకుంటున్నాము. ఏసును ఇంద్రునిగా పోల్చి గొప్పగ చెప్పుకొన్నట్లు అనుకొనిన వారు, మరణమునుండి తిరిగి అదే శరీరముతో లేచాడనీ, అలా లేచుట వలన ఏసు గొప్పవాడని చెప్పడము కూడా, ఆయనను వారికి తెలియకనే తగ్గించి మాట్లాడినట్లయినది.

ఇక్కడ నేను ఒక విషయమును చెప్పుతాను దానిని గూర్చి మీరు కొంత ఆలోచించండి. అప్పుడు మీరు పునరుత్థానము గొప్పదనుట సరియైనదో, కాదో కొంతవరకు మీకే అర్థము కాగలదు. ఏసు తన జీవితములో ముప్పై సంవత్సరముల తర్వాత మూడు సంవత్సరములు జ్ఞానమును ప్రజలకు బోధించాడు. ఆ సమయములో ఒకచోట ఒక బాలిక చనిపోయినదని కొందరు ఏడుస్తుండగా చూచి, ఎందుకు రోధించుచున్నారని ఏసు వారిని అడిగాడు. అప్పుడు వారు తమ ఇంటిలో ఒక బాలిక చనిపోయినదనీ, ఆవేదనను తట్టుకోలేక ఏడుస్తున్నామని చెప్పి శవయాత్రకు (అంత్యక్రియలకు) తయారవుచుండగా, ఏసు వారిని చూచి మీ బాలిక

చనిపోలేదు, మీరు పొరపడి చనిపోయినదని అనుకొన్నారని చెప్పి, వారి ఇంటిలోనికిపోయి ఆ బాలికను తట్టి చేయిపట్టుకొని లేవమనగా, ఆ బాలిక సజీవమై లేచినది. అప్పుడు అక్కడున్న వారందరూ ఆ సంఘటనను చూచి ఆశ్చర్యపోయారు. చనిపోయిన బాలికకు ప్రాణము పోసిన దేవుడని ఏసును అనుకోవడము జరిగినది. ఇదే విధముగా మరియొకచోట లాజర్ అను వ్యక్తిని లాజర్ లేచిరా! అని పిలిచి అతనిని మరణమునుండి లేపాడు. ఏసు రెండుచోట్ల వారు చనిపోలేదు అని చెప్పి ఇరువురిని లేపడము జరిగినది కదా! ఆ విషయమును మనము బైబిలులో కూడా చదివియున్నాము.

ఇక్కడ మేము చెప్పు ముఖ్య విషయమేమనగా! ఏసు పిలిచినంత మాత్రమున చనిపోయినవారు తిరిగి అదే శరీరముతో లేచారు కదా! అది పునరుత్థానము కాదా! చనిపోయినవాడు తిరిగి శరీరముతో లేస్తే, అది పునరుత్థానమే అగుతుంది. ఏసుప్రభువు మరణమునుండి లేచినప్పుడు అది మహత్యమైనప్పుడు, గొప్పకార్యమైనప్పుడు, ఏసు సమక్షములోనే లేచిన వారిని ఏమనాలి? దానికి చనిపోయినవారు స్వయముగా లేవలేదు ఏసు ప్రభువు లేపివుంటే లేచారు. కావున అలా లేపిన ఏసును గొప్పవాడనాలి. లేచిన వారిని గొప్పవారనకూడదు అని అనవచ్చును. సరే మీకు అలాగే అర్థమైనది కాబట్టి మేము దానిని గురించి ఏమి చెప్పినా వినరు. ఆ విషయమును అలా వదలివేసి, మరికొన్ని చోట్ల భూమిమీద చనిపోయిన వారు కొన్ని రోజుల తర్వాత లేచిన అనేక సంఘటనలు కలవు. వాటిని ఏమనాలి? అక్కడ వారిని ఎవరూ లేపలేదే, వారంతకు వారు లేచివచ్చారు కదా! వారిది పునరుత్థానము కాదంటామా? బహుశ మీవద్ద జవాబు ఉండదనుకొంటాను.

ఒక సామాన్య మనిషి ఉదయము చనిపోయి సాయంత్రము లేచిన సంఘటనలు గలవు. ఏసు ముప్పైమూడు గంటల తర్వాత మరణమునుండి లేవగా, మరియొకడు పన్నెండు గంటలకే మరణమునుండి సజీవుడుగా లేచికూర్చున్నాడు. అటువంటప్పుడు ఏసుకంటే ముందుగానే లేచినవానిని ఏసుకంటే గొప్పవాడని అనాలా? అలా పునరుత్థానమును పొందిన సాధారణ మనుషులలోనికి ఏసును కలుపడము భావ్యమా? అని అడుగు చున్నాను. భూమిమీద సకల జీవరాసులకు మరణములు మొత్తము నాలుగు రకములు గలవు. అందులో వరుసగా 1) కాల మరణము, 2) అకాల మరణము, 3) తాత్కాలిక మరణము, 4) ఆఖరీ మరణము అనునవి కలవు. సాధారణముగా అందరికీ మరణము అనునది మాత్రము తెలుసుగానీ, మరణములో ఇన్ని మరణములున్నవనిగానీ, ఎవరు ఏ మరణమును పొందుచున్నారనిగానీ, నేటి మనుషులకు తెలియకుండా పోయినది.

(మనిషికున్న నాలుగు మరణములను గురించి సంపూర్ణముగా తెలియాలంటే మా రచనలలోని **"మరణ రహస్యము"** అను గ్రంథమును చదవండి.) ఒక మనిషి చనిపోతే వానికి మరణమొచ్చినదని తలచి అంత్య క్రియలు చేయడము మాత్రము తెలిసిన మనుషులకు, నాలుగు రకముల మరణములున్నవని తెలియకపోయిన దానివలన, ఏసుప్రభువు విషయములో కూడా చాలా పొరపడినారని తెలియుచున్నది. నాలుగు మరణములలో ఆఖరీ మరణము అనునది చాలా అరుదుగా జరిగేది. మనిషి దేవుని జ్ఞానమును పూర్తిగా తెలిసి, ఆచరించి కర్మను కాల్చుకొన్నప్పుడు, కర్మ ఏమాత్రము శేషము లేకుండా అయిపోయినప్పుడు, అతడు తిరిగి జన్మించ వలసిన పనిలేదు. అతడు పునర్జన్మమును పొందక దేవునియందు ఐక్యమై పోవును. అటువంటివాడు తిరిగి పుట్టడు, మరణించడు. కావున

కర్మరాహిత్యమైనవాడు, మోక్షమును పొందువాడు మరణించినప్పుడు, అది ఆఖరీ మరణమగును. ఏసు పొందినది ఆఖరీ మరణము కాదనీ, ఆఖరీ మరణము పొందినవాడు తిరిగి సజీవముగా లేవడనీ చెప్పవచ్చును.

మూడవ మరణమైన తాత్కాలిక మరణమును అరుదుగా మనుషులు పొందుచుందురు. ఒక మనిషి చనిపోతే మరణములో జీవుడు వానితోపాటు యున్న ఆత్మ, కర్మలు శరీరమునుండి బయటికి పోకుండా శరీరములోనే ఉండిపోవడమును తాత్కాలిక మరణము అంటాము. తాత్కాలిక మరణములో శ్వాస శరీరములోపలికి పోయి నిలిచిపోవడము వలన, అతడు పూర్తిగా చనిపోయినట్లు బయటికి కనిపించినా, అది సాధారణ మరణము మాత్రము కాదు. చనిపోయినప్పుడు శరీరమునుండి జీవుడు పోయినాడా లేదాయని ఎవరూ చూడరు. శరీరములో శ్వాస ఆడుచున్నదా లేదా అని మాత్రమే గమనించి, శ్వాస ఆడనందున చనిపోయినాడని శ్వాసనుబట్టి నిర్ణయింతురు. మరణ రహస్యములు తెలియకపోవడమువలన, శ్వాస నిలిచిపోయిన దానినంతటినీ మరణమే అనుకోవడము మనుషుల పనియైనందున, ఏసు మరణించినప్పుడు కూడా అతడు చనిపోయాడని అను కోవడము జరిగినది. అయితే ఆయన తాత్కాలిక మరణమును పొందాడని తెలియలేకపోయారు. ఏసుప్రభువు తర్వాత తాత్కాలిక మరణమును పొందిన మనుషులు ఎందరో ఉన్నారు. ఈ సంవత్సరము అక్కడక్కడ చనిపోయినవారు నలుగురు తిరిగి బ్రతికినట్లు వార్తల ద్వారా తెలిసినది. తమిళనాడులో *(11-07-2012 ఈనాడు బుధవారం న్యూస్‌పేపరు)* చితిమీద పెట్టిన వ్యక్తి తిరిగి బ్రతికి లేచినట్లు అందరికీ తెలుసు. పునరుత్థానము ఏసు పొందాడు. అలాగే సాధారణ మనుషులు కూడా పునరుత్థానమును పొందారు. పునరుత్థానము ప్రత్యేకమైన మహిమగా చెప్పుకొనుచూ, అలా మరణము నుండి అదే

శరీరముతో తిరిగి లేచినందుకు ఏసును దేవునిగా చెప్పితే, అలాగే లేచిన వారిని కూడా ఏసుతో సమానముగా చెప్పాలి. వారిది కూడా మహత్యముగానో, వారిని కూడా దేవుళ్ళుగానో చెప్పాలి.

ఒక్కమారు తప్పటడుగు వేస్తే దానివలన ఎన్నో అనర్థములుండును. ఈ కాలములోగానీ, ఆ కాలములోగానీ తాత్కాలిక మరణమును పొంది లేచిన మనుషులు ఎందరో ఉన్నారు. అంతమాత్రమున ఏసును వారితో కలుపగలమా? ఏసుదీ సాధారణ మనుషులదీ ఒకే రకమైన మరణము అయినప్పుడు, ఒకే రకముగా లేచినప్పుడు, అందరినీ ఒకే రకముగా చెప్ప వలసి వస్తుంది. అందువలన ఏసు తిరిగి లేచిన దానిని గొప్పగ చెప్పవలసిన అవసరము లేదు. ఆయన పునరుత్థానము పొందితేనే దేవుడయ్యాడా? చనిపోయి తిరిగి లేచిన దానివలన ఆయనను దేవుడనడము పూర్తి తప్పు. ఏసు ముందునుండి దేవుడేగానీ, పునరుత్థానము పొందినందున దేవుడ నడము గ్రుడ్డిగా మాట్లాడడమవుతుందని తెలియవలెను.

ద్వితీయ దైవ గ్రంథమైన బైబిలు ప్రకారము ఏసును దేవుడని ఎవరైనా చెప్పవచ్చును. విశాల జ్ఞానముంటే ప్రథమ దైవ గ్రంథమును అనుసరించి కృష్ణున్ని అసలైన దేవునిగా గుర్తించవచ్చును. భగవద్గీతను సంపూర్ణముగా తెలిసినవాడు బైబిలు జ్ఞానమును సులభముగా అర్థము చేసుకోగలడు. రెండు గ్రంథముల సారాంశము తెలిసినవాడు, ఎవడు కృష్ణునిగా భూమిమీద కనిపించాడో అతనే మారువేషముతో ఏసుగా వచ్చాడని తెలియగలడు. అప్పుడు దైవ గ్రంథముల ప్రకారము కృష్ణున్ని దేవుడే అనవచ్చును. కృష్ణుడే ఏసుగా వచ్చాడు గనుక ఏసును కూడా దేవుడని చెప్పవచ్చును. దేవున్ని ఎప్పుడైనా ఎక్కడైనా దైవ గ్రంథములలోని ధర్మముల ప్రకారము కనుగొనవచ్చును అను సూత్రము ప్రకారము, దైవ గ్రంథములను

అనుసరించే దేవున్ని తెలియుటకు, గుర్తించుటకు సాధ్యమగునుగానీ, మరి ఏ ఇతర గ్రంథముల వలనా దేవున్ని తెలియుటకు సాధ్యపడదు. నేను ఇందువును (హిందువును) అయినా నాకు భగవద్గీత ఎలా తెలుసో, బైబిలు లోని ఏసు చరిత్ర అలా తెలుసు. నా దృష్ఠిలో నేడు క్రైస్తవులు చెప్పుకొనునది బైబిలు కాదు. అందులోని అరవై ఆరు పాఠములలో కేవలము నాలుగు పాఠములు మాత్రమే బైబిలుగా లెక్కించుచున్నాము. దేవుడు చెప్పినదే ధర్మశాస్త్రము. మనుషులు చెప్పినది ఎప్పటికీ ధర్మశాస్త్రము కాదు. దాని ప్రకారము భగవంతుడైన కృష్ణుడు చెప్పినది భగవద్గీతయైనట్లు, ఏసు చెప్పినది మాత్రమే బైబిలు. అలాగే భగవంతుడు చెప్పకున్నా సృష్ట్యాదిలో చెప్పబడిన జ్ఞానమునే జిబ్రయేల్ చెప్పడము వలన, అది అంతయూ ఖుర్ఆన్ గ్రంథముగా తయారైనది. ఒకే దేవునికి సంబంధించిన విషయములన్నియూ ఈ మూడు గ్రంథములలో తప్ప ప్రపంచములో ఏ గ్రంథములోనూ లేవు. వాస్తవము ఇలా ఉండగా వేదముల వలన దేవుడు తెలియబడుతాడని చెప్పడము ఎంత అసత్యమో ఆలోచించండి. దేవుని ధర్మములు దేవునికే తెలుసు మరి ఏ మానవులకూ తెలియవు అని ఖుర్ఆన్ గ్రంథములో మూడవ సూరా, ఏడవ ఆయత్‌నందు చెప్పబడినట్లు, దేవుని విషయములు (ధర్మములను) దేవుడే చెప్పాలిగానీ, మనుషులు చెప్పలేరు. అందువలన దేవుని జ్ఞానమును, ధర్మమును, దేవుడిచ్చిన దైవ గ్రంథములే చెప్పాలిగానీ, మనుషులు వ్రాసిన వేదములు చెప్పలేవు. మనుషులు ఇతరులను మభ్యపెట్టి ఇది దేవుని విషయమని నమ్మించవచ్చును. అయినా వారు ఎంతో తెలివిగా నమ్మించినా, మనుషులు చెప్పినది ఎప్పటికీ దేవుని ధర్మములుగా ఉండవు. అందువలన వేదములను నమ్మవలసిన పనిలేదు. **"దేశము-మోసము, దేహము-మోహము"** అని మేము చెప్పిన నానుడి ప్రకారము మనిషి

ఇతరులను మోసము చేయవలెనని ప్రయత్నము చేయుచునే ఉండును. మోసపోయే వారుంటే ఎంతకైనా మోసము చేయును. మేము వేదములు దేవుని విషయమును తెలుపలేవు అని చెప్పితే, 'హైందవ క్రైస్తవము' అను గ్రంథమునందు ఆ గ్రంథకర్త,72వ పేజీలో ఎలా చెప్పుచున్నాడో చూడండి.

"నిజానికి వేదాలలో తెలుపబడిన దేవుణ్ణి తప్ప మనము ఎవరినీ ఆరాధించకూడదని వేదాలే ఖండితముగా శాసిస్తున్నాయి." "మిత్రులారా! ఇంద్రుణ్ణి తప్ప అన్యుణ్ణి కీర్తించకండి. అని సామవేదము ఆజ్ఞాపించు చున్నది."

"ఇంద్రుడంటే? మరణించి తిరిగిలేచి తన మహిమను నిరూపించిన వాడే ఇంద్రుడు. ఆయనే భూమధ్యప్రదేశములో అవతరించిన రారాజు ఏసు. ఏసును ఆరాధించడము వాస్తవానికి విదేశీ మతముకాదు. వేద ఋషుల మనస్సులో ప్రత్యక్షమైన దేవుడే ఏసు దేవుడు."

పుల్లకు చెక్కిన ఐస్‌ముక్క తియ్యగా, చల్లగా ఉంది అంటే ఎవరైనా ఒప్పుకుంటారు. అది వాస్తవమే గనుక ఎవరైనా ఒప్పుకోవచ్చును. ఐస్ ముక్కను ఒప్పుకొంటున్నారని ఐస్‌ముక్కను బురదలో అద్దిస్తే అది తియ్యగా ఉండదు, చల్లగా ఉండదు. నోటిలోనికి బురదతప్ప ఐస్‌రాదు, దాని రుచి తెలియదు. అలాగే దైవ గ్రంథములలో చెప్పిన దైవమును ఎవరైనా ఒప్పు కుంటారు. ఎందుకనగా అక్కడ చెప్పినది వాస్తవము. అక్కడ ఏసును దేవునిగా ఒప్పుకొన్నామని, వేదములలో ముంచి లేక కలిపి ఇతనే దేవుడని

ఏసును చెప్పినా, అతడు వేదముల వలన చెప్పబడుట చేత, వేదముల వాసన ఉండుట చేత, ఎవరూ అలా ఒప్పుకోరు. వేదములు చెప్పిన దేవుడు స్వచ్ఛమైన దేవుడు కాడు. కలుషితమైన దేవుడని చెప్పవచ్చును. దైవ గ్రంథములను తెలిసినవారు, మనుష గ్రంథములైన వేదముల మాటలను లెక్కించరు. వేదములలో దేవతలందరూ ఉన్నారు. అందువలన ఆ దేవతలవలె అందరిలో ఈయన ఒక దేవుడై పోవునుగానీ, అందరికీ అధిపతియైన దేవునివలె లెక్కించబడడు. పై వాక్యములో అదే ప్రమాదము ఏర్పడినది. సృష్ఠికర్త, సృష్ఠికి అధిపతియైన దేవున్ని పురాణాల దేవతలలోని ఇంద్రునిగా లెక్కించడము జరిగినది. పోలీస్ డిపార్టుమెంటులో అందరూ ఖాకీ కలర్ గుడ్డలే ధరిస్తారు. పోలీస్ డిపార్టుమెంటు కంతటికీ ఒకే కలర్ డ్రస్ ఉంటుంది. అయితే డ్రస్ ఒకటే అయినా అడ్రస్ మాత్రము వేరువేరుగా ఉంటుంది. పోలీస్ (కానిస్టేబుల్) మొదలుకొని సబ్ఇన్స్పెక్టర్ వరకు గ్రామములలో గల పోలీస్స్టేషన్లో ఉంటారు. కొన్ని గ్రామముల పరిధినంత కలిపి ఒక సర్కిల్గా ఏర్పరచి దానికంతటికీ అధిపతిగా, సర్కిల్ ఇన్స్పెక్టర్ ఉంటాడు. అటువంటి కొన్ని ఏరియాలకు పెద్దగా ఒక పట్టణములో డి.యస్.పి ఉంటాడు. తర్వాత అధికారి అడ్రస్ జిల్లాలోనే ఉండును. జిల్లా పోలీస్ అధికారియైన యస్.పిగారు జిల్లా కేంద్రమైన పట్టణములో ఉండును. తర్వాత అందరికీ అధికారియైన డి.జి.పి గారు రాష్ట్ర రాజధానిలో ఉంటాడు. ఈ విధముగా పోలీస్ డిపార్టుమెంటులో అందరి డ్రస్ ఒకటే అయినా, వారి హోదాలనుబట్టి అడ్రస్లు వేరువేరుగా ఉండును. పోలీస్ వారిలో హోదాలను తెలుపు గుర్తులు వారి భుజాలమీద ఉంటాయి. డిపార్టుమెంటు విషయము పూర్తిగా తెలిసినవాడు వారి భుజాల మీద గుర్తులనుబట్టి, ఇతను ఇంత హోదాగల అధికారియని గుర్తించగలడు.

పోలీస్ డిపార్టుమెంటు విషయము ఏమాత్రము తెలియని పల్లెటూరి వ్యక్తి డి.యస్.పి ని చూచినా డి.జి.పి ని చూచినా ఒక్కటిగానే లెక్కించును గానీ వారి హోదాలోని తేడాను గ్రహించలేడు.

అలాగే ధర్మశాస్త్రము యొక్క విషయము ఏమాత్రము తెలియని వ్యక్తికి దేవతలలోని హోదాలు తెలియక, అందరికీ అధిపతియైన దేవున్ని కొంత అధికారమున్న వానివలె పోల్చుకొనును. ఏ విధముగా డి.యస్.పి కీ, డి.జి.పి కీ తేడా తెలియనివాడు ఇద్దరిని ఒకే విధముగా పోల్చుకొనునో, అలాగే ఇంద్రున్నీ, ఇంద్రునికి కూడా అధిపతియైన దేవున్నీ సమానముగా లెక్కించుకొనును. అందువలన పై వాక్యములో లోకమునకు అధిపతియైన దేవున్ని, ఒక లోకమునకు కూడా అధిపతి కాని ఇంద్రునిగా చెప్పుకోవడము జరిగినది. ఒక పల్లెటూరివాడు పోలీస్ డిపార్టుమెంటు విషయము, వివరము తెలియక డి.యస్.పి నీ, డి.జి.పి నీ వారు ధరించిన డ్రస్సును బట్టి ఒకే విధముగా తలచుకొన్నట్లు, వేదములలో మునిగిన వాడు ధర్మశాస్త్రము యొక్క విషయము, వివరము తెలియక ఇంద్రున్ని, ఇంద్రాధిపతిని ఇద్దరినీ ఒకే రకమైన దేవతలుగా పోల్చుకొన్నాడు. అదే విధముగా ఇక్కడ కూడా దేవతల యొక్క, దేవుని యొక్క బేధము తెలియక అందరికీ అధిపతియైన దేవున్ని కొందరికే అధిపతియైన ఇంద్రునిగా పోల్చి చెప్పడము జరిగినది.

క్రైస్తవ మతము మీద తమకున్న ప్రేమ, అభిలాషను బట్టి వేదములను అడ్డము పెట్టుకొని, దేవుని హోదాను గుర్తించక, కలెక్టర్‌కంటే బిల్‌కలెక్టర్ పెద్ద కదా!యన్నట్లున్నది. ఎవడైనా తెలిసినవాడు బిల్ కలెక్టర్ కంటే కలెక్టర్ పెద్దయని చెప్పితే, అదెలా అవుతుంది. అతను ఉత్త కలెక్టరే కదా! ఇతని ముందర బిల్ ఎక్కువగా ఉన్నది కదా!యని వాదించాడట. ప్రత్యక్షముగా బిల్ కనిపించే ఆరు అక్షరముల బిల్ కలెక్టర్ పెద్దకాదు, నాలుగక్షరము

కలెక్టర్ పెద్ద అంటే నేనేమి లెక్క తెలియనివాడినా, ఆరు పెద్దనా, నాలుగు పెద్దనా అని ఎదురు ప్రశ్న వేశాడట. ఈ విధముగా వేదములను లెక్కలు తెలిసినవాడు ధర్మమను హోదాను గుర్తించలేక, దేవుని కంటే ఇంద్రున్ని పెద్దయని అనుకోవడములో ఆశ్చర్యములేదు. ఒక ప్రక్క ఏసును రారాజే అంటూ, మరొక ప్రక్క ఏసును రాజుక్రింద బంట్రోతుగా చెప్పడము జరుగుచున్నా, వారికి మాత్రము మతము ముఖ్యముగా కనిపించు చున్నదిగానీ, దేవుడు ముఖ్యముగా కనిపించలేదు. ఏసును ఆరాధించడము విదేశీ మతము కాదు అని చెప్పడముబట్టి చూస్తే, దేవునికి కూడా మతమును చుట్టి, ఆయనదొక మతమన్నట్లు చెప్పుచున్నారుగానీ, దేవుడు మతాతీతుడు అని చెప్పడము లేదు. ఏసు విషయము బైబిలులో గలదు, వేదములలో దేవతల విషయముగలదు. బైబిలులో ఏసును గురించి ఇలా ఉన్నది అని చెప్పితే హిందువులు తమమాట వినరనీ, ఇది పరమత గ్రంథమని దూరముగా పోవుదురనీ తలచినవాడు, హిందువులకు సరిపోని బైబిలు పేరుచెప్పక, హిందువులు పెద్దగా భావించుకొన్న వేదముల పేర్లు చెప్పితే బాగుంటుందని వారిని ఆకర్షించు ఉద్దేశ్యముతో, ఏసుకు సంబంధము లేని వేదములను చెప్పుచూ, వేదములలో ఏసుప్రభువు విషయమే ఉన్నదని నమ్మించుచున్నాడు.

"హైందవ క్రైస్తవము" అను గ్రంథములో 76వ పేజీనందు పాపము సంక్రమించు దానిమీద రెండు వాక్యములు గలవు. అవి దైవ గ్రంథము లలోని దైవ వాక్కులకు వ్యతిరేఖముగా ఉండుట వలన వాటిని విమర్శించి, అవి తప్పు అని చెప్పవలసి వచ్చినది. పాపము సంభవించు దానిని గురించి ఆ రెండు వాక్యములలో ఏమి వ్రాశారో ఇప్పుడు చూస్తాము.

"వశిష్టుని పూర్వులు ద్రోహము చేశారని వశిష్ట మహర్షి

<u>ఏదో ఆతురతతో అసత్యము పలుకలేదు. పరమాత్మని ప్రేరణతో వశిష్టుడు అన్నాడు. పాపము అనేది వశిష్టునికి పితరులనుండి సంక్రమించినది."</u>

ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత ప్రకారము, మరియు ద్వితీయ దైవ గ్రంథము బైబిలు ప్రకారము, మొత్తము ధర్మ శాస్త్రము ప్రకారము పాపములుగానీ, పుణ్యములుగానీ ఒక వ్యక్తికి వాని పెద్దలైన తల్లితండ్రుల వలనగానీ, చిన్నలైన కొడుకు బిడ్డల వలనగానీ సంక్రమించవు. ఎవరు చేసుకొన్న పాపము వారిని చేరును. శరీరములో అహము వలన ప్రతి మనిషికీ పాపపుణ్యములనబడు కర్మలు ఏర్పడుచున్నవి. ఒక మనిషికి పాపము వచ్చుటకుగానీ, పుణ్యము వచ్చుటకుగానీ తగినట్లు వాని శరీరము లోనే యంత్రాంగము అమర్చబడియున్నది. అట్లే ఎవని కర్మ వాడు అనుభవించుటకు కూడా శరీరములోని అంతరంగ యంత్రాంగము తయారై యున్నది. అందువలన ఎవని పాపము వానిని అంటుకొనునుగానీ, ఇతరులు చేసిన పాపము ఎవరినీ అంటుకొనదు. అలాగే ఎవని పాపమును వాడు అనుభవించవలసిందేగానీ, ఒకరి పాపము మరొకడు అనుభవించు టకు వీలులేదు. శరీర నిర్మాణములోనే దేవుడు అటువంటి అమరిక పెట్టాడు. అట్లే దైవజ్ఞానమున్నవాడు కార్యమును చేసినా, కర్మను అంటకుండ చేసుకొనుటకు తగిన విధానమును కూడా కలుగజేశాడు. అట్లే జ్ఞానము లేనివాడు కార్యమును చేయకున్నా, అనుకొన్నంత మాత్రమున ఆ కార్యమును చేసినట్లయిపోయి, పాపము వచ్చి చేరునట్లు శరీరములో అమరిక కలదు. అందువలన భగవద్గీతలో మోక్ష సన్యాస యోగమున 17వ శ్లోకమందు **"ఎవని భావములో అహంకారము లేదో వాడు లోకములోని వారందరినీ**

**హత్య చేసినా, వాడు హంతకుడు కాదు. హత్యాపాపము వానిని అంటదు"** అని చెప్పాడు. అట్లే బైబిలులో మత్తయి సువార్త 5వ అధ్యాయము 28వ వాక్యమున **"ఒక స్త్రీని మోహపు చూపుతో చూచు ప్రతివాడు అప్పుడే తన హృదయమందు ఆమెతో వ్యభిచారము చేసినవాడగును"** అని ఉన్నది. అందువలన మనిషి భావమునుబట్టి పని చేసినా, చేయకున్నా పాపము రావడము, రాకుండా పోవడము జరుగుచున్నది. పాపము రావడముగానీ, రాకుండా పోవడముగానీ వారివారి భావమునుబట్టి యుండును. అంతేగానీ ఇతరులు చేసినది తనకూ, తాను చేసినది ఇతరులకూ పోదు, రాదు అని తెలియవలెను.

**ఇప్పుడు అదే పేజీలోని మరొక వాక్యమును చూస్తాము. "మానవ జాతికి మూల పురుషుడైన ఆదాము ద్వారా మన తల్లితండ్రుల ద్వారా మనకు పాపము సంక్రమించినదని బైబిలు తెలియజేస్తున్నది" (యోబు 14-4, రోమా 5-12).**

బైబిలు గ్రంథములో యోబు మరియు రోమా అను రెండు సువార్తలలో ఆదాము ద్వారా, మన తల్లితండ్రుల ద్వారా మనకు పాపము వచ్చినదని చెప్పారు. బైబిలును గురించి ఇంతకుముందే ఒక విషయమును చెప్పాము. బైబిలులోగల అరవై ఆరు పాఠములు బైబిలుగా ఉండినా అందులో మానవునికి పనికివచ్చు బైబిలు ఏసు చెప్పిన నాలుగు సువార్తలు మాత్రమేనని చెప్పాము. మనిషిని దైవమార్గములో నడిపించునవి ఏసు చెప్పిన జ్ఞానమున్న నాలుగు సువార్తలు మాత్రమేనని తెలియాలి. మిగతా అరవై రెండు సువార్తలలో సత్యమే ఉందని నమ్మవలసిన పనిలేదు. మత్తయి, మార్కు, లూకా, యోహాన్ అను నాలుగు సువార్తలు తప్ప మిగతావన్నీ

మనుషులు చెప్పినవే అయినందున వాటిని జ్ఞానము పరిధిలోనికి తీసుకోకూడదు. బైబిలుకంతటికీ మూల పురుషుడు ఏసుయే అయినప్పుడు ఆయన చెప్పినవే జ్ఞానము, ధర్మమగును. మనుషులు వ్రాసినవి జ్ఞానము, ధర్మము అగుటకు అవకాశములేదు. అందువలన పై సువార్తలలోని తల్లి తండ్రుల వలన పాపము వస్తుంది అని చెప్పినమాటను ఖండించవచ్చును. ఆ మాట సత్యము కాదు. ఏసుప్రభువు చెప్పిన నాలుగు సువార్తలలో తల్లి తండ్రుల వలన పాపము వస్తుందని ఎక్కడా లేదు. పైగా ఎవడు చేసుకొన్నది వానికే వస్తుందని, చేయకున్నా భావము వలననే పాపము రాగలదని కూడా చెప్పాడు. పై వాక్యములో మానవ జాతికి మూల పురుషుడు ఆదాము అనియూ, ఆదాము హవ్వల వలననే సమస్త మానవజాతి పుట్టిందని పాత నిబంధన ఆదికాండములో చెప్పడము జరిగినది. అయితే ఏసుప్రభువు అట్లు ఎక్కడా చెప్పలేదు. మానవులందరినీ సృష్టికర్త అయిన దేవుడే సృష్టించాడని చెప్పాడు. అంతేకాక అందరినీ సృష్టించిన దేవుడే సమస్త మానవులకు తండ్రియనీ, ఆయన పరలోకమందున్నాడనీ చెప్పడము జరిగినది. అందువలన పై వాక్యమును నమ్మవలసిన పనిలేదు.

ఇప్పుడు 77వ పేజీలో పాపపరిహారము కొరకు రక్తప్రోక్షణము జరగాలని చెప్పిన సమాచారమును పరిశీలిద్దాము. **"ఈ మాటలు నేను కల్పించి వ్రాసినవి కావు. ఇంకే ఇతర మానవుడు కల్పించినవి కావు. సాక్షాత్తు బ్రహ్మముఖము నుండి, అంటే సృష్టికర్త నోట్లో నుండి వచ్చిన మాటలు. ఆ మాటలను పట్టించుకోకుండా వదలి వేయడము భక్తి కాదు, భక్తిహీనత అవుతుంది, దైవద్రోహం అవుతుంది.**

<u>ఇక్కడ ప్రస్తావించబడిన సమస్య ఏమిటి? ఇంద్రునికి ఒక సమస్య వచ్చింది, ఏమిటి సమస్య? అతడు పాప పాశం చేత బంధించబడ్డాడట. నేను పాపపాశ బంధములచేత బంధింప బడినవాడను. నేను పాపపాశ బంధమునుండి విముక్తుడను కావాలి. అదే ఇంద్రుని కోరిక.</u>

<u>అప్పుడు ఇంద్రుడు ఏమి చేశాడు? ఏ మార్గమును అవ లంభించాడు? ఇంద్రుడు ఒక వృషభమును బలిగా ఇచ్చాడు. అలా ఎద్దును బలి ఇవ్వడము వలన తాను పాపపాశ బంధముల నుండి విముక్తుడను అవుతానని ఇంద్రుడు భావించాడు. అంటే ఈ మాటకు అర్థము ఏమిటి? పాపపరిహారము కోసము 'బలి' తప్పనిసరిగా జరగాలి అన్నమాట తర్వాత వచ్చిన గ్రంథాలు, గురువులు పాపక్షమాపణ కొరకు ఎన్ని మార్గాలైనా ప్రతిపాదించ నివ్వండి. దేవుని నోట్లోంచి ఊడిపడిన వేదము మాత్రము పాపక్షమాపణ కోసము బలి, రక్త ప్రోక్షణ అవసరము అనే చెబుతున్నది."</u>

పూర్వము ఒక మనిషికి తిక్కముదిరి రుమాలును (టవలును) తలకు చుట్టమనుట విడచి రోకలిని తెచ్చి తలకు చుట్టమన్నాడట! నీవే చుట్టుకోమని ప్రక్కవారు చెప్పితే, నా చేతులకు రోకలిని చుట్టుకునే బలము లేదు. అందువలన మిమ్ములను చుట్టమని చెప్పాను అన్నాడట. తిక్క ముదిరి

పోయిన మెదడు దేనినీ సక్రమముగా యోచించక అన్నీ తప్పుగానే నిర్ణయించును. అలాగే ఆధ్యాత్మిక విద్యలో మతిభ్రమించిన వారిగా కొందరు మాట్లాడుచుందురు. అటువంటివారికి ఒక పద్ధతి అంటూ ఉండదు. ఒక శాస్త్రమును ఆధారము చేసుకొని మాట్లాడడమూ ఉండదు. ఎట్లు ఊహవస్తే అట్లు మాట్లాడుచుందురు. మనము మాట్లాడేమాట సమంజసమైనదా కాదా అని ఏమాత్రము యోచించరు. అదే విధముగా పై వాక్యము కనిపించుచున్నది. దేవున్ని గురించి ధర్మశాస్త్రమును (బ్రహ్మ విద్యా శాస్త్రమును) ఆధారము చేసుకొని మాట్లాడవలసియున్నది. అట్లు శాస్త్రాధారము లేకుండా మాట్లాడితే దేవుని విలువను తగ్గించినట్లగును. పై వాక్యములో ఏమాత్రము శాస్త్రాధారము లేదు. అంతేకాక బుద్ధి ముదరని చిన్న పిల్లలకు కాకమ్మ, గువ్వమ్మ కథలను చెప్పినట్లు పై వాక్యమున్నది. వినేది సత్యమా అసత్యమా అని ఆలోచించలేని చిన్నపిల్లలు చెప్పిన దానిని వినగలరు. అలాగే కొందరికి ఏమి చెప్పినా అసత్యమును కూడా సత్యముగానే భావించుకొని వినుచుందురు. అదే పెద్దపిల్లలయితే తిరిగి ప్రశ్నించగలరు. చెప్పిన విషయములో తప్పులుంటే వివరణ కోరుదురు. అలాగే పై వాక్యమును గ్రుడ్డిగా వినకుండా తిరుగు ప్రశ్న వేస్తూ వివరమడుగుచున్నాము.

దేవుడు ధర్మముల మీద ఆధారపడియున్నాడు. దేవున్ని తెలియుటకు ధర్మముల ఆధారముతో తెలుసుకోవచ్చును. దేవునికున్న ప్రాథమిక ధర్మము ఒకటి గలదు. దేవుడు రూప, నామ, క్రియారహితుడు అనునది మొదటి ధర్మము. ఈ వాక్యము మూడు దైవ గ్రంథములలోనూ గోచరించుచున్నది. ఈ వాక్యమునుబట్టి దేవునికి ఆకారము లేదనీ, పేరు లేదనీ పనియూ లేదనీ తెలియుచున్నది. ఈ ప్రాథమిక ధర్మమును కాదని దేవునికి

రూపమున్నది అంటే అది పూర్తి అసత్యమని, అట్లున్నవాడు దేవుడు కాడని చెప్పవచ్చును. అలాగే దేవునికి పేరున్నదనిగానీ, ఆయనకంటూ పని ఉన్నదనిగానీ ఎవరైనా అన్నారంటే ఆ మాట దేవుని ధర్మమునకే విరుద్ధమనీ, అది పూర్తి అసత్యమైన మాటయనీ చెప్పవచ్చును. అయితే దేవునికి పనిలేదు ఆయన పని చేయడు అనుమాటకు విరుద్ధముగా పై వాక్యమున్నట్లు తెలియుచున్నది. సాక్షాత్తు సృష్ఠికర్త నోటినుండి వచ్చినమాటలను పట్టించుకోకుండా వదిలివేస్తే అది దైవ ద్రోహము అవుతుందని చెప్పారు. ఇప్పుడు మేము ఏమి చెప్పుచున్నామంటే, అబద్ధమును చెప్పి భయపెట్టి మీరు చెప్పినట్లు వినవలెనని ప్రయత్నించుచున్నారు. దేవుని విషయములో అసత్యమును, అధర్మమును బోధించడము వలన మీరే దైవద్రోహము చేసినట్లగుచున్నది.

దేవుడు క్రియారహితుడు అని అంటే దేవుడు పనిని చేయనివాడని అర్థము చేసుకోవలెను. పై వాక్యములో సృష్ఠికర్తయిన దేవుడు స్వయముగా చెప్పినట్లు వ్రాయడము వలన దేవునికి పనిని కల్పించి చెప్పినట్లయినది. అలా చెప్పిన మాటను వినకపోవడము భక్తిహీనత, దైవద్రోహము అవుతుందని చెప్పారు కదా! అయితే మేము ఇప్పుడు ధర్మవిరుద్ధమని ఆ మాటలను పూర్తిగా ఖండించుచున్నాము. అంతేకాక ఇంద్రుడనే వాడు ఉన్నాడో లేడో కూడా ఎవరికీ తెలియదు. ఉన్నట్లు కూడా చరిత్ర ఆధారముగానీ, శాస్త్రాధారముగానీ లేదు. అలాంటప్పుడు ఇంద్రున్ని తెచ్చి చెప్పవలసిన అవసరమేమున్నది? అంతేకాక ఇంద్రుడే ఏసు అని చెప్పడము పూర్తి విడ్డూరము. అంతటితో ఆగక ఆయనకున్న పాపమునకు పరిహారముగా ఎద్దును బలి ఇచ్చాడనీ, పాప క్షమాపణ కొరకు రక్తప్రోక్షణ (రక్తము కార్చుట) చేయడము వలన పాపము పరిహారమగునని దేవుడు చెప్పినట్లు చెప్పాడు. దానికి మేము ఏమనుచున్నామంటే దేవుడు ప్రత్యక్షముగా ఎవరితోనూ

మాట్లాడదు అను ధర్మమునకు విరుద్ధముగా ఈ మాటను చెప్పినట్లగుచున్నది. రక్తప్రోక్షణకు పాపపరిహారమునకు ఏమి సంబంధమున్నదని అడుగు చున్నాము. రక్తప్రోక్షణమని చెప్పి ఎద్దును బలి ఇచ్చినట్లు చెప్పారు. కోళ్ళు, గొర్రెలు మొదలుకొని ఆవులనూ, గుర్రములనూ, దున్నలనూ క్షుద్ర దేవతా పూజలలో బలి ఇవ్వడము నేటికినీ కలదు. ఇలా బలులు ఇవ్వడము భక్తి అంటామా లేక జ్ఞానమంటామా? ధనికులుగాయున్నవారు ఎంతో పాపము చేసి, ఎన్నో బలులు ఇవ్వగలరు. అయితే వారి పాపము పోతుందా? పూర్వము మనుషులు తమ పాపమును పరిహారము చేసుకొనుటకు ఏకంగా మనిషి అయిన ఏసునే రక్తము కారునట్లు చేసి శిలువ మీద బలి ఇచ్చారని కొందరు చెప్పుకురావడము కూడా విన్నాము. అదే నిజమైతే ఆ విధముగా పాపము పోయేటట్లు ఉంటే వరుసగా పదిమంది మనుషులనైనా బలిఇచ్చు ధనికులు, బలాఢ్యులు ఉన్నారు. ఇంకొకరిని హింసించి రక్తము కారునట్లు చేయడము వలనగానీ, ఇతర జంతువులను చంపి రక్త తర్పణము చేయడము వలనగానీ, మనుషులు చేసుకొన్న పాపములు పోతాయని ఏ ధర్మశాస్త్రములో అయినా చెప్పారా?

మనిషి మనుగడ ఎలా ఉన్నది? ఆ మనుగడలో పాపపుణ్యములను మనిషి ఎలా సంపాదించుకొంటున్నాడు? సంపాదించుకొన్న పాపపుణ్యము లను ఎలా అనుభవించుచున్నాడు? చివరికి మోక్షమెలా పొందును? అను మొత్తము మానవుని విషయమును విసర్గముతో సహా విడదీసి చెప్పినవి మూడు దైవ గ్రంథములు, మూడు దైవ గ్రంథములలోనే ధర్మశాస్త్రము ఇమిడి యున్నది. దేవుని ధర్మమును, మనిషి కర్మమును ధర్మశాస్త్రములోనే తెలియవచ్చును. ధర్మశాస్త్రము తప్ప వేదములు, పురాణములు ధర్మములను కర్మములను తెలుపలేవు. అలాంటపుడు ఏ దైవ గ్రంథములో లేని బలిని,

వేదములు చెప్పాయని వాటిని కొందరు చేసేవారనీ, వాటివలన రక్తప్రోక్షణము జరిగి పాపము పరిహారమైనదని చెప్పడము విడ్డూరమైన మాటగా యున్నది. ఈ పద్ధతి హింసను ప్రేరేపించడము తప్ప ఏమైనా ఉన్నదా మీరే ఆలోచించండి. నాకు ఎంతో ఆర్థిక స్థోమతయున్నదని నేను ఇష్టమొచ్చినట్లు పాపములు చేస్తూ, అవి పోయేదానికి వంద జంతువులనో, ఒక మనిషినో బలి ఇచ్చి పాపములను తప్పించుకోగలను అనుకోవడము పూర్తి తెలివితక్కువ విధానమగును.

నేడు భూమిమీద మూడు దైవగ్రంథములను ఆధారము చేసుకొని మూడు మతములవారు చలామణి అగుచున్నారు కదా! ఆ మూడు మతములలో ఒక్క క్రైస్తవులు తప్ప మిగతా హిందువులుగానీ, ముస్లీమ్‌లు గానీ వారి గ్రంథములలో ఈ బలి విధానమున్నట్లు ఎవరూ చెప్పలేదు. భగవద్గీతలోగానీ, ఖుర్‌ఆన్ గ్రంథములోగానీ, బలి చేయడము వలన, రక్త తర్పణము చేయడము వలన పాపములు పోతాయని చెప్పలేదు. ఇకపోతే రక్తప్రోక్షణ అనే పదమును వాడుచూ, రక్తమును చిందించడము వలన పాపపరిహారము జరుగుననీ, ఈ విషయమును వేదములయందు కూడా చెప్పారనీ, తమ బైబిలు గ్రంథములో కూడా ఏసుప్రభువు తన రక్తము చేత పాపపరిహారమగునని చెప్పాడనీ, అందువలన పాపుల నిమిత్తము తన రక్తమును శిలువ మీద రక్తము కార్చాడనీ, ఏసు రక్తము వలన క్రైస్తవుల పాపములన్నియూ పోయాయనీ, ఇంకా ఎవరైనా వేరే మతము వారు క్రైస్తవ మతములోనికి వచ్చి ఏసును తమ దేవునిగా ఒప్పుకుంటే వారి పాపము కూడా పోవుననీ, క్రైస్తవుల బోధకులు ఎంతో ప్రచారము చేశారు. ఇప్పుడు కూడా అదే మాటను చెప్పుచునే యున్నారు.

బైబిలు గ్రంథములో ఏసు చెప్పిన నాలుగు సువార్తలలో ఎక్కడైనా ఏసు రక్తము వలన క్రైస్తవుల పాపము పోతుందని చెప్పాడా? అని ప్రశ్నించు చున్నాను. నేను అడుగుచున్న ఈ ప్రశ్నను కొందరు తేలికగా తీసుకొని "ఏసు చెప్పిన మాటనే మేము చెప్పుచున్నాము. మత్తయి సువార్త 26వ అధ్యాయములో 28వ వాక్యమునందు " ఇది నా రక్తము, అనగా పాపక్షమాపణ నిమిత్తము అనేకుల కొరకు **చిందింపబడుచున్న నిబంధన రక్తము"** అనియున్నది కదా! ఈ వాక్యము ఏసు చెప్పిన దానికి సాక్ష్యము కాదా?" అని అడుగవచ్చును. దానికి మేము కొంత ఆశ్చర్యపోయి, బైబిలు గ్రంథములోని ఏసుమాటను వారి పాపములు పోవు నిమిత్తము ఏసు రక్తము చిందించబడినదని అర్థము చేసుకొన్నందుకు, మాయ వీరిని ఎంతగా మభ్యపెట్టినదోయని అనుకొన్నాము. ఏసు ఎక్కడగానీ తన రక్తమును కార్చడము వలన, తన రక్తము చేత క్రైస్తవుల పాపములు కడిగివేయబడుతా యని చెప్పలేదని ఇప్పుడు కూడా చెప్పుచున్నాను. మత్తయి సువార్త 26వ అధ్యాయము 28వ వాక్యము చెప్పునపుడు ఒక గిన్నెలో ద్రాక్షరసమును తీసుకొని అక్కడున్న తన శిష్యులకు ఇస్తూ, "ఇది నా రక్తము" అన్నాడు. అయితే తన రక్తముగా పోల్చి చెప్పి ద్రాక్షరసమును ఇచ్చాడని మరువ కూడదు. అప్పుడు కూడా తన మాటను ఎక్కడ అపార్థము చేసుకొంటారో యని ఇది నా రక్తము అని చెప్పిన వెంటనే వివరముగా చెప్పుతాను వినండి అన్నట్లు అనగా! అన్నాడు. ఇది నా రక్తము, అనగా అని తర్వాత పాప క్షమాపణ నిమిత్తము అని చెప్పడము జరిగినది. తన రక్తమనునది దేనికొరకు అను ప్రశ్నకు జవాబుండునట్లు పాపక్షమాపణ నిమిత్తము అన్నాడు. ఆ మాటలో ఏ అనుమానమూ లేదు. ఆయన రక్తము పాపక్షమాపణ నిమిత్తమే నని స్పష్టముగా చెప్పడము జరిగినది. సమస్త క్రైస్తవులు ఇక్కడే పొరపాటు

పడినారని చెప్పుచున్నాను. ఏసు రక్తము క్రైస్తవుల కొరకు అని చెప్పాడా, సమస్త మానవులకు అని చెప్పాడా అని చూస్తే, అక్కడ క్రైస్తవులకని చెప్పలేదు, మానవులందరికీ అని చెప్పాడు. అటువంటప్పుడు క్రైస్తవ మతములోనికి వచ్చి ఏసును తమ దేవునిగా ఒప్పుకొన్నవారికి మాత్రమే పాపక్షమాపణ అని చెప్పడము తప్పుకాదా? ఏసు చెప్పనిమాటను క్రైస్తవులు ఎందుకు చెప్పవలసి వచ్చినది?

ఏసు చెప్పిన మాట వారికి అర్థముకాకనో, లేక అర్థమైనా తమ మతమును పెంచుకొనేదానికో, ఆ విధముగా వారు చెప్పారని తెలియు చున్నది. ఏసు చెప్పిన మాటలలో మనుషులందరి పాపక్షమాపణ కొరకు శిలువ మీద రక్తము కార్చుతాననో, తన రక్తమును చిందిస్తాననో అక్కడ చెప్పాడా? అని ప్రశ్నించితే జరుగుచున్న ఆ కాలములో (వర్తమాన కాలములో) చిందింపబడుచున్నదని చెప్పాడుగానీ జరుగబోవు భవిష్యత్ కాలములో నా రక్తమును చిందిస్తానని చెప్పలేదని గమనించండి. జరుగుచున్న వర్తమాన కాలములో జరిగిపోయిన భూతకాలము మూడు సంవత్సరములనుండి నేటి వరకు నా రక్తమును చిందిస్తూనే ఉన్నానని చెప్పి చివరిలో అందరికీ అర్థమగులాగున ఒకమాట అన్నాడు అది ఏమనగా! అనేకుల కొరకు చిందింపబడుచున్న 'నిబంధన రక్తము' అని అన్నాడు. ఈ వాక్యమున కంతటికీ అసలైన అర్థము నిబంధన రక్తము అని చెప్పడములోనే ఉన్నది.

'నిబంధన' అనగా ఏ బంధనము లేనిదని అర్థము. అన్ని బంధములనుండి విడుదల చేయునది, ఏ బంధము తనను బంధించలేనిదీ అయిన దైవ జ్ఞానమును నిబంధన రక్తమని చెప్పడమైనది. అప్పుడు ద్రాక్ష రసమును ఇచ్చి దానిని రక్తముగా వర్ణించాడు. శరీరములో రక్తము జీవనము

నిచ్చునది. రక్త ప్రసరణ లేకుండాపోతే మనిషి చనిపోవును. శరీరములో జీవనమునిచ్చునది రక్తమైనట్లు, దేవునిలో జీవించునట్లు చేయునది జ్ఞానము. ఏసు శరీరములో రక్తముతో పాటు అణువణువున జ్ఞానమే నిండియున్నది. అందువలన ఆయన మూడు సంవత్సరములనుండి తన జ్ఞానమునే ప్రజలకు పంచుతున్నాడు. అందువలన తన జ్ఞానమునే సమస్త మానవుల పాపక్షమాపణ కొరకు చిందింపబడుచున్న నిబంధన రక్తము అని అన్నాడు. నిబంధన రక్తమును అనగా ఏ బంధనమూ లేని జ్ఞానమును అప్పటికే అందరికీ చెప్పుచున్నాడు. అతని నుండి పొంగివచ్చుచున్న జ్ఞానము ఆ రోజులలో అందరికీ అందినది. అప్పటికీ ఎంతో నిబంధన జ్ఞానమును (నిబంధన రక్తమును) అందరిమీదా చిందించుచునే ఉన్నాడు. అలా చెప్పబడిన జ్ఞానము మనిషికి బంధమైన పాపము నుండి లేక కర్మల నుండి విముక్తున్ని చేయుచున్నది. అనగా పాపము నుండి క్షమాపణ పొందునట్లు చేయుచున్నది. జ్ఞానము తెలిసిన మనిషికి ఉన్న కర్మలు లేకుండా కాలిపోవునని భగవద్గీతలో చెప్పినట్లు, పాపము లేకుండా పోవడమునే పాపక్షమాపణ అంటున్నారు. ఏసు శరీరములోని భౌతిక రక్తమును గురించి, అది కారిపోతే ప్రజలకు పాప క్షమాపణ కలుగుతుందని చెప్పలేదు. ఆయన చెప్పినది జ్ఞానమను సారాంశమును నిబంధన రక్తమని చెప్పాడు. ఆ మాటతో తనకు ఇష్టము లేనివారు తప్పుగా అర్థము చేసుకొని తనవైపు రాకుండా ఉండునట్లు చేశాడు.

హిందూమతములో తమ ధర్మ గ్రంథమేదో తెలియనిస్థితిలో చాలామంది ఉన్నారు. చాలావరకు అగ్రకులములని పేరుగాంచిన బ్రాహ్మణులే భక్తికీ, జ్ఞానమునకూ వారసులుగాయున్నారు. వారు శూద్రులను పైకి రాకుండా చేయుటకు, తమ పెత్తనములో అంటరానివారిగా పెట్టి

కొనుటకు ప్రయత్నము చేయుచూ, శూద్రులకు జ్ఞానము తెలిస్తే బాగుండదనీ, ఎవరూ తమ ఆధీనములో ఉండరను ఉద్దేశ్యముతో ఉండగా, క్రైస్తవులు హిందూ శూద్రులను ప్రలోభపెట్టి తమ మతములోనికి మార్చుకోవడము జరుగుచున్నదని చెప్పుకొన్నాము. అటువంటి స్థితిలో, బ్రాహ్మణులకు అనుకూలమైన వేదములే మన మూల గ్రంథములని బ్రాహ్మణులు చెప్పడము జరిగినది. హిందువులలో పెద్దగా ఆచార వ్యవహారములు పాటిస్తున్న బ్రాహ్మణులే గొప్పగా కనిపించుట వలన వారిమాటనే నమ్మి చాలామంది తమ మూల గ్రంథములు వేదములని చెప్పుకోవడము జరిగినది. హిందువులు వేదములను గౌరవించడమును చూచిన మిగతా మతము వారు అదే వేదములను చెప్పుచూ, అందులోని కొన్ని విషయములు తమ మతమును గురించి చెప్పుచున్నవని చెప్పుచున్నారు. వేదములలో క్రైస్తవ మతమును గురించి, ఏసును గురించి ఉందనీ, వేదముల ప్రకారము ఎవరైనా చివరకు క్రైస్తవ మతమునే చేరాల్సిందేనని క్రైస్తవులు చూపుచుండగా, అదే రాగమునే ముస్లీమ్‌లు కూడా అందుకొన్నారు. తమ మతములో తెలివైన వారినీ, జ్ఞాపకశక్తియున్నవారినీ వేదములను నేర్చుకొనునట్లు చేసి, వేదములను ధారాళముగా చెప్పుచూ, వేదములు ముస్లీమ్ మతమునే సమర్థించుచున్నవనీ, వేదములు తమ ప్రవక్తను గురించి కూడా చెప్పాయని ప్రచారము చేయుచున్నారు.

హిందూమతములో మేమే తెలిసినవారమనీ, మేమే హిందూ మతమునకు పెద్దదిక్కుయని చెప్పుకొను అగ్రకులమైన బ్రాహ్మణులు తమకు వ్యతిరేఖముగాయున్న భగవద్గీతను అణచివేసి, తమకు అనుకూలముగా యున్న వేదములను ప్రోత్సహించి చెప్పడము వలన, మూల గ్రంథమైన భగవద్గీతయొక్క జ్ఞానము హిందువులకు తెలియకపోవడము వలన,

హిందువులకు దైవజ్ఞానము తెలియకుండా పోయినది. దైవజ్ఞానము తెలియని వారిని క్రైస్తవ, ముస్లీమ్ మతములవారు ఏదో ఒక రకముగా తమవైపు లాగుకొనుటకు ప్రయత్నించి కొంతవరకు విజయమును సాధించారు. దానితో హిందూమతము క్షీణదశకు వచ్చినది. అలాంటిస్థితిలో హిందూ మతములోని శూద్రులందరూ ఇతర మతములోనికి పోతే తమక్రింద ఎవరూ లేకుండా పోతారనీ, అలా జరిగితే తమ బ్రతుకుతెరువుకు ముప్పు ఏర్పడుతుందనీ, తమ జీవనోపాధి దెబ్బతినకుండ ఉండుటకు ఉన్నవారిని ఇతర మతములలోనికి పోకుండా చేయాలనీ, శూద్రులను కొందరిని గుంపు చేసి హిందూమత రక్షకులుగా చేసి, వారు చెప్పునట్లు ఇతర మతముల మీద దాడిచేయునట్లు తీర్చిదిద్దుకొన్నారు. ఎవరైనా తమకు వ్యతిరేఖ బోధను చెప్పినా, భగవద్గీతను చెప్పినా వారికి పరమత బోధకులని ముద్రవేసి, తాము ఏర్పాటు చేసియుంచుకొన్న మతరక్షకులతో దాడులు కూడా చేయించి అణచివేయుచుందురు. ఈ విధముగా ఉన్నవారు ఇతర మతములలోనికి పోకుండునట్లు, హిందూ మతములోనే ఎవరూ తమకు ఎదురు మాట్లాడనట్లు హిందూరక్షకులను ఉపయోగించుకొనుచున్నారు. ఈ విధముగా హిందూ మతములో అగ్రకులమువారి పెత్తనము మొదటినుండి చెలామణీ అవుచున్నది. మొదటినుండి హిందూమతములో కులవివక్ష ఉండుట వలన, ఎక్కువ శాతము శూద్రులు అణచివేయబడి దైవ గ్రంథమేదో, దైవ జ్ఞానమేదో తెలియకుండాయుండుట వలన, హిందూ మతమునకు మేమే పెద్ద అని చెప్పుకొను బ్రాహ్మణులు కూడా వేదములనే ఆశ్రయించి ఉండుటవలన, హిందూమతము కలియుగములో పూర్తి అజ్ఞాన దశకు వచ్చినది. అజ్ఞానులుగాయున్న హిందువులను గుర్తించిన ఇతర మతములవారు వారి జ్ఞానమును చెప్పి కొందరినీ, ఉద్యోగముల ఎరచూపి కొందరినీ, వేదములను

బోధించి కొందరినీ, అనేకరకములుగా తమ మతములోనికి హిందువులను చేర్చుకోవడము జరిగినది. ఈ విధముగా, క్షీణదశలోనికి వచ్చిన హిందూమతములో నేడు మేము భగవద్గీతా జ్ఞానమును చెప్పుచూ ప్రజలను జ్ఞానవంతులుగా మార్చుటకు ఎంతో శ్రమించుచున్నాము.

మేము చేయు కృషిలో దేవుని జ్ఞానమునకు విలువ నిచ్చుచున్నాము గానీ, మత సాంప్రదాయములకు విలువనివ్వడము లేదు. నేడు మూడు గ్రంథములలోనూ దైవజ్ఞానమే ఉండుట వలన, మూడు మత గ్రంథములుగా చెప్పబడుచున్న భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ గ్రంథముల జ్ఞానము ఒక్కటే అయినందునా, నేను చదివిన భగవద్గీత యొక్క జ్ఞానమూలములు మిగతా రెండు గ్రంథములలో ఉండుట వలన, నేను మూడు మతములవారికీ సమానమైన దైవజ్ఞానమును అందించుచున్నాను. నాకు మూడు దైవ గ్రంథములు సమానముగా ఉండుట వలన, మూడు మతముల జ్ఞానము సంపూర్ణముగా తెలిసిపోయినది. అలా మూడు దైవ గ్రంథముల జ్ఞానము తెలియుట వలన వాటిలోని కాలుష్యము ఎక్కడున్నా తెలిసిపోవుచున్నది. దైవ గ్రంథములైన, మూడు మత గ్రంథములుగానున్న భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్‌లలో జ్ఞానమునకు ఆ మతస్థులు పొరపాటుపడి మతద్వేషముతో తమ మత గ్రంథమును గొప్పచేసి, మిగతా రెండు గ్రంథములను తక్కువ చేసినప్పుడు, మేము జోక్యము చేసుకొని మూడు గ్రంథములు ఒకే దేవుడిచ్చిన వేననీ, ఆ మూడు గ్రంథములు ఒకే దేవున్ని తెలుపుచున్నవనీ, పొరపాటుగా ఏ మతస్థుడు కూడా ఇతర మత గ్రంథములను గురించి తక్కువగా మాట్లాడ కూడదని చెప్పుచుందుము. మూడు మతములయందు సమాన భావమున్న మమ్ములను క్రైస్తవులు, ముస్లీమ్‌లు అర్థము చేసుకొని మమ్ములను గౌరవ భావముతోనే చూస్తున్నారు. అయితే స్వమతమైన హిందూమతములోనే

మాకు మిగతా మతములలో లభించిన గౌరవము లభించలేదని అనుకొంటు న్నాము. దానికి ముఖ్యకారణము నేను బ్రాహ్మణున్ని కాదు గనుక వారి ప్రేరణతో, వారి కనుసన్నలతో చలామణి అగుచున్న మత సంఘము వారికి జ్ఞానమంటే ఏమిటో తెలియకపోయిన దానివలన, వారందరూ నన్ను హిందువులకు చెడు చేయువానిగానే లెక్కించుచున్నారు. మొదట పూర్తి వ్యతిరేఖముగాయున్న వారు కూడా కొంత యోచించి, మేము చేయుచున్నది మంచిపనేనని తలచి కొంతకొంత దగ్గరకాజొచ్చారు.

మూడు దైవ గ్రంథములలో ఒకే దేవుని జ్ఞానమున్నప్పుడు, మూడు మతములలో ఏ మతములోనున్నా, ఆ మతమునకు ఒక గ్రంథమున్నప్పుడు దానిద్వారా ప్రతి మతస్థుడు దేవుని జ్ఞానము తెలుసుకొనుటకు అవకాశ ముండగా, ఒక మతములో లేనిది మరొక మతములో ఉన్నదని, ఒక మతమును వదలి మరొక మతములోనికి పోవడము నాకు ఏమాత్రము సరిపోదు. ఒక మతమును వీడి మరొక మతములోనికి పోతే వదలిపోయిన మతము యొక్క గ్రంథమును కించపరచినట్లగును. కనుక మతమార్పిడి అంటే నాకు ఏమాత్రము సరిపోదు. మతమార్పిడులను ప్రోత్సహించు వారిని చూస్తే నాకు పరమ అసహ్యము. ఒక మతములోయుండి, మరొక మతములోని జ్ఞానమును తెలుసుకోవచ్చునుగానీ, మతమును మారకూడదని చెప్పుచుందుము. ఒక హిందూమతస్థుడు తన మత గ్రంథముగానున్న భగవద్గీతను గురించి తెలుసుకోవచ్చును. అలాగే ఇతర మత గ్రంథముల లోని జ్ఞానమును కూడా తెలియవచ్చును. అట్లు ఇతర మత గ్రంథములను చదవడముగానీ, వాటిలోని జ్ఞానమును తెలుసుకోవడము గానీ చేయడములో తప్పులేదు. అట్లుకాకుండా మిగతా గ్రంథములలో లేనిది మా గ్రంథముల లోనే ఉన్నదని చెప్పడముగానీ, మిగత మతములలో లేనిది మా మతములోనే

ఉన్నదని చెప్పడముగానీ నాకు ఏమాత్రము సరిపోదు. అయితే నేడు ప్రతి మతస్థుడు తన మతమును గొప్పగ చెప్పుకొనుచూ, ఇతర మతములను తక్కువగా చెప్పడము జరుగుచున్నది. అలా చెప్పువారి మాటలనుగానీ, అటువంటి వారు వ్రాయు వ్రాతలను గానీ, ఖండించుచు ఇది తప్పు అని చెప్పుచుందును. ఇంతవరకు ఈ గ్రంథములో చేసిన పని అదియేనని చెప్పుచున్నాను.

మనిషి పుట్టిన తర్వాత ముఖ్యముగా తెలియవలసినది దేవుని జ్ఞానమేగానీ, వేరుకాదు. అయితే మనిషి దేవుని జ్ఞానమును ప్రక్కనబెట్టి తాను స్వయముగా తయారు చేసుకొన్న మతము అను మాయలో చిక్కు కొన్నాడు. అలా మత మాయలోపడిన వానికి అదే మంచిగా కనిపిస్తుండును గానీ, మతములోని జ్ఞానము మంచిగా కనిపించదు. నేడు బోధకులుగా యున్న ప్రతివారూ మతము యొక్క మాయలో పడిపోయారు. అందువలన వారు బోధకులైనా, మతమునే బోధించుచూ, మతమును గురించే చెప్పు చుందురు. మత గ్రంథములలోని జ్ఞానమును మాత్రము కొద్దిగయినా తెలియకున్నారు. క్రైస్తవులను పరిశీలించి చూస్తే బోధకులందరూ మతవ్యాప్తిలో మునిగిపోయారు గానీ, బైబిలులో ఏసు చెప్పిన జ్ఞానమును మనము సరిగా అర్థము చేసుకొన్నామా లేదా అని వెనుతిరిగి చూచుకోలేక యున్నారు. అలాగే ముస్లీమ్‌లు కూడా అక్కడక్కడ కొన్ని సంఘములను ఏర్పరచుకొని, మతవ్యాప్తి చేయాలని ప్రయత్నించుచున్నారు తప్ప, తమ గ్రంథమైన ఖుర్ఆన్‌లోని జ్ఞానము వారికి ఎంతమటుకు అర్థమైనదని కొద్దిగా కూడా చూచుకోలేకపోతున్నారు. ఇక హిందువుల విషయమునకు వస్తే మతవ్యాప్తి చేయాలని ప్రయత్నము ఏ బోధకుడూ చేయడము లేదుగానీ, దేవున్ని అడ్డము పెట్టుకొని ధనార్జన చేయాలని చూస్తున్నారు. ఇందూమత

ములోని బోధకులు, గురువులు, స్వాములుగా పేరుగాంచియుండి చూపంతయూ ధనర్జాన మీద ఉంచుకోగా, బోధకులు కానివారు, ఏమాత్రము జ్ఞానము తెలియనివారు సంఘములుగా ఏర్పడి స్వమత రక్షణలో పడి పోయారు. అందువలన ధనార్జనలోనున్న బోధకులకుగానీ, స్వమత రక్షణలోనున్న మత రక్షకులకుగానీ, భగవద్గీతలోని జ్ఞానము తెలియకుండా పోయినది.

నేడు స్వమత రక్షణలో పడిపోయిన హిందువులు ఉన్న ఈ దేశం, ఒకప్పుడు ప్రపంచమునంతటికీ జ్ఞానమందించునదై, ప్రపంచ దేశములలో జ్ఞానుల దేశమని పేరుగాంచియుండేది. సృష్ట్యాదిలో దేవుడు తన జ్ఞానమును ఆకాశములోని ఆత్మ ద్వారా చెప్పించాడు. ఆకాశము చెప్పిన జ్ఞానమును సూర్యుడు వినడము జరిగినది. సూర్యుడు వినిన జ్ఞానమును భూమండలము లోని మానవులకు సూర్యుడు తెలియజేయడము జరిగినది. అలా తెలియ జేసినప్పుడు భూమిమీదగల భారతదేశములో పూర్తి దక్షిణ భారతదేశమున, శ్రీలంకకు సమీపమునయున్న రామేశ్వరం ప్రాంతములోయున్న మనువు అను వ్యక్తికి తెలుపడము జరిగినది. మనువు తెలుసుకొన్న జ్ఞానమును ఇక్ష్వాకుడు అను రాజుకు తెలుపగా, ఆ రాజు ద్వారా పూర్తి భారతదేశమంతా వ్యాపించి పోయినది. అలా భారతదేశములో అందరూ దైవజ్ఞానముకల వారైనారు. ప్రపంచ దేశములలో ఏ దేశములో లేని దైవజ్ఞానము భారత దేశములో ఉండెడిది. కావున కృతయుగములోనే భారతదేశము జ్ఞానుల దేశమని పేరుగాంచినది. ప్రపంచములో ఏ దేశమునకూ రాని బిరుదు భారతదేశమునకు వచ్చినది. దేవుని జ్ఞానము, దైవశక్తి భారతదేశములోనే ఉండుటవలన, ఆ కాలములోనే భారతదేశమును ఇందూదేశము అనెడి వారు. 'ఇందూ' అనునది ప్రత్యేక పదము. 'ఇందు' అనగా చంద్రుడని

అర్థము. దైవజ్ఞానమునకు చంద్రుడు చిహ్నముగాయున్నాడు. జ్యోతిష్య శాస్త్రములో కూడా చంద్రున్నిబట్టి మనిషికి ఏ జ్ఞానమున్నదో, ఎంత జ్ఞానమున్నదో చెప్పవచ్చును.

ఆధ్యాత్మిక విద్య ప్రస్తావన వచ్చినచోట జ్ఞానమునకు గుర్తుగా చంద్రున్ని చెప్పడము జరుగుచుండెడిది. భగవద్గీతలో కూడా అక్షర పర బ్రహ్మయోగమున 25వ శ్లోకములో యోగి అయినవాడు కొద్దిపాటి కర్మ శేషము వలన తిరిగి పుట్టవలసివస్తే "చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే" అని శ్లోకమున చెప్పారు. దానిభావము ప్రకారము తిరిగి జన్మించు యోగి చంద్రతేజమును పొంది జన్మను పొందునని యున్నది. ఇక్కడ చంద్ర తేజము అనగా సంపూర్ణ జ్ఞానము కలిగి అని అర్థము. ఈ విధముగా భారతదేశమంతా జ్ఞానముతో ప్రకాశించెడిది. అందువలన జ్ఞానమునకు గుర్తుగాయున్న చంద్రున్ని ఆధారము చేసుకొని భారతదేశమును ఇందూ దేశము అనెడివారు. మొదటి పేరు భారతదేశమైనా భారతదేశము ఇందూ దేశము అని (జ్ఞానుల దేశమని) ఇతర దేశముల చేత ప్రశంసింపబడెడిది. ఇందూదేశము అని భారతదేశమును, ఇందువులని భారతదేశములో నివశించెడివారిని మూడు యుగములలో పిలిచెడివారు. నాల్గవ యుగమైన కలియుగములో మూడువేల సంవత్సరములు గడుచువరకు అలాగే, ప్రజలను ఇందువులనీ, దేశమును ఇందూదేశమని పిలిచెడివారు. రెండు వేల సంవత్సరముల పూర్వము క్రైస్తవ మతము తయారైన తర్వాత, అంతవరకు ఇందువులని పిలువబడుచున్న ప్రజల ప్రక్కలోనికి, మతము అను పదము చేర్చబడినది. అంతవరకు మతము అను ప్రసక్తే లేకుండా, ఆ పేరే తెలియకుండావున్న ఇందువులు, వారు క్రైస్తవ మతస్థులైతే మేము ఇందూ మతస్థులమని చెప్పడము మొదలు పెట్టారు. ఆ విధముగా మొట్టమొదట మతము అను పదము ఇందువుల ప్రక్కన చేరిపోయినది.

తర్వాత కొంతకాలమునకు బ్రిటీష్‌వారు భారత దేశమునకు వ్యాపార నిమిత్తము వచ్చినప్పుడు, వారికి కొన్ని పదములను పలుకడము కష్టమైనందున, వారి నాలుక సులభముగా పలుకునట్లు కొన్ని పేర్లను మార్చుకొన్నారు. అలా వారు మార్చుకోవడము వలన కొన్ని పదములు బ్రిటీష్‌వారు వచ్చిన తర్వాత మారిపోయాయని చెప్పవచ్చును. ముంబాయి అను పదమును బొంబాయి అని మార్చుకొన్నట్లు, ఇందు అను పదమును హిందూ అని పలుకను మొదలు పెట్టారు. ఇందూ అను పదమును మొదట హిందూగా పిలిచినవారు ఆంగ్లేయులని నేడు అందరికీ తెలియకుండాపోయినది. చెన్నపట్నమును మద్రాసు అను పేరుగా ఆంగ్లేయులే మార్చారు. వారు నోరు తిరిగేదానికి, సులభముగా పలికే దానికి అనంతపురము అను పేరును అనంతపూర్ అని పిలిచారు. పురము అని ఉన్న పేర్లను పూర్ అని మార్చినవారు, కడపను కుడప (Cuddapah) అని ఆంగ్లములో వ్రాసుకొన్నారు. ఇట్లు ఎన్నో పేర్ల యొక్క రూపురేఖలను ఇంగ్లీషు వారు మార్చిన సంగతి కొందరికి గుర్తుండడము వలన, నేడు కొన్ని పేర్లను తిరిగి యథాతథముగా చెప్పుకోవడము, వ్రాసుకోవడము జరుగుచున్నది. ఉదాహరణకు బొంబాయిగాయున్న పేరును ముంబాయిగా, మద్రాస్‌ను చెన్నైగా, పూర్ అను దానిని పురముగా ఈ మధ్య 15 సంవత్సరములనుండి మార్చుకున్నాము.

అయితే ఇందూ అను పదము హిందూగా మారియున్నదని మరచిపోయి, మధ్యలో వచ్చిన హిందూపదమునే నేడు కూడా చెప్పుకొంటున్నాము. అయితే హిందూ అను పదము అర్థము లేనిదనీ, పూర్వము మనము ఇందువులమనీ, మన దేశము ఇందూ దేశమని పిలువబడినదనీ, మేము గత ముప్పై సంవత్సరములనుండి చెప్పుచూనే వస్తున్నా, మా మాటను

వినడము లేదు. జ్ఞానమునకు నిలయమైన దేశమని ఆనాడు ఇతర దేశస్థులందరూ భారతదేశమును ఇందూదేశమని ఎంతో గౌరవముగా పిలువగా, నేడు తమ చరిత్రను తామే మరచిపోయిన వారుగా భారతీయులు నేడు హిందువులుగా పిలువబడుచున్నారు. బొంబాయిని ముంబాయిగా మద్రాసును చెన్నైగా మార్చుకొన్నవారు, తమ చరిత్రనే మార్చివేసిన హిందూ పదమును తిరిగి ఇందూ పదముగా మార్చుకోలేకపోయారు. తాము గతములో ఇందువులము అను మాటను పూర్తిగా మరచిపోయారు.

దేవుని ధర్మములు జ్ఞానరూపములో మొట్టమొదట భారత దేశములో ప్రవేశించి తర్వాత చుట్టుప్రక్కల ప్రాకిన చరిత్రనుబట్టి నేటికినీ భారతదేశము ఇందూదేశమే, పూర్వము జ్ఞానరీత్యా చంద్రుని గుర్తుగా ఇందూ అని పిలువబడిన ప్రజలు ఎంతోకాలము జ్ఞానులుగానే జీవనము సాగించారు. భారతదేశము ఇందూదేశముగా పిలువబడుట చేత ఆ పేరు శాశ్వతముగా ఉండునట్లు భౌగోళికముగా కాశీమున్నగు నగరాలు చంద్రవంక ఆకృతిలో నిర్మింపబడినాయి. అలహాబాద్‌లో గంగానది అద్భుతముగా చంద్రవంక ఆకృతిలో వంపు తిరిగినది. అంతేకాక నేడు మనము పిలుస్తున్న హిందూ మహాసముద్రమును పూర్వము "ఇందూ సరోవరమని" పిలిచెడివారు. భారత దేశ మొదటి ప్రధానిగాయున్న నెహ్రూ తన కూతురుకు ఇందిర ప్రియదర్శిని అనిపేరు పెట్టి, ముద్దుగా ఇందూ అని పిలిచెడివాడు. మేము జ్ఞానరీత్యా కృతయుగము నుండి భారతదేశము ఇందూ దేశముగా, జ్ఞానమునకు చిహ్నామైన చంద్రుని పేరుతో ఇందు అని పిలువబడుచున్నదని చెప్పు చున్నాము. ఈ దేశము ఇందూ దేశమని చెప్పుటకు బలమైన ఆధారము కూడా కలదు. అదేమనగా! నేటికినీ హిమాలయములు భారతదేశమున ఉత్తర భాగమున ఉన్నట్లు అందరికీ తెలుసు. పూర్వము ఇందువుల పురాణములలో కైలాస పర్వతము హిమాలయములలో ఉన్నదనీ,

కైలాసములో శివుడు నివాసముండేవాడని చెప్పుకుంటున్నాము. కైలాసములో వున్న శివుడు తాను జ్ఞానిని అని తెలుపు నిమిత్తము గుర్తుగా, తన తలలోని వెంట్రుకలముడిపై చంద్రవంకను ధరించాడు. అది తెలియునట్లు నేడు ఎక్కడైనా శివుని ఫోటో కనిపిస్తే అతని తలమీద చంద్రవంక కనిపించును. భారతదేశమునకు ఎత్తైన హిమాలయ పర్వతముల మీద చంద్రవంక గుర్తు శివుని తలమీద జెండావలె (పతాకమువలె) ఉండుట వలన, హిమాలయముల నుండి క్రిందివరకున్న దేశమునంతటిని చంద్రుని పేరుతో ఇందూ దేశమని పిలిచెడివారని చెప్పవచ్చును. ఈ విధముగా చరిత్ర ఆధారముతోనూ, పురాణముల సాక్ష్యముతోనూ, భౌగోళికముగా చంద్రవంక ఆకృతి ఉండుట వలననూ, భారతదేశమును జ్ఞానుల దేశముగా గుర్తించి అందరూ ఇందూ దేశమని పిలిచెడివారు.

ఈ విధముగా భారతదేశము ఇందూ దేశము అనుటకు ఎంతో చరిత్ర కలదు. నేను ఎక్కువగా జ్ఞానరీత్యా మనది ఇందూ దేశమనీ, మనము ఇందువులమనీ, 30 సంవత్సరములనుండి మేము చెప్పుచున్నా మా మాటను పెడచెవిన పెట్టి, మేము ప్రత్యేకమైన ఇందూమతమును హిందూ మతమునకు పోటీగా తయారు చేస్తున్నామనీ, ఇందూ అను పరమతమును బోధిస్తున్నామనీ చరిత్రగానీ, జ్ఞానముగానీ తెలియని హిందూమతరక్షకులు మమ్ములను గురించి ఆరోపించడము జరిగినది. గొప్పవారి మాటలనే పరిగణనలోనికి తీసుకోవాలి, తక్కువ వారి మాటలను లెక్కపెట్టకూడదను సూత్రము ప్రకారము, మేము చరిత్ర తెలియని హిందువుల మాటలను లెక్కించలేదు. అదే సూత్రము ప్రకారము భారతదేశ తొలి ప్రధానిగా పనిచేసిన నెహ్రూ గారు, తన కూతురు ఇందిరాగాంధీ గారికి వ్రాసిన లేఖను పరిగణనలోనికి తీసుకొని, దానినే మీకు చూపుచున్నాను చూడండి.

ప్రముఖుల లేఖ

*సాక్షి న్యూస్ పేపరు, 21-01-2014*



## ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే  హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

## ఇందూ-హిందూ

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇందు | = | చంద్రుడు | = | జ్ఞాని | ప్రబోధానంద యోగీశ్వరులు |
| హిందు | = | అర్థరహితము | = | జ్ఞానములేని | |
| హిందు | = | దొంగ | = | దయానంద సరస్వతి (గురూజీ సమగ్ర గ్రంథావలి) | |
| హిందు | = | బేవకూఫ్ | = | నృసింహానంద భారతి (హైందవ శంఖారావము) | |

చిన్నజీయర్ మొదలగు చాలామంది స్వామీజీలు హిందూ శబ్ధమును వాడకూడదన్నారు. ఆ పదమును వాడితే మన తల మనమే నరుక్కున్నట్లని తమ ఉపన్యాసములో చెప్పారు. చాలామంది స్వామీజీలు ఈ శబ్ధమును విదేశీయులైన ముస్లీమ్‌లు మనకు అంటగట్టారన్నారు. వారి భావములో హిందు అంటే తెలివి తక్కువవారని అర్థమట.

ఈ విధముగా భారతదేశము ఇందూ దేశముగా ఉన్నదనుటకు ఎన్నో సాక్ష్యములు గలవు. అయితే నేడు ఇందువులు హిందూ మతస్థులుగా మారిపోవడము జరిగినది. మతము అను ఉచ్చులో చిక్కుకొన్న భారతీయు లందరూ, తాము ఇందువులమను తమ చరిత్రను తెలియనివారై, అర్థములేని హిందూ పదమును పెట్టుకొని, మేము హిందువులము అంటున్నారు. నేడు స్వమత రక్షణలో పడిన హిందూరక్షణ సంస్థలన్నీ మేము ఎందుకు క్షీణ దశకు వచ్చి మమ్ములను మేము రక్షించుకోవలసి వస్తున్నదని ఏమాత్రము యోచించలేదు. ఒకడు ఏదంటే రెండవవాడు అదే అంటూ పోతున్నాడు తప్ప ఇది నిజమా, అబద్ధమా అని ఏమాత్రము యోచించడము లేదు. తాము తప్పు చేస్తున్నామనీ, మన గౌరవమును మనమే లేకుండా చేసుకుంటు

న్నామని అనుకోకుండా, తప్పును సమర్థించుకొంటూ హిందూమతము అను దానికి అర్థమును చెప్పుటకు సింధూనదిని జోడించుకొని చెప్పుచున్నారు. సింధూనదికీ హిందూమతమునకు సంబంధము ఏమిటి? అని ఏమాత్రము ఆలోచించడములేదు. స్వమతరక్షణ అను నినాదముతోయున్న వారు స్వమత మేదో, పరమతమేదో తెలియని స్థితిలో ఎవరు జ్ఞానమును చెప్పినా, వాడు ఇతర మతమును బోధిస్తున్నాడని ఆరోపణ చేయడము మొదలుపెట్టారు. దానికి తార్కాణముగా (నల్గొండ జిల్లా) భువనగిరిలో బ్రాహ్మణులందరూ పోలీస్‌స్టేషన్‌కుపోయి త్రైత సిద్ధాంతమనునది క్రైస్తవులది, కావున త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండి అని గోడలమీద వ్రాసినవారిమీద కేసు పెట్టండని ఆరోపించడము, అక్కడి సి.ఐ కూడా కొంతయినా ఆలోచించ కుండా త్రైత సిద్ధాంత భగవద్గీతను మా భక్తులు చూపించినా, గ్రుడ్డిగా కేసు నమోదు చేయడమును చూస్తే, ఇందువులు హిందువులుగా మారడమే కాకుండా పూర్తి గ్రుడ్డివారై నారని చెప్పవచ్చును.

ఏ మతమూ లేని రెండువేల సంవత్సరముల పూర్వము, భారత దేశములో గౌతముడు గయలో బోధివృక్షము క్రింద జ్ఞానోదయమైన తర్వాత, బుద్ధునిగా ప్రకటించుకొని కాషాయ వస్త్రములు ధరించి, గుండు కొరిగించు కొని, పూర్తిగా సంసారమును త్యజించి అంతకుముందున్న మహర్షులకంటే కొంత భిన్నముగా, తాను అనుభూతి చెందిన జ్ఞానమును చెప్పెడివాడు. హిందువులలో శూద్రకులమువాడైన బుద్ధుడు సన్న్యాసిగా మారి ఎక్కువగా భూత దయను బోధిస్తూ, తనకు తెలిసిన జ్ఞానమును చెప్పడము ఆనాడు అగ్రకులమువారైన బ్రాహ్మణులకు సరిపోలేదు. కాషాయ వస్త్రములు ధరించి సన్న్యాసిగాయున్న బుద్ధున్ని కూడా పరమతమువానిగా ప్రచారము చేసి బుద్ధుని జ్ఞానమువైపు ఎవరినీ పోనీయకుండా చేయవలెనని, బుద్ధుని తర్వాత కొంత కాలమునకు వచ్చిన శంకరాచార్యున్ని సాక్షాత్తూ ఈశ్వరుడన్నట్లు

ప్రచారము చేసి, బౌద్ధ సూత్రములను అణచివేశారు. భారతదేశములో పుట్టిన బౌద్ధ సూత్రములకు బుద్ధుని జ్ఞానమునకు చైనా, రష్యా, టిబెట్, జపాన్, శ్రీలంక, మలేషియా, థాయిలాండ్ మొదలగు దేశముల ప్రజలు ఎందరో ఆకర్షితులు కాగా, అది హిందూమతముకాదని ఆనాటి హిందువు లలోని బ్రాహ్మణులు చెప్పగా బుద్ధుని సిద్ధాంతములు కాస్త బౌద్ధమతముగా మారిపోయినది. అలా బుద్ధున్ని వెలివేయకపోతే, శూద్రుడను అసూయతో చూడక పోయివుంటే నేడు బౌద్ధమతముగా చెప్పబడునది హిందూమతము గానే ఉండెడిది.

ఈ విధముగా తమ స్వార్థముతో మేము తప్ప ఇతర కులముల వారు ఎవరూ జ్ఞానులుగా కనిపించకూడదని అనుకోవడము వలన కొన్ని దేశములలో వ్యాపించిన బౌద్ధమతము హిందూమతము నుండి వీడిపోయి నది. అది వీడిపోలేదు హిందువులే విడగొట్టారు. కాషాయములు ధరించి సన్యాసము తీసుకొన్న బుద్ధున్ని శూద్రుడను అసూయతో, మా హిందూ మతమునకు సంబంధములేదని అది పరమతమని ప్రచారము చేసి, కేరళ బ్రాహ్మణుడైన శంకరాచార్యున్ని గొప్పవానిగా ప్రచారము చేసి, అతనితో ఎవరూ బౌద్ధ సూత్రములను ఆచరించకుండునట్లు అద్వైతమును ప్రచారము చేయించారు. ఈ విధముగా మన వ్రేలే తీసుకొని మన కన్నే పొడుచు కొన్నట్లయినది. ఇట్లు రెండువేల సంవత్సరముల పూర్వమే హిందూమతము క్షీణించుటకు ప్రారంభించినది. తర్వాత క్రైస్తవము భారతదేశములోనికి వచ్చి చాలా వేగముగా అభివృద్ధయినది. దానికి కారణము హిందువులలో అధిక శాతమున్న శూద్రులలో బ్రాహ్మణుల వలన అసహనము పెరిగిపోయి, ఇతర మతములవైపు వేగముగా పోవుటకు మొదలు పెట్టారు. నేడు హిందూమతము ఎంతో క్షీణించిన స్థితిలో కూడా త్రైత సిద్ధాంతముగా

జీవాత్మ, ఆత్మ, పరమాత్మయని మూడు ఆత్మలను తెల్పుచూ, అదే భగవద్గీతలో చెప్పిన క్షర, అక్షర, పురుషోత్తముడను మూడు ఆత్మలను చెప్పుచున్నా మమ్ములను కూడా బుద్ధున్ని వెలివేసినట్లు ప్రక్కకు పంపాలని, మమ్ములను పరాయి మతముగా లెక్కవేసి, పరమతమును బోధిస్తున్నామని చెప్పుచూ, కేసులు కూడా పెట్టిస్తున్నారంటే నేటికి కూడా శూద్రులను వివక్ష అగ్రకులము వారిలో పోలేదని తెలియుచున్నది.

గత కొంతకాలముగా మా మీద ఎన్నో ఆరోపణలు హిందూ మతములోనే వచ్చినా, ప్రజలు సత్యమును గ్రహించి మేము చెప్పు జ్ఞానము వైపు రావడము జరుగుచున్నది. ఒక్క హిందువులే కాకుండా మిగతా అన్ని మతములవారు కూడా మా జ్ఞానమునకు ఆకర్షితులైనారు. మావద్ద అన్ని మతములు సమానమైనవని మేము చెప్పడము వలనా, ఇక్కడ మత మార్పిడులు లేనందువలనా, ఏ మతములోనున్నా వారికి జ్ఞానమంతా ఒక్కటేననీ, అందరికీ దేవుడు ఒక్కడేనని చెప్పడమువలనా మూడు మతముల వారు మా జ్ఞానమును తెలుసుకోగల్గుచున్నారు. మా గ్రంథములను అన్ని మతములవారు చదువుచున్నారు. నా జ్ఞానము విన్న ఏ హిందువుకూడా పరమతములోనికి పోవాలని అనుకోవడము లేదు. అలాగే నన్ను చూచిగానీ, నా జ్ఞానమును చూచిగానీ ఇతర మతస్థులు ఎవరూ అసూయ పడడములేదు. మతసామరస్యమునకు ఈ జ్ఞానము ఎంతో అవసరమని అందరూ అంటున్నారు.

నేను పుట్టుకలో హిందువుగా పుట్టినప్పటికీ, పూర్వపు ఇందూ (జ్ఞాన) లక్షణములు నాలోయుండుట వలన, నేను స్వచ్ఛమైన ఇందువును అని చెప్పుచున్నాను. ఇందువు అంటే జ్ఞాని అని పూర్వమున్న అర్థమే నేడు కూడా కలదు. మూడు మతములలో మూడు గ్రంథముల ద్వారా దేవుడు

తన జ్ఞానమును తెలిపియున్నాడు. కావున ఏ మతములోనివాడైనా వాని గ్రంథములోని జ్ఞానమును బాగా తెలియగలిగితే, వాడు ఆ మతములో జ్ఞాని అనబడును. దేవుని జ్ఞానము తెలిసినవాడు ఏ మతములోనైనా జ్ఞానియే కావున, వానిని ఆ మతములోని ఇందువు అనవచ్చును. జ్ఞాని అంటే ఇందువు అను అర్థము ప్రకారము, హిందూమతములో ఇందువులు ఉన్నట్లే, క్రైస్తవ మతములో ఇందువులుండవచ్చును. అట్లే ఇస్లామ్ మతములోని ఖుర్ఆన్ గ్రంథము యొక్క జ్ఞానమును సంపూర్ణముగా తెలిసిన వానిని కూడా పద్ధతి ప్రకారము ఇందువే అని అనవచ్చును. ఈ విధముగా మూడు మతములలో ఇందువులు (జ్ఞానులు) ఉండవచ్చును. మూడు మతముల జ్ఞానమును తెలిసినవానిని సంపూర్ణ జ్ఞాని అనవచ్చును. లేక సంపూర్ణ ఇందువు అనవచ్చును. ఇందువు అంటే అతడు ఏ మతము జ్ఞానమునైనా తెలిసియుండవచ్చును. ఇందువు అను పదము జ్ఞానమునకు సంబంధించినదిగానీ, మతమునకు సంబంధించినది కాదు. అందువలన ఏ మతములోనైనా ఇందువులు ఉండవచ్చును.

ఒక మతమునకేగాక అన్ని మతములకు సంబంధించిన జ్ఞానము తెలిసిన వానిని సర్వమత జ్ఞాని అనియూ, సంపూర్ణ ఇందువు అనియూ అనవచ్చును. ఒక విధముగా నేను మూడు మత గ్రంథముల జ్ఞానమును తెలిసియున్నాను. కావున నేను నా లెక్కలోగానీ, మీ లెక్కలోగానీ స్వచ్ఛమైన ఇందువును అనియే చెప్పవచ్చును. ప్రపంచ విషయములలో తనను గొప్పగ చెప్పుకోవడము గర్వమవుతుంది. అయితే జ్ఞాన విషయములో, దేవుని విషయములో గుణములుండవు. దేవుని విషయములో ఏదీ దాచుకోకూడదు. ఉన్నదున్నట్లు చెప్పడము మంచిది. అందువలన మేము ఉన్నదున్నట్లు చెప్పవలెనను ఉద్దేశ్యముతో నేను యోగీశ్వరున్ని అని చెప్పుచున్నాను. ఒక

మనిషి యోగిగా మారాలంటే ముందు సంపూర్ణ జ్ఞానిగా మారియుండాలి. మొదట సంపూర్ణ జ్ఞాని అయిన తర్వాత యోగిగా మారవచ్చును. అందువలన యోగినైన నేను గతములోనే సంపూర్ణ జ్ఞానిని అని చెప్పుటకు సంశయించడములేదు. నేను సంపూర్ణ జ్ఞానిని అయినందున మూడు మతముల జ్ఞానము నాకు తప్పనిసరిగా తెలిసియుండాలి. అలా జ్ఞానము తెలిసియుంటే మూడు మతములు నా మతములే అను భావము కల్గియుండాలి. ఎవరైనా వారి ఇంటిలో ఒక వస్తువు ఉండవలసిన చోట ఉండక క్రిందపడియుంటే తప్పనిసరిగా దానిని ఉండవలసిన చోట పెట్టుదురు. అలాగే వారి ఇంటిలో కసువు పడి (చెత్తపడి)యుంటే తప్పని సరిగా శుభ్రముగా చేసుకొందురు. ఎవరి ఇంటిని వారు శుభ్రముగా ఉంచుకొన్నట్లు, నాది అనుదానిలో ఉండవలసినది ఉండకపోతేనో, ఉండవలసిన రీతిలో ఉండక తలక్రిందులుగా యుంటేనో, తప్పక దానిని సవరించవలసిన బాధ్యత నాకు ఉంటుంది కదా! అలాగే మూడు మతములను నా మతములుగా తలచినప్పుడు, ఆ మూడు మతములలో ఏదైనా లోపము కనిపించితే, దానిని సవరించు బాధ్యత కూడా మామీద ఉంటుంది. అటువంటి బాధ్యతను నేను కల్గియున్నాను కాబట్టి, క్రైస్తవ మతములో ఏసు చెప్పిన జ్ఞానమునువదలి క్రైస్తవులు వేదములను చెప్పుకోవడము మంచిదికాదనీ, ఏసు సంపూర్ణ జ్ఞానమును అందించగా, దానిని ఒక్క ముక్కయినా చెప్పక ఒక గ్రంథమంతా వేదములను, పురాణము లను వ్రాసుకోవడము మాకు సరిపోలేదు. అందువలన వారు చెప్పిన వేదముల వాక్యములన్నిటిని మేము ఖండించడము జరిగినది. అలాగే హిందూ మతము లోని భగవద్గీతలో కలిసిన మానవ కల్పిత శ్లోకములను తీసివేసి స్వచ్ఛమైన భగవద్గీతను అందివ్వడము జరిగినది. అలాగే ఖుర్‌ఆన్‌లోని వాక్యములు ముస్లీమ్‌లకు అర్థముకానివివుంటే, వాటికి కూడా

శాస్త్రబద్ధముగా వివరము చెప్పడము జరిగినది. నేను ఇందువును కాబట్టి వారి వారి మతములలోని వారిని ఇందువులుగా (జ్ఞానులుగా) తీర్చిదిద్దడము నా కనీస బాధ్యత. అందువలన మూడు మతములలోని కాలుష్యమును తొలగించుటకు నేను ప్రయత్నించవలెనని అనుకొన్నాను. ఆ ప్రయత్నము లోని భాగముగా **"ఇందువు-క్రైస్తవుడా?"** అను గ్రంథము ద్వారా హిందూ మతములోని లోపములనూ, అటు క్రైస్తవ మతములోని లోపములనూ సరి చేయు ప్రయత్నము చేశాము. తప్పును తప్పుగా, ఒప్పును ఒప్పుగా చెప్పాము. వేదములను హిందూమతములో గొప్పగా చెప్పుకొనుచున్నా, భగవద్గీతలో దేవుడు చెప్పిన వాక్యమునకు విలువనిచ్చుచూ, పూర్తిగా వేదములను ఖండించి వేశాము. ఇది నా మతమని, ఇది పరమతమని బేధము లేకుండా మూడు దైవ గ్రంథములను గురించి అందరికీ అర్థమగు లాగున చెప్పుచూ వచ్చాము. మూడు మతములలోని వాడెవడైనా వాని గ్రంథముగాయున్న బైబిలులోగానీ, ఖుర్‌ఆన్‌లోగానీ, భగవద్గీతలోగానీ, జ్ఞానమును అర్థము చేసుకొని జ్ఞానిగా మారియుంటే వానిని జ్ఞానిలేక ఇందువు అనాలి. జ్ఞాని అయిన తర్వాత ఎవడుగానీ నేను ఫలానా మతస్థుడనని చెప్పుకొనే దానికంటే నేను ఫలానా దైవ గ్రంథము యొక్క ఇందువును అని చెప్పుకోవడము మంచిది. ఇందువు అను పదము మతమును సూచించదు, ఇందువు అను పదము కేవలము జ్ఞానమును మాత్రమే సూచించును. అందువలన ఏ మతస్థుడైనా నేను ఫలానా ఇందువునని చెప్పండి. క్రైస్తవుడు బైబిలు జ్ఞానమును అంతటినీ తెలిసిన తర్వాత అతడు జ్ఞానిగా మారియుండును. కనుక అతడు నేను ఇందువునని చెప్పుకోవచ్చును. లేకపోతే మతము పేరు చెప్పకుండా వారి గ్రంథము పేరు చెప్పి నేను భగవద్గీత ఇందువుననో, ఖుర్‌ఆన్ ఇందువుననో, బైబిలు ఇందువుననో చెప్పవచ్చును. ఇంకా ముందుకుపోయి మూడు దైవ

గ్రంథముల జ్ఞానమును సంపూర్ణముగా తెలియగలిగిననాడు సంపూర్ణ జ్ఞానిగా చెప్పుకోవచ్చును. సంపూర్ణ జ్ఞాని అయిన తర్వాత తన మతమును గురించి గొప్పగా చెప్పుకోవడముగానీ, తాను ఫలానా మతస్థుడననీ చెప్పుకోవడము మంచిదికాదు. అట్లు చెప్పుకోవడమువలన ఎవడూ సంపూర్ణ జ్ఞాని అనిపించుకోడు.

మతము అనునది ఏ మనిషికైనా ప్రాథమిక అజ్ఞానమైనందున, మతమును చెప్పుకొను ఎవడుగానీ జ్ఞానికాలేడని ముందే చెప్పుకొన్నాము. ఇంతకుముందు గ్రంథములలో కూడా వ్రాసుకొన్నాము. దేవుడిచ్చిన మూడు దైవగ్రంథములకు మతము పేరు అంటగట్టడము కూడా పెద్ద నేరమే. దేవుడు మతము పేరు చెప్పి ఏ గ్రంథమూ ఇవ్వలేదు. ఏ గ్రంథము ఇచ్చినా అది సకల జనులకు అని ఇచ్చాడుకానీ, ఫలానా మతము వారికేనని ఇవ్వలేదు. అందువలన మతప్రసక్తి లేకుండా మూడు గ్రంథములలో నీ కిష్టమైన ఏ గ్రంథమును అనుసరించినా, అది మనిషిని దేవునివద్దకు చేర్చ గలదు. చేతనైతే మూడు గ్రంథములను చదివి జ్ఞానమును గ్రహించుకొంటే మరీ తొందరగా దేవునివద్దకు చేరవచ్చును.

నేడు అన్ని మతముల వారు ఉదయము లేచింది మొదలు తిరిగి రాత్రి పడుకొనే వరకు బ్రతుకుతెరువు కొరకు ప్రాకులాడడమే జరుగుచున్నది. అయితే కొందరు మాత్రము దేవుడు జ్ఞానము మీద కొంత ధ్యాస కల్గి యున్నారు. వారి కొరకు కొందరు బోధకులు తమ గ్రంథములోని జ్ఞానమును బోధించుచుందురు. ఏ మతము వారు ఆ మతములోని జ్ఞానమును చెప్పుచూ, ఇతర మతముల వారిని తమ మతములోనికి లాగుకొనుటకు ప్రయత్నించు చుందురు. మేము చూచినంతలో క్రైస్తవులు, ముస్లీమ్‌లను తమ మతము లోనికి మార్చాలనుకోవడము లేదు. అట్లే ముస్లీమ్‌లు

క్రైస్తవులను మార్చాలనుకోవడము లేదు. ఎటొచ్చీ హిందూమతములోని మనుషులను తమతమ మతములోనికి చేర్చాలని మిగతా రెండు మతముల బోధకులు ప్రయత్నించుచున్నారు. క్రైస్తవ బోధకులు, ప్రచారకులు హిందువులను తమ మతములోనికి ఎక్కువశాతము మార్చుకొన్నారు. అలా మారినవారు అక్కడకుపోయి బైబిలు గ్రంథమును చదివి జ్ఞానమును తెలుసుకొని జ్ఞానిగా మారితే ఫరవాలేదు. మతము మారినా తన లాభముకొరకు అన్నట్లు, గ్రంథములోని జ్ఞానమును తెలుసుకోక కాలము గడుపువారు కూడా కలరు. వారు ఏ మతములోయున్నా ఒక్కటే.

ఎవడైనా హిందూమతములో నాకు జ్ఞానము చెప్పువారు ఎవరూ లేరనియో, హిందూమతములో అగ్రకులముల వారి వివక్ష చాలా ఉన్నది, అటువంటి వివక్ష లేని క్రైస్తవ మతములోనికి పోతాననియో, హిందూ మతములో భగవద్గీత అర్థము కాలేదనియో, ఏదో ఒక విధముగా జ్ఞానము కొరకే మతమును మార్చుకొని క్రైస్తవులలో కలిసిపోయి, బైబిలు గ్రంథమును చదివి బాగా అర్థము చేసుకొని బైబిలు జ్ఞానము ప్రకారము జ్ఞాని అయితే అప్పుడు నేను ఇందువును (జ్ఞానిని) అని ప్రకటించుకోవచ్చును. అలా జ్ఞానిగా మారినవాడు తాను బైబిలు జ్ఞానమును గ్రహించుకొని జ్ఞానినైనానని అనుకొనునుగానీ, క్రైస్తవ మతము వలన జ్ఞానినైనానని ఎవడూ అనుకోడు. అట్లు జ్ఞాని అయినవాడు క్రైస్తవుడా? అంటే కాదని చెప్పవచ్చును. వాడు క్రైస్తవ మతములోని వాడే కదాయని ఎవరైనా అడిగితే బైబిలు జ్ఞానము తెలియకముందు క్రైస్తవుడేగానీ, బైబిలు జ్ఞానము తెలిసిన తర్వాత జ్ఞాని అయిన తర్వాత క్రైస్తవుడు కాదు. అప్పుడు వాడు ఇందువుగా తయారైనా డని చెప్పవచ్చును. అప్పుడు ఇందువు క్రైస్తవుడా? అని ప్రశ్నిస్తే క్రైస్తవుడు కాదు ఇందువేనని చెప్పవచ్చును. బైబిలు చదివిన తర్వాత, అందులోని జ్ఞానమును గ్రహించుకొన్న తర్వాత, ఆ గ్రంథములో క్రైస్తవము అను పేరు

లేనిదానివలన, తనను క్రైస్తవునిగా చెప్పుకొనుటకు ఇష్టపడడు. తనను జ్ఞానిగానే చెప్పుకొనుటకు ఇష్టపడును. అందువలన మతములకు అతీతముగాయుండు ఇందువునని చెప్పుకొనును.

మూడు దైవ గ్రంథములైన భగవద్గీత, బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథముల సారాంశము తెలిసినవాడు సంపూర్ణ జ్ఞానియై చివరకు యోగిగా మారగలడు. అలా మారగలిగినవాడు మూడు దైవ గ్రంథములలోని జ్ఞాన విషయములను సులభముగా వివరించి చెప్పగలడు, అని మేము చెప్పగా ఒక క్రైస్తవ బోధకుడు మా మాటలు విని అతడు ఇలా అన్నాడు.

బోధకుడు :- నేను క్రైస్తవున్ని అని చెప్పుకొంటున్నాను. నాకు బైబిలు జ్ఞానమంతా తెలుసు. బైబిలు జ్ఞానమంతా తెలిసివున్న నన్ను జ్ఞాని అని ఎవరైనా అనగలరు. జ్ఞానిని అయినంతమాత్రమున నేను పుట్టిన మతమును ఎలా కాదనగలను? నేను పుట్టింది మొదలు యాభై (50) సంవత్సరములుగా క్రైస్తవ మతములోయుండి నేడు జ్ఞానినైనంతమాత్రమున క్రైస్తవున్ని కాదని ఎలా చెప్పగలను? అలా బలవంతముగా చెప్పినా, క్రైస్తవ వాసన నాలోనుండి ఎలా పోగలదు? అందువలన నేను జ్ఞానినే అయినా క్రైస్తవున్నేనని చెప్పు చున్నాను.

నేను :- నేను క్రైస్తవున్ని అని చెప్పుచున్నావంటే బైబిలు జ్ఞానము నీకు తెలియదనియే చెప్పవచ్చును. నేను క్రైస్తవుడను కాను అని అర్థమైనప్పుడే జ్ఞానివి కాగలవు. క్రైస్తవునిగా కాకుండాపోవడమే జ్ఞానిగా మారడము. అందువలన నీకు ఇంకా బైబిలులోని జ్ఞానము తెలియదనియే చెప్పవచ్చును. బైబిలు తెలియదని నీకు తెలియుటకు నేను బైబిలు గ్రంథములోని ఒక వాక్యమును అడుగుతాను. నేను క్రైస్తవుడినేనని చెప్పువాడు వాక్యమునకు సరియైన జ్ఞాన వివరమును చెప్పలేడు.

బోధకుడు :- మీరు బైబిలు అని చెప్పి ఇతర గ్రంథములలోని ప్రశ్న అడుగ కూడదు. ఖచ్చితముగా బైబిలులోని ప్రశ్ననే అడుగండి?

నేను :- అలాగే అడుగుచున్నాను. బైబిలు గ్రంథములో యోహాను సువార్త 6వ అధ్యాయమున 46వ వాక్యముయందు ఇలా కలదు. "దేవుని వద్దనుండి వచ్చినవాడు తప్ప మరి ఎవడునూ తండ్రిని చూచియుండలేదు." ఈ వాక్యమును చూచారు కదా! దేవునివద్దనుండి వచ్చినవాడు మాత్రమే తండ్రిని చూచాడు అని అర్థమగుచున్నది కదా! దేవునివద్దనుండి వచ్చినవాడు ఎవడు?

బోధకుడు :- దేవునివద్ద నుండి వచ్చినవాడు ఏసుప్రభువు మాత్రమే. ఆయన వచ్చాడు కనుక ఆయన మాత్రము తండ్రిని చూచాడు.

నేను :- ఏసు తండ్రి ఎవరు?

బోధకుడు :- మీరు తెలివిగా ప్రశ్నను అడుగుచున్నారు. ఫలానావాడు తండ్రి అని చెప్పితే నీవు చూడలేదు కదా! ఏసు ఒక్కడే కదా చూచినది ఆయన తండ్రి నీకెలా తెలుసు? అని అడుగుతావు. చెప్పకపోతే బోధకుడై యుండి ఏసును గురించి బోధించునప్పుడు ఆయన తండ్రి తెలియదా? అని అడుగుతావు.

నేను :- నీవు చూచావా? అని నేను అడుగలేదు. ఫలానా అని తెలుసా? అని అడుగుచున్నాను.

బోధకుడు :- యోహాను సువార్త ఆరవ అధ్యాయములోనే 27వ వాక్యమందు "తండ్రియైన దేవుడు ఆయనకు ముద్రవేసియున్నాడు." అని ఉన్నది కనుక. ఆయన తండ్రి దేవుడేనని చెప్పవచ్చును.

నేను :- మీ తండ్రి ఎవరు? ప్రపంచరీత్యా ఎవరైనాయుండవచ్చును. అయితే జ్ఞానరీత్యా నీ తండ్రి ఎవడు?

బోధకుడు :- మత్తయి సువార్త 23వ అధ్యాయము 9వ వాక్యమునందు "ఒక్కడే మీ తండ్రి ఆయన పరలోకమందున్నాడు" అని కలదు. కావున మా తండ్రి కూడా దేవుడేనని అందరమూ దేవునిబిడ్డలమేనని అందరికీ దేవుడు ఒక్కడే తండ్రియని తెలుసు.

నేను :- అందరికీ తండ్రి దేవుడే అనినప్పుడు నీవు ఎవరి వద్దనుండి వచ్చావు? దేవునివద్దనుండి వచ్చావా? సాతానువద్దనుండి వచ్చావా?

బోధకుడు :- దేవునివద్దనుండియే వచ్చాను. అందరమూ దేవునివద్దనుండే వచ్చాము. అందరికీ ఆయనే సృష్టికర్త.

నేను :- అందరి విషయమునూ అడుగలేదు. నీ విషయమును మాత్రము అడుగుచున్నాను. నీవు దేవునివద్దనుండి వచ్చియుంటే, దేవునివద్దనుండి వచ్చినవాడు తప్ప మరి ఎవరునూ తండ్రిని చూచియుండలేదు అని ఏసు ప్రభువు అన్నాడు కదా! ఆయన చెప్పినట్లు మీరు తండ్రియైన దేవున్ని చూచారా?

బోధకుడు :- అందరూ దేవునివద్దనుండి వచ్చినవారమే కనుక తండ్రిని చూచియే ఉందుము.

నేను :- నాలుగు ప్రశ్నలకు ముందు మీరే దేవునివద్దనుండి వచ్చినవాడు ఏసు ఒక్కడే అనీ, ఆయన మాత్రమే తండ్రిని చూచాడని చెప్పారు. ఇప్పుడు అందరమూ దేవునివద్దనుండి వచ్చాము అంటున్నారు. అంతేకాక తండ్రిని కూడా చూచాము అంటున్నారు. మీరు అలా చూచియుండలేదని మీరు అసత్యము చెప్పుచున్నారని మేము అనగలము. దీనికి మీరేమంటారు?

బోధకుడు :- దేవునివద్దనుండి వచ్చినవారు తప్ప అని దేవుడు అన్నాడుగానీ, ఏసు ఒక్కడే నావద్దనుండి వచ్చాడని, మిగతావారు ఎవరూ నావద్దనుండి

రాలేదని చెప్పలేదే! మేము కూడా అక్కడనుండే వచ్చాము. మా తండ్రి కూడా దేవుడు, కావున మా తండ్రిని మేము ఎరుగుదుము. మా తండ్రియైన దేవున్ని మేము చూడలేదని మీరెలా చెప్పగలరు?

నేను :- ఇదే యోహాను సువార్త ఐదవ అధ్యాయమున 37వ వాక్యము నందు "మీరు ఏ కాలమందైననూ, ఆయన స్వరము వినలేదు, ఆయన స్వరూపమును చూడలేదు" అని ఉన్నది కదా! దీనికేమంటారు. ఏసు చెప్పిన మాట అసత్యమంటారా?

బోధకుడు :- ఏసు చెప్పినది అసత్యమని మేము చెప్పలేదు. ఆయన చెప్పినది వాస్తవమే. అయితే అర్థము చేసుకోవడములో మనయందే లోపము ఉండవచ్చును కదా!

నేను :- మీరే చెప్పండి ఎలా అర్థము చేసుకోవాలో?

బోధకుడు :- ఎవరూ ఆయన స్వరము వినలేదు, ఆయన స్వరూపమును చూడలేదు అని చెప్పినది క్రైస్తవులను గురించికాదు. క్రైస్తవులు కానివారిని గురించి చెప్పాడు. క్రైస్తవులకు తండ్రి ఎవరో, దేవుడు ఎవరో తెలుసును.

(ఇక్కడ బోధకుడు పూర్తి తప్పటడుగు వేశాడు. (మత్తయి సువార్త 28-19లో) సమస్త జనులకు తన బోధయని ఏసు చెప్పియుండగా, ఈ మాట క్రైస్తవులకు చెప్పినదనియూ, ఆ మాట ఇతర మతముల వారికనియూ చెప్పడము పూర్తి తప్పనీ, బైబిలు జ్ఞానము ప్రకారము బోధకుడు మాట్లాడలేక పోయాడనీ, అందువలన ఆయన జ్ఞానికాదని నిరూపించబడినది.)

పై మాటలనుబట్టి దేవుడు ఎవరో, తండ్రి ఎవరో అర్థముకాని స్థితిలో బోధకులు కూడా ఉన్నారని తెలియుచున్నది. బైబిలు గ్రంథములోని నాలుగు సువార్తలలో ఏసు ఏమి చెప్పినాడో తెలియని స్థితిలో నేటి క్రైస్తవులు

ఉండిపోయారు. అటువంటి స్థితిలో బోధకులుండి తాము బైబిలు గ్రంథము లోని జ్ఞానమును తెలుసుకోవాలని ప్రయత్నించక, తమకున్న జ్ఞానముతోనే హిందువులను క్రైస్తవులుగా మార్చుటకు ప్రయత్నించుచున్నారు. ప్రతి క్రైస్తవ బోధకుని అంతరంగములో, నాకు బైబిలు అంతా తెలుసు అనే భావమే ఉన్నది తప్ప, తెలియవలసినది ఎంతో ఉన్నదను భావము లేదు. పైగా ఎంత వలవేస్తే అన్ని చేపలు దొరుకునన్నట్లు, చెరువులోని చేపలవలెనున్న హిందువులను క్రైస్తవులుగా మార్చుటకే చూస్తున్నారు తప్ప వేరు ఉద్దేశ్యము మాకు కనిపించడములేదు. చివరకు హిందువులను తమ మతములోనికి మార్చుకొనుటకు, బైబిలు జ్ఞానమునుకూడా మార్చి చెప్పుటకు పూను కొన్నారు.

భగవద్గీత భూమిమీదికి వచ్చిన ప్రథమ దైవ గ్రంథము. తర్వాత కొంత కాలమునకు ద్వితీయ దైవ గ్రంథముగా బైబిలు వచ్చినది. ఆ తర్వాత కొంతకాలమునకు అంతిమ దైవ గ్రంథముగా ఖుర్ఆన్ గ్రంథము వచ్చినది. ముందు వెనుక మూడు గ్రంథములు వచ్చినా వాటిలో దేవుడు తన జ్ఞానమునే చెప్పిపంపాడు. మూడు గ్రంథములలో మానవ కల్పిత జ్ఞానము కొంత చేరియున్నా, దానిని ప్రక్కన పెట్టిచూస్తే మూడింటిలో దేవుని జ్ఞానము ఉన్నదని తెలియుచున్నది. ఆ విషయము క్రైస్తవ బోధకులకు తెలియని దానివలన తమ బైబిలు మాత్రమే దేవున్ని గురించి బోధించు చున్నదనుకొన్నారు. మిగతా రెండు గ్రంథములను వారు బైబిలుతో సమానముగా చూడలేదు. తమ జ్ఞానమే గొప్పదనీ, తమ దేవుడే అసలైన దేవుడని అనుకొన్నారు. బైబిలు గ్రంథము భగవద్గీతను గొప్ప గ్రంథమని సమర్థించుచున్నదనీ, మత్తయి సువార్తలో ఐదవ అధ్యాయమున 17, 18వ వచనములయందు కలదనీ క్రైస్తవులు మరచిపోయారు. ఆ వాక్యములో ధర్మశాస్త్రమని చెప్పియుండగా, ధర్మశాస్త్రమంటే ఏమిటో వాస్తవముగా అర్థము

కాలేదు. ధర్మశాస్త్రము ఫలానిది అని తెలియలేకపోవడమువలనా, భగవద్గీత మరియు బైబిలు రెండింటియందు ధర్మశాస్త్రము ఇమిడియున్నదని తెలియకపోవడము వలనా, మా గ్రంథము, మా జ్ఞానము గొప్పదను భావములోయుండి మీ హిందూమతమును వదలి మా క్రైస్తవ మతము లోనికి రమ్మని బోధించుచున్నారు. పాతరోత, క్రొత్త వింతయన్నట్లు హిందువులలో అగ్రకులములు విధించిన అంటరానితనమును భరించలేక చాలామంది హిందువులు క్రైస్తవమతములో చేరిపోయారు. ఇప్పటికే ఎంతో మంది హిందువులు క్రైస్తవులుగా మారిపోగా, అదే దారిలో ఎంతోమంది హిందువులు క్రైస్తవులుగా మారుటకు ప్రయత్నించుచున్నారని అనుకుంటున్నాను. అయితే ఆ విధముగా ఎవరూ మతమును మారకుండా ఉండునట్లు మేము ఈ గ్రంథమును వ్రాయవలసివచ్చినది. ఈ గ్రంథము మతమార్పిడి మీద బ్రహ్మాస్త్రములాగా పని చేయగలదు. ఈ గ్రంథమును చదివిన తర్వాత ఎవరూ తమ మతమును మార్చుకొనుటకు ప్రయత్నించరు. అన్ని గ్రంథములూ సమానమనీ, అన్ని మతములూ సమానమనీ, అన్ని మతములకు ఒకే దేవుడనీ, తెలిసిన తర్వాత ఎవరూ తమ మతమును వీడి మరొక మతములోనికి పోరు.

ఒకవేళ హిందూమతములోయున్న అగ్రకులమువారైన బ్రాహ్మణులు అంటరానితనమును తమకు అంటగట్టి అవమానించుచున్నారని, దేవుని విషయములో తామే హక్కుదారులుగనున్నట్లు ప్రవర్తించుచున్నారని హిందువులు ఆరోపించి, అందువలననే మేము మతము మారాలను కొన్నామని అంటే దానికి సమాధానముగా మేము ఇలా చెప్పుచున్నాము. ఎలుకవచ్చి ఏటిలో పడితే, పిల్లివస్తుందని భయపడి చేపలు ఏరును వదలి పోతాయా? పోవు కదా! పిల్లివస్తే తప్పించుకొనేదానికి నీళ్ళున్నాయి, నీటిలో దొరకకుండ పారిపోయే స్థోమత ఉందిలే అనుకొని ధైర్యముగా ఉన్నట్లు,

బ్రాహ్మణులు అంటరానితనమును తమకు అంటగట్టి నీచముగా చూస్తున్నా రన్నప్పుడు వారివద్దకు మీరుపోకుండా వారినే మీరు వెలివేయవచ్చును కదా! వారివద్దకు మీరుపోతే అంటరానితనము, వారివద్దకు మీరు పోకపోతే వారు మిమ్ములను అవమానించేది, నీచముగా చూచేది, ఏమీ ఉండదు కదా! ఒకవేళ దేవుని జ్ఞానము తెలియాలంటే పూర్వము వారే చెప్పెడివారు. నేడు అలాకాకుండా అందరూ చదువుకొనునట్లు ఎన్నో ఆధ్యాత్మిక గ్రంథములున్నవి. అంతేకాక అందరికీ అందుబాటులో భగవద్గీతా గ్రంథము అన్ని భాషలలోనూ ఉన్నది. ఏదైనా స్వంతముగా చదువుకొని దైవ జ్ఞానమును తెలుసుకొనుటకు అందరికీ అనుకూలముగా మూడు దైవ గ్రంథములు తెలుగు భాషలోనే కాకుండా ఎవరికి కావలసిన భాషలో వారికి లభ్యమగుచున్నవి. అలాంటప్పుడు అగ్రకులము వారివద్దకు పోకుండా గ్రంథములు చదువుకొని దైవ జ్ఞానమును సంపూర్ణముగా తెలుసుకోవచ్చును. ఎక్కడైనా అర్థముకాని విషయములుంటే మాలాంటి వారిని సంప్రదించి అడిగి తెలుసుకోవచ్చును. అట్లుకాకుండా బ్రాహ్మణులను సాకుగా చూపి మతమును తమ ఆదాయముకొరకు గానీ, ఆర్థిక ఇబ్బందులు లేకుండా జరుగుతుందేమోననిగానీ, మతమును మార్చుకోవద్దండని తెలుపుచున్నాము.

ముఖ్యముగా హిందువులకు దైవజ్ఞానము తెలియకుండాపోయినది, కావున ఇతరులు హిందువులను సులభముగా తమ మతములోనికి మార్చు కొనుచున్నారని తెలిసిన మేము అలా జరుగకుండుటకు ముందు హిందువులకు జ్ఞానమును తెలియచేయాలను ఉద్దేశ్యముతో, అందరికీ అర్థమయ్యేలాగున మేము భగవద్గీతను వ్రాసి ఇచ్చాము. భగవద్గీతలో ముఖ్యముగా ఆత్మలను గురించి చెప్పడము జరిగినది. పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మలను విడదీసి విపులముగా చెప్పాము. ఇంతవరకు ఎవరూ తెలుపని

విధముగా అనేక విషయములను విపులీకరించి చెప్పాము. అద్వైత సిద్ధాంతము ఆధారముగా శంకరాచార్యులు తన జ్ఞానమునుపయోగించి భగవద్గీతను అనువదించి శంకరభాష్య భగవద్గీత అన్నాడు. అలాగే రామానుజాచార్యులువారు విశిష్టాద్వైత సిద్ధాంతము ప్రకారము భగవద్గీతను వ్రాశారు. ప్రస్తుతము మేము త్రైత సిద్ధాంతము ప్రకారము మా జ్ఞానమును ఉపయోగించి భగవద్గీతను "త్రైత సిద్ధాంత భగవద్గీత" గా వ్రాయడము జరిగినది.

మేము వ్రాసిన త్రైత సిద్ధాంత భగవద్గీతలో క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అను పదములకు ఇంతవరకూ ఏ భగవద్గీతలోగానీ, ఏ రచయితగానీ చెప్పని విషయమును మేము చెప్పడము వలన త్రైత సిద్ధాంత భగవద్గీత సంపూర్ణ జ్ఞానముతో కూడుకొన్న భగవద్గీత అయినది. ద్వితీయ దైవ గ్రంథమైన బైబిలులోనూ, అలాగే అంతిమ దైవ గ్రంథమైన ఖుర్ఆన్ లోనూ, ఆ రెండు గ్రంథములకంటే ముందు వచ్చిన గ్రంథము అయిన భగవద్గీతను ఆ రెండు గ్రంథములు సమర్థించుచున్నవి. బైబిలు, ఖుర్ఆన్ గ్రంథములు ముందువచ్చిన గ్రంథము యొక్క జ్ఞానము గొప్పదని ధృవీకరించుచూ సాక్ష్యమునిచ్చుచున్నవి. ఖుర్ఆన్ గ్రంథములో 6వ సూరాలో 92వ వాక్యములోనూ, బైబిలు గ్రంథము మత్తయి సువార్త ఐదవ అధ్యాయములో 17వ వాక్యములోనూ ముందువచ్చిన భగవద్గీతను ధృవీకరించుటకలదు. అలా ధృవీకరించుటకు అసలైన కారణమేమంటే ఆ రెండు గ్రంథములలోనూ భగవద్గీతలోని వాక్యములే కలవు. అయితే భగవద్గీతలోని ముఖ్య సూత్రములు బైబిలులోనూ, ఖుర్ఆన్ గ్రంథములోనూ కలవని ఎవరికీ తెలియదు. మూడు గ్రంథములలో ఒకే జ్ఞానమున్న విషయము కూడా మూడు మతములవారికీ తెలియకుండా పోయినది.

నేడు హిందూమత గ్రంథముగా భగవద్గీతను మనుషులు చెప్పుకోవడము జరుగుచున్నది. అలాగే క్రైస్తవులు వారి మత గ్రంథముగా బైబిలును చెప్పుకోవడము జరుగుచున్నది. ముస్లీమ్‌లు కూడా ఖుర్‌ఆన్‌ను వారి గ్రంథముగా చెప్పుకొంటున్నారు. బైబిలు, ఖుర్‌ఆన్ రెండు గ్రంథములు ముందు వచ్చిన భగవద్గీతను ధృవీకరించుచుండగా, పైన క్రైస్తవులు, ముస్లీమ్‌లు హిందువులను తమ మతములో చేర్చుకొనుటకు ధృవీకరించు కొన్నారు. బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములు రెండూ భగవద్గీతలోని ముఖ్య సూత్రములను కల్గియుండి, మేము ఈ గ్రంథమువైపు వారమేనని భగవద్గీతను బలపరుస్తున్నవి. ఆ విషయము తెలియని క్రైస్తవులు, ముస్లీమ్‌లు, భగవద్గీత లోని జ్ఞానమువేరు, మా జ్ఞానమువేరు అంటున్నారు. వారికి తెలిసినా, తెలియక పోయినా, భగవద్గీతలోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో ఉన్నది. భగవద్గీత జ్ఞానమే బైబిలులోనూ, ఖుర్‌ఆన్‌లోనూ ఉండుట వలన, ఒక మనిషి ఏ మతములోయున్నా వాడు జ్ఞాని అయితే భగవద్గీత జ్ఞానమునకు సంబంధించియున్నాడనియే చెప్పవచ్చును. అటువంటపుడు ఏ మనిషి ఏ మతములోయున్నా వాడు ప్రథమ దైవ గ్రంథమును అనుసరించిన జ్ఞానములోయున్నాడనియే చెప్పవచ్చును. అన్ని మత గ్రంథములతో ప్రథమ దైవ గ్రంథముయొక్క జ్ఞానము ముడిపడియుండుట వలన మనిషి ఏ మతములోయున్నా, ఏ గ్రంథము యొక్క జ్ఞానము కల్గియున్నా, అతనిని దైవజ్ఞాని అనియే చెప్పవచ్చును. జ్ఞాని అంటే ఇందువు. కావున ఒక మనిషి ఏ మతములో జ్ఞాని అయినా, ఆ మనిషిని ఇందువుగానే పరిగణించ వలెను. అట్టివానికి మతమును జోడించకూడదు. అందువలన ఇందువు క్రైస్తవుడా? అని అంటున్నాము. అలాగే ఇందువు ముస్లీమా? అనియు, ఇందువు హిందువా? అనియు అడుగవచ్చును.

ఒక మనిషి ఇందువైతే అతడు తనకు సంబంధించిన జ్ఞానము మిగతా రెండు గ్రంథములలోయున్నదని గ్రహించును. మిగతా రెండు గ్రంథములలోయున్న జ్ఞానమును గ్రహించిన తర్వాత ఆ మనిషికి అన్ని మతములు తనవేనను భావమువచ్చును. ఒక మతములోయుండి కూడా జ్ఞానము తెలియకుండా మతస్థునిగా మాత్రము ఉంటే, అతనికున్న అజ్ఞానము వలన మిగతా రెండుమతములూ అన్యమతములుగానే కనిపించును. అటువంటి వానిని జ్ఞాని అని అనలేము. అలాగే ఇందువు అనీ అనలేము. అటువంటివాడు ఏ మతములోవుంటే ఆ మతస్థునిగానే చెప్పవచ్చును. దేవుని జ్ఞానములేని వానిని ముస్లీమ్ అనియో, క్రైస్తవుడనియో, హిందువు అనియో మతము పేరుతో పిలువవచ్చును. ఒక మతములోయున్నా అతడు ముందు తన గ్రంథములోని జ్ఞానమును తెలియగల్గితే, జ్ఞానిగా (ఇందువుగా) మారిపోవును. తర్వాత మూడు దైవ గ్రంథములలోని జ్ఞానమును తెలియగల్గితే ఇందువునుండి యోగిగా మారిపోవును. యోగిగా మారినవాడు మూడు దైవ గ్రంథములలోని సారాంశమును పూర్తిగా తెలిసియుండును. అట్లని అతడు మూడు గ్రంథములలోని విషయములు కంఠాపాఠముగా చెప్పునని అనుకోకూడదు. జ్ఞాన భావములు తెలిసియుండునుగానీ, దేనినైనా నోటికి చెప్పు జ్ఞాపకశక్తి యుండునని అనుకోకూడదు. దేనినైనా వివరించి చెప్పు జ్ఞానశక్తి కల్గియుండునని తెలియాలి.

ప్రథమ దైవ గ్రంథము అయిన భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములలో ముగ్గురు పురుషుల విషయము కలదు. ముగ్గురు పురుషులలో క్షరుడు, అక్షరుడు అనువారు ఇద్దరు కలిసియుందురు. క్షరుడు, అక్షరుడు అను ఇద్దరు కాక మూడవ పురుషుడైన పురుషోత్తముడను వాడు ప్రత్యేకముగా ఉండును. పురుషోత్తముడను మూడవ పురుషుడు

ముల్లోకములలో వ్యాపించియుండును. వివరముగా చెప్పుకొంటే క్షరుడను ఒకటవది ప్రతి మనిషిలోనున్న జీవాత్మ అనియూ, అక్షరుడను రెండవది జీవాత్మతో పాటు కలిసి శరీరములోనున్న ఆత్మ అనియూ, పురుషోత్తముడను మూడవది క్షరుడు, అక్షరుడు కంటే వేరుగాయుండి, శరీరములోనే కాకుండా విశ్వమంతా వ్యాపించి యున్నది. ఈ మూడు ఆత్మల విషయము సాధారణముగా ఎవరికీ అర్థము కాలేదు. వివరముగా చెప్పుకొంటే క్షరాత్మ అనగా నాశనమగునదని అర్థము. ఎప్పటికైనా జీవుడు నశించి దేవునిగా మారవలసిందే, కావున శరీరములో జీవునిగానున్న ప్రతి ఒక్కడు క్షరాత్మగానే ఉన్నాడు. అక్షరుడు అనగా నాశనము లేనివాడని అర్థము. ప్రతి శరీరములో జీవునితోపాటు వానితో కలిసి శరీరమంతా వ్యాపించియున్న ఆత్మను అందరినీ నడిపించే ఆత్మ అంటున్నాము. ఇకపోతే మూడవ ఆత్మ రెండు ఆత్మలైన క్షరాక్షరులు అనువారికంటే ఉత్తముడు అయినందున మూడవ ఆత్మను పురుషోత్తముడు అంటున్నాము. పురుషోత్తముడినే పరమాత్మ అనియూ, దేవుడు అనియూ అంటున్నాము. పరమాత్మ అనునది విశ్వమంతా వ్యాపించియుండడమేకాక, అందరి శరీరములలో కూడా ఆవహించి యున్నది. ఈ విధముగా శరీరములో మూడు ఆత్మలున్నాయను విషయము ఎవరికీ తెలియదు.

శరీరములోనున్న ఆత్మలు పురుష సంబంధమైనవికాగా, శరీరము ప్రకృతి సంబంధమైనది. సృష్ఠికి పూర్వము దేవుడు విశ్వమును సృష్ఠించవలెనను తలంపుతో ముందు తనను నాలుగు భాగములుగా విభజించుకొన్నాడు. అందులో ఒక భాగము ప్రకృతికాగా, మిగతా మూడు భాగములు మూడు ఆత్మలుగాయున్నవి. ప్రకృతిని స్త్రీ తత్త్వముగా, మూడు ఆత్మలను పురుష తత్త్వముగా విభజించుకొన్న దేవుడు ఆత్మలలో మూడవదైన పురుషోత్తమ అను మూడవ ఆత్మగా తాను వుంటూ, మిగతా రెండిటినీ శరీరములో

ఉండునట్లు చేసి, మొదటిదైన జీవాత్మను నడిపింపబడు వానిగా, రెండవదైన ఆత్మ నడిపించేదిగా ఉండునట్లు దేవుడే చేశాడు. శరీరములో తోలే ఆత్మ, లేక నడిపించే ఆత్మ అక్షరుడుకాగా, తోలబడేవాడు లేక నడుపబడేవాడు క్షరుడైన జీవునిగా యున్నాడు. ఈ మూడు ఆత్మలను గురించి భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున చెప్పడమేకాక, మిగతా సందర్భములలో అనేకమార్లు చెప్పడము జరిగినది. ఈ విధముగా దేవుడు మూడు ఆత్మలుగా విభజింపబడియున్నాడు. ఈ విషయము భగవద్గీతలో ఎంతో విపులముగా యున్నా, హిందువులు తెలియలేకపోయారు.

ద్వితీయ దైవ గ్రంథమైన బైబిలులో మత్తయి అను సువార్తయందు 28వ అధ్యాయమున 19వ వాక్యములో తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ అను ముగ్గురిని గురించి చెప్పాడు. భగవద్గీతలో చెప్పిన ముగ్గురు పురుషులను గురించి బైబిలులో కూడా చెప్పడమైనది. అయితే గీతలో క్షరాక్షర పురుషోత్తములని చెప్పియుండగా, బైబిలులో కొంతమార్పుతో అక్షర క్షర పురుషోత్తమ అని చెప్పడమైనది. క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడుగా చెప్పిన ముగ్గురు పురుషులను, బైబిలు గ్రంథములో అక్షరుడు, క్షరుడు, పురుషోత్తముడని వరుస మార్చి చెప్పాడు. తండ్రి అక్షరుడు కాగా, కుమారుడు క్షరుడుగాయున్నాడు. మిగిలిన పరిశుద్ధాత్మ పరమాత్మగా యున్నాడు. ఈ విధముగా కొంత పేర్లు, కొంత వరుసక్రమము మార్చి చెప్పడము వలన, భగవద్గీతలో చెప్పిన విధానమే బైబిలులో చెప్పబడినదని తెలియుచున్నది. భగవద్గీతలో క్షరాక్షరులు అనగా జీవాత్మ ఆత్మ ఇద్దరూ కలిసి కూటస్థులుగా ఒకే శరీరములో యున్నారని చెప్పినట్లే, బైబిలులో తండ్రి కుమారుడుగా చెప్పబడు ఈ రెండు ఆత్మలు కలిసియున్నాయని, యోహాను సువార్త 10వ అధ్యాయము 30వ వచనమునందు **"నేనునూ తండ్రియు ఏకమై యున్నాము"** అనియూ, యోహాను సువార్త 14వ

అధ్యాయమున 10వ వాక్యమునందు **"తండ్రి యందు నేనునూ, నాయందు తండ్రియూ ఉన్నామని నీవు నమ్ముట లేదా?"** అనియూ ఉన్నది. జీవాత్మగా ఏసువుంటూ తనను జీవాత్మగా సరిపోల్చి కుమారునిగా చెప్పుకొన్నాడని తెలియవలెను. భగవద్గీతలో ఆత్మగా, జీవాత్మగా చెప్పుచూ రెండు ఆత్మలు కలిసి కూటస్థముగాయున్నాయని చెప్పగా, బైబిలులో తండ్రిగా కుమారునిగా రెండు ఆత్మలు కలిసి ఏకముగా యున్నాయని చెప్పారు. భగవద్గీతలో జోడు ఆత్మలుగా జీవాత్మ ఆత్మలున్నాయని చెప్పగా, బైబిలులో కూడా తండ్రి కుమారుడు ఇద్దరూ కలిసియున్నారని చెప్పడమైనది. భగవద్గీతయందు గానీ, బైబిలుయందుగానీ చెప్పిన విషయము ఒక్కటే అయినా, పేర్లు మార్చి ముందుది వెనుక, వెనుకది ముందు చెప్పడము వలన, రెండు గ్రంథములలో ఒకే సమాచారమును చెప్పారని ఎవరూ గుర్తించ లేకపోయారు. భగవద్గీత యందు మూడవ ఆత్మను పురుషోత్తముడనీ, పరమాత్మయనీ చెప్పియుండగా, బైబిలులో పరిశుద్ధాత్మయని చెప్పడమైనది. పరమాత్మనే పరిశుద్ధాత్మ అని చెప్పగా దానిని కూడా ఇటు హిందువులుగానీ, అటు క్రైస్తవులుగానీ గుర్తించలేకపోయారు. ఈ విధముగా రెండు గ్రంథములలోని ఆత్మల వివరమును రెండు మతములవారు తెలియలేక పోయారు. ఇంతవరకు తండ్రి ఎవరో క్రైస్తవులకు తెలియదు. అలాగే ఆత్మ ఎవరో హిందువులకు తెలియదు.

అంతిమ దైవ గ్రంథమైన ఖుర్ఆన్‌లో ఖాఫ్ సూరా (50), ఆయత్ 21 లో "ప్రతి వ్యక్తి తనవెంట ఒక తోలేవాడూ, ఒక సాక్ష్యము చెప్పేవాడూ ఉన్నస్థితిలో వస్తాడు" అని కలదు. ఈ వాక్యమును చూస్తే ఇది భగవద్గీతలో చెప్పిన క్షరాక్షర పురుషోత్తములను గురించి చెప్పినదని ఎవరైనా గుర్తు పట్టగలరా? గుర్తుపట్టినా పట్టకపోయినా ముమ్మాటికీ ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో చెప్పిన సమాచారమే ఈ వాక్యములో కలదు. భగవద్గీతలో

ముగ్గురు పురుషులుగా చెప్పినవారే బైబిలు గ్రంథములో తండ్రి, కొడుకు, పరిశుద్ధాత్మ అని చెప్పి, కొంత తికమక చేసి ముందు గ్రంథములోని సారాంశమే రెండవ గ్రంథములోయున్నదని సులభముగా ఎవరూ గుర్తుపట్టనట్లు చెప్పడము జరిగినది. మూడవ గ్రంథమైన ఖుర్ఆన్‌లో త్రోలేవాడు, త్రోలబడేవాడు, చూసేవాడు అని చెప్పడము వలన మూడు గ్రంథములలో ఒకే విషయమున్నదని సులభముగా తెలియుటకు అవకాశము లేకుండా పోయినది. నీ జ్ఞానము మాకు అర్థముకావలెనని కోరుకొని చూస్తే, మూడు గ్రంథములలోనూ మూడు విధములుగా కనిపించు మూడు వాక్యములు ఒక్కటే సారాంశమును బోధిస్తున్నవని తెలియగలదు. భగవద్గీతలోను బైబిలులోను మొదట ఇద్దరూ కలిసియున్నారనీ, మూడవ వాడు ప్రత్యేకముగా యున్నాడనీ తెలిసిపోయినది. ఇక్కడ ఖుర్ఆన్ గ్రంథములో కూడా మొదట ఇద్దరు ఒకచోటవుండి ఒకరికొకరు సంబంధము కల్గియున్నట్లు తెలియుచున్నది. త్రోలేవాడు ఆత్మ, త్రోలించుకొనువాడు జీవాత్మయని తెలిసిపోవుచున్నది. శరీరమునకంతటికీ అధికారియై, శరీరమంతా వ్యాపించి అన్ని అవయవములను ఆడించి పని చేయించునది ఆత్మేనని భగవద్గీతలో చెప్పుకొన్నారు. అదే విధముగా నిత్యము, ప్రతి నిమిషము, క్షణక్షణము మనిషిని తన చైతన్యముతో నడిపించునది ఆత్మయే అయినందున ఇక్కడ త్రోలేవాడు అని చెప్పుచూనే అతనిని ఆత్మగా, రెండవ పురుషుడైన అక్షరునిగా లెక్కించుకోవచ్చును. త్రోలబడేవాడు జీవాత్మయనీ లేక క్షర పురుషుడైన మొదటి పురుషుడనీ తెలియుచున్నది. ప్రక్కనుండి సాక్షిగా చూచువానిని మూడవ పురుషుడైన పరమాత్మగా లెక్కించవచ్చును. ఈ విధముగా మూడు రకములుగా మూడు గ్రంథము లలో చెప్పిన మూడు సమాచారములను ఒకే జ్ఞానముగా గుర్తించవచ్చును.

మేము ముందే చెప్పాము సంపూర్ణ జ్ఞానియైనవాడు యోగిగా మారగలడు అనియూ, యోగిగా మారినవాడు మూడు గ్రంథములలోని దైవ విషయములను గుర్తించగలడు అనియూ చెప్పాము. అలా గ్రంథములలో దైవ విషయములవలె మనుషులు చెప్పిన అజ్ఞాన విషయములు కలిసియుంటే, వాటిని కూడా గుర్తించగలడని చెప్పాము. దైవ గ్రంథములనబడు మూడు గ్రంథములలో జ్ఞానమేకాక మధ్యలో కలిసిన అజ్ఞాన కాలుష్యము కూడ కొంతయున్నదని తెలిసినది. అయితే కొందరు మనుషులు మరి కొందరు బోధకులు కాలుష్యమైన అజ్ఞాన విషయములనే తీసుకొని చెప్పుకొనుచుందురు. అటువంటివారు ఎవరు చెప్పినా వినరు. వారికి దేవుడే ఆ విధముగా తీర్పు తీర్చియుంటాడు. కావున వారు దైవ మార్గములో ఉన్నామనుకొని అజ్ఞాన మార్గములో పోవుచుందురు. అటువంటి వారికి జ్ఞాన విషయములు కూడా వేరు విధముగా అర్థమగుచుండును. అటువంటి వారిని వారి కర్మకు వదిలివేసి, చివరిగా మనము ఒక విషయమును చెప్పుకొందాము. మేము చెప్పు విషయమును చూచిన తర్వాత అంతవరకు రాని ప్రశ్నలు కొందరికి వచ్చి, దాని జవాబు కొరకు ప్రయత్నించి, చివరకు జవాబును తెలుసుకొని, దానిద్వారా కొంత జ్ఞానులుగా మారుటకు అవకాశము కలదు. అందువలన ప్రశ్న కలుగు ఒక విషయమును తీసుకొందాము.

బైబిలు గ్రంథమునందు యోహాను సువార్త 8వ అధ్యాయమున 16వ వచనములో ఈ విధముగా గలదు. "నేను ఒక్కడనై యుండక నేనునూ, నన్ను పంపిన తండ్రియూ కూడా ఉన్నాము. కనుకనే నేను తీర్పు తీర్చిననూ నా తీర్పు సత్యమే" అని ఏసు చెప్పినప్పుడు అక్కడున్న వారు ఆయన తండ్రిని గురించి అడిగారు (యోహాను 8.19) "నీ తండ్రి ఎక్కడున్నాడని ఆయనను అడుగగా, ఏసు మీరు నన్నైననూ, నా తండ్రినైననూ

ఎరుగరు. నన్ను ఎరిగియుంటిరా, నా తండ్రిని కూడా ఎరిగియుందురని వారితో చెప్పెను" ఈ వాక్యమును చూచారు కదా! శరీరముతో తిరిగే ఏసును చూచినవారితోనే ఆయన మీరు నన్ను చూచియుంటే, నా తండ్రిని కూడా చూచియుందురు అని అన్నారు కదా! ఒకవేళ అక్కడున్నవారు మేము నిన్ను చూస్తున్నాము అంటే అప్పుడు ఏసు "నన్ను చూచినప్పుడు నా తండ్రిని కూడా చూచియుందురు కదా! అటువంటప్పుడు నా తండ్రి ఎవరు అని ఎందుకు అడుగుచున్నారని" అడుగగలడు. అయితే తండ్రి కుమారుడు అని చెప్పినప్పుడు ఎవరైనా స్థూలముగా కనిపించు వారినే లెక్కించియుందురు. ఏసు తండ్రి ఎక్కడున్నాడో తెలియదుగానీ, ఎదురుగా యున్న ఏసు తెలుసునని అక్కడున్నవారు చెప్పగలరు. ఏసుప్రభువు ఫోటో చూచిన మనమైనా మేము ఏసును ఫోటోలో చూచామని చెప్పుదుము. అయితే ఇప్పుడు ఏసు చెప్పిన మాటలో నన్నుగానీ, నా తండ్రినిగానీ చూడలేరు అనగా! అప్పుడు ఎవరికైనా కనిపించే మనిషి ఏసు కాదా!యని ప్రశ్న రాగలదు.

మనము కొంత వివరముగా చెప్పుకొంటే తండ్రి అంటే పుట్టించు వాడు అనియూ, కుమారుడు అంటే పుట్టినవాడు అనియూ అర్థము. కొడుకు యుంటే తండ్రి యుండును. కొడుకు ఎట్లుంటే తండ్రి కూడా రూపములో కొంత అటు ఇటుగా కొడుకువలె ఉండును. అయితే ఇప్పుడు అందరికీ కనిపించే ఏసు మీరు ఎవరూ నన్ను చూడలేరు అన్నాడు. అలా అన్నప్పుడు ఈయన కనిపించే మనిషే కదా! నన్ను చూడలేరు అంటాడేమిటి? అని ఎవరికైనా ప్రశ్న వస్తుంది. ఏసు తనను చూడలేరు అంటే ఆయన కనిపించు శరీరము కాదు, కనిపించని జీవాత్మయని అర్థమగుచున్నది. అలాగే తండ్రి అని పిలువబడువాడు కూడా కనిపించని ఆత్మయని తెలియుచున్నది. ఆత్మ ఎల్లప్పుడు శరీరమును జీవాత్మను ఆక్రమించి అన్ని పనులు చేయుచున్నది.

శరీరములోపల కదిలించెడి శక్తిగాయుండి కదలించుచూ అన్ని పనులనూ ఆత్మయే చేయుటవలన, ఆ విషయము తెలిసిన ఏసు నేను మాట్లాడు మాట నాది కాదు నా తండ్రిది యన్నాడు. అలాగే కొన్ని సందర్భములలో **"నేను చేయు ప్రతి క్రియ నా తండ్రి ఆజ్ఞవలన చేసినదే గానీ నేను స్వయముగా చేయలేదు"** అన్నాడు. ప్రతి విషయములోను తనమీద దేనినీపెట్టుకోక అంతయు తండ్రివలననే జరుగుచున్నదని చెప్పాడు అంటే కనిపించని తండ్రి కూడా ఏసుతో పాటు శరీరములోయున్నాడని తెలియు చున్నది. భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగమున చెప్పినట్లే ఆత్మ జీవాత్మల విషయము కలదు. పరమాత్మ, ఆత్మ జీవాత్మలకంటే వేరుగాయుండి ఏమియూ చేయక యున్నాడు కావున, ఏ విషయములోనూ పరిశుద్ధాత్మయిన పరమాత్మను చెప్పకుండా, బైబిలులో ఎక్కువగా రెండవ ఆత్మయిన తండ్రిని గురించే చెప్పడము జరిగినది.

ఏసు బైబిలు గ్రంథములో చెప్పిన రెండు ఆత్మల విషయమంతయు భగవద్గీతలో ముందే చెప్పడమైనది. హిందువులకు ముఖ్య గ్రంథమైన భగవద్గీతలో ముందే చెప్పిన విషయములే, అవే ధర్మములే బైబిలులో ఉన్నప్పుడు భగవద్గీతను అతిక్రమించి ఏదీ బైబిలులో లేనప్పుడు ఒక హిందువు క్రైస్తవుడుగా మారవలసిన అవసరమేమి వచ్చినది? భగవద్గీతలో లేని జ్ఞానము బైబిలులో ఉంటే హిందువైనవాడు క్రైస్తవములోనికి పోవచ్చును. భగవద్గీతలో ఉన్నవన్నీ బైబిలులోయున్నప్పుడు, బైబిలు భగవద్గీతలోని జ్ఞానమే నాలోయున్నది అని ధృవీకరించి సాక్ష్యమిచ్చునప్పుడు, హిందువుగానున్న వాడు క్రైస్తవునిగా మారితే భగవద్గీతను అవమానించినట్లగును. భగవద్గీతను అవమానించినప్పుడు దానిని అనుసరించియుండు బైబిలును కూడా కించపరచినట్లేయగును. అటువంటప్పుడు క్రైస్తవము లోనికిపోయినా వానికి దేవుని జ్ఞానము ఏమాత్రమూ అంటదు. అదే విధముగా ఏ

మతమువాడుగానీ, వాని మతమును వీడి పరమతములోనికి పోతే వాని మత గ్రంథమునూ మరియూ చేరిన మత గ్రంథమునూ రెండిటినీ అవమానించినట్లగును. దైవ గ్రంథములనే అగౌరవపరచినప్పుడు, అటువంటివానికి దైవజ్ఞానము ఏమాత్రము లభ్యముకాదు. అంతేకాక అంతవరకు ఉన్న జ్ఞానము కూడా లేకుండా పోవును. ఏ మతములోని వాడు ఆ మతములోనేయుండి, ఆ మతమునకు సంబంధించిన గ్రంథము లోనే జ్ఞానమును తెలుసుకొనుచూ జ్ఞానాభివృద్ధి చేసుకొంటే, అటువంటివాడు తొందరగా జ్ఞానిగా (ఇందువుగా) మారగలడు. అలా జ్ఞానిగా మారినవాడు అనతికాలములోనే యోగిగా మారగలడు. యోగిగా మారినవాడు మూడు దైవ గ్రంథములలో ఒకే జ్ఞానమును చూడగల్గును. క్షర, అక్షర, పురుషోత్తము లను మూడు గ్రంథములలోను నేను చూపించినట్లు మిగతా జ్ఞానము నంతటినీ మూడు గ్రంథములలో చూడగలడు. **అలా మూడు గ్రంథము లలో ఒకే జ్ఞానమును చూచినవాడు అదే జన్మలోనే జన్మ రాహిత్యమును పొంది దేవునియందు ఐక్యమగును.** అందువలన ప్రతి ఒక్కరూ తాము ఉన్న మతములోనే ఉంటూ జ్ఞానిగా, యోగిగా మారి మోక్షమును పొందవలెనని ఆశిస్తూ ముగించుచున్నాను.

## సమాప్తము



**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

